


దక్షిణ భాషా పుస్తక సంస్థ
సహకారమున ప్రకటితము

రు 1.50

# కథామంజరి

## గురజాడ, విశ్వనాథ, గోపీచంద్
## కొడవటిగంటి, సరస్వతీదేవి...
## వారి కథలు

# కథామంజరి

( పది కథలు )

సంకలన:

మాలతీ చందూర్



ప్రతిమా బుక్స్
49 మాకతాల్ వీధి
మద్రాసు - 7

# విషయసూచిక

# కృతజ్ఞత

మేము అడిగినతడవుగా మా కోరిక మన్నించి, ఈ 'కథామంజరి' లో తమ కథలు చేర్చడానికి అనుమతియిచ్చిన ఆయా రచయితలకు, ప్రచురణకర్తలకు, హక్కుదారులకు మా కృతజ్ఞతాభివందనములు. కథ పేరూ, అనుమతి యిచ్చినవారిపేరూ ఉదహరిస్తున్నాము.

| | |
|---|---|
| ఏమి సంబంధము ? | విశ్వనాధ సత్యనారాయణ |
| శైలబాల | అడవి సత్యనారాయణ |
| మీ పేరేమిటి ? | విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ |
| శేషమ్మ | గుడిపాటి వెంకటచలం; దేశి కవితా మండలి |
| ధర్మవడ్డీ | త్రిపురనేని గోపీచంద్; దేశి కవితా మండలి |
| తిండిదొంగ | కొడవటిగంటి కుటుంబరావు |
| సూవరెంటు కూతురు | చింతా దీక్షితులు |
| బలీయసీ కేవల మీశ్వరాజ్ఞ | ఇల్లిందల సరస్వతీదేవి |
| పడవ ప్రయాణం | పాలగుమ్మి పద్మరాజు |
| నన్నుగురించి కథ వ్రాయవూ ? | ఎస్. వి. సుబ్బారావు |

పైన పేర్కొన్నవారందరి సహకారమువల్లనే ఈ 'కథామంజరి' ని తెలుగుప్రజకి అర్పించగల అవకాశం మాకు లభించింది.

# పరిచయం

దక్షిణ భాషా పుస్తక సంస్థవారు ప్రోత్సహించిన ఉత్తమ గ్రంథ సంచయములోని తొలి ప్రచురణలివి. తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం – నాలుగు దక్షిణాది భాషలలో విద్యా సాంస్కృతిక వికాసాలకు దోహదమిచ్చే ఉత్తమ గ్రంథాలను చౌకగా ప్రచురింప చేయాలనే సత్సంకల్పంతో, సముదార దూర దృష్టితో ఫోర్డు ధర్మనిధి వారు ఈ సంస్థ నిర్మాణాన్ని తలపెట్టారు. ఇందుకోసం వారు దక్షిణ దేశంలో ఉన్న ఏడు విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులతోను సంప్రదించి ఈనాలుగు భాషలు మాట్లాడే ప్రజలకు, మంచి పుస్తకాలను, ప్రచురణ కర్తలచే అందంగా అచ్చువేయించి అందరికి అందుబాటులో ఉండే సరసమైన ధరలకు అందచేయాలనే ఆదర్శంతో మూడేళ్ళ కార్యక్రమాన్ని రూపొందించారు. వీరి కృషివలన మనకు లభించిన ప్రథమ ఫలాలివి. దీన్ని కూర్చడంలో వీరు ప్రౌఢశైలిలో ఉండే విద్వత్కావ్యాల జోలికి పోకుండా కేవలం మాతృభాషలో మాత్రమే అక్షరాస్యులైన, ఆంగ్ల భాషావాసన లేని అసంఖ్యాక సామాన్య ప్రజానీకాన్ని అలరించి, ఆకర్షించి, వారికి విజ్ఞానాన్ని, వినోదాన్ని, వికాసాన్ని పూర్తిగా

అందించగల సులభ సుందర శైలిలో ఉన్న ఉత్తమ గ్రంథా లను మాత్రమే ఎన్నుకున్నారు.

ఉన్నత సారస్వత శ్రేణికి చెందిన స్వతంత్ర రచనలనే కాకుండా వైజ్ఞానిక, సాంస్కృతిక గ్రంథాలనూ, ప్రపంచ సారస్వతంలోని ఉత్తమ గ్రంథాల అనువాదాలనూ కూడా ప్రచురింపచేయడం వీరి ప్రధానలక్ష్యం.

ఒక్కమాటలో చెప్పాలంటే "ఉత్తమ గ్రంథాలను చౌకగా అందించడం" అనేదే దక్షిణభాషా పుస్తక సంస్థ వారి పరమాశయం. ఇందులో వీరెంతవరకు కృతకృత్యు లైనదీ ఇప్పుడీ గ్రంథాలను బట్టి ప్రజలే నిర్ణయించవలసి ఉంది. ఇప్పుడు ప్రారంభమైన ఈ కృషి ఫలితం బహుశా వచ్చే పదిసంవత్సరాల వరకు అంతగా కనపడకపోవచ్చు. కాని ఈ ప్రణాళిక అద్భుతమైనదని, అత్యంత ప్రధానమైన దని మాత్రం దూరదృష్టి గలవారందరూ ఒప్పుకోనక తప్పదు. ఇందుకు గల అవకాశాలు అనేకం. అందమైన అచ్చులో చౌకగా అందరికీ అందుబాటులో ఉండే ఈ ఉత్తమ గ్రంథాలు దేశంలో మారుమూల కుగ్రామాలలో నివసించే లక్షలాది స్త్రీ పురుషులందరి జీవితాలకు కొత్త వెలు గునీ, విజ్ఞానాన్నీ అందించగలవు.

దక్షిణ భాషా పుస్తకసంస్థవారి కార్యక్రమాలు ప్రస్తు తానికి తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం - నాలుగు దక్షిణాది భాషలకే పరిమితమై ఉండడం వింతకాదు. ప్రాచీన కాలంలో వింధ్యకు దక్షిణాన ఉండే దేశమంతా దక్షిణా పథ మనే పేరుతో వ్యవహారంలోఉన్నప్పటికీ, సాంస్కృతికంగా

ఇక్కడ నివసించే ప్రజలందరూ ఈనాలుగు భాషలనూ వాటి ప్రాంతీయ వికృతులను మాత్రమే వాడుక చేసేవారు. నిజానికి ఈ నాలుగు భాషలున్నూ ఒకేకోవకి చెందినవి. వీటిని 'ద్రావిడ' భాషలనడం నా అభిమతంకాదు. ఈ రోజుల్లో 'ద్రావిడ' పదం జాతి, భాషాపరమైనదిగాకాక ప్రత్యేకమైన రాజకీయ ప్రాధాన్యాన్ని సంతరించుకోవడమే నా యీ సంకోచానికి కారణం. ఈనాలుగు భాషలకు మధ్య సహజమైన సన్నిహిత సంబంధాలు చాలావున్నవి. పైగా ఆర్యావర్తంలో వ్యాప్తిలో ఉన్న సంస్కృతి కంటె భిన్నమైన దక్షిణ భారతీయ సంస్కృతికి ఈ ప్రాంతం ఆటపట్టు. కర్ణాటక సంగీత సంప్రదాయం ఇక్కడిదే. అలాగే ఇక్కడి వాస్తు, శిల్పసంపద ఉత్తరాది దానికంటె భిన్నమైనది. ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలు అనూచానంగా అనుసరించే సాంఘికాచార వ్యవహారాలన్నీ కూడా ఒక్కటే.

దక్షిణ భాషా పుస్తక సంస్థవారి ప్రోత్సాహం వల్ల ప్రచురితమయ్యే పుస్తకాలన్నీ దాక్షిణాత్య సంస్కృతిని ప్రతిబింబించేవిగా ఉండగలవని ఆశిస్తున్నాను. అయితే సంకుచితమైన స్వస్థాన భాషా వేషానురతి శ్రుతి మించి పోకుండా సమగ్ర భారత సంస్కృతిని ప్రతిబింబింపజేసే పుస్తకాలను, విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని, ప్రపంచ కల్యాణాన్ని కాంక్షించే ఉత్తమ గ్రంథాల అనువాదాలను ప్రచురించడం అవసరం.

పా. వేం. రాజమన్నారు

# తొలిపలుకు

కథ తెలుగుభాషకు కొత్తదికాదు. నిజానికి ఏభాషకూ' చివరికి ఆటవికుల భాషకైనా, అది కొత్తది కాదనే చెప్పవచ్చు. మన ఆలోచనలను, మన అనుభూతులను పరులతో పంచుకొనడానికే భాష. వాటిని క్రమబద్ధంగా, కళాత్మకంగా రమ్యంగా, రసవత్తరంగా పంచిపెట్టినప్పుడు అది కథ అవుతుంది. నాగరికునికి వుండే ఆలోచనలు ఆట వికునికి వుండకపోవచ్చు. ఇతని అనుభూతులు అతనివి కాక పోవచ్చు. అయినా, అతనికివుండే ఆలోచనలు, అను భూతులు అతనికీ వుంటాయి. అందువల్లనే ఏసంఘంలో నైనా భాషతోపాటే కథ పుడుతుంది; కథను పెనవైచు కొని కవిత పొంగులెత్తుతుంది.

అన్ని భాషలలోవలె తెలుగులోకూడా కథ ఆది కాలంనుంచి వున్నా, ఆంధ్రసాహిత్యానికి ఒక ప్రధానాం గంగా అది పరిఢవిల్లింది ఆధునికయుగంలోనే. పిట్టకథలు, పేరాసి పెద్దమ్మ కథలు, కాశీమజిలీ కథలు మొదలైన వాటితో పోల్చదగినవి తప్ప, ప్రస్తుతం ప్రపంచసాహిత్యంలో "చిన్నకథ" గా చెల్లుతున్నట్టిది ఇంచుమించుగా 20 శతా బ్దానికి పూర్వం పాశ్చాత్య దేశాలలోనైనా లేదు. పారి శ్రామికయుగం పూర్తిగా పాదుకొన్న తర్వాత అతః పూర్వపు అభిరుచులు మారినవి; ఆచార వ్యవహారాలు

మారినవి; జీవితదృక్పథమే చాలావరకు మారిపోయింది. ఈ మార్పు లన్నింటిని అంతర్భూతం చేసుకొన్న మీదట ఆవిర్భవించినట్టిదే "చిన్నకథ."

చిన్నదైనందువల్లనే అది చిన్నకథ కాలేదు. ఏ కాదంబరితోనో, ఏ కాశీమజిలీతోనో పోల్చినప్పుడు అది నాతిదీర్ఘమైనదే కావచ్చు. కాని, ప్రాచీనకాలంనుంచీ మనకున్న పిట్టకథల కంటె పొట్టివి ఈనాడు ఎన్ని వెలువడుతున్నాయి? కాబటి కేవలం "పొట్టి - పొడుగు" లనుబట్టే "ఇది చిన్నకథ; ఇది కాదు" అని నిర్ణయించడానికి వీలులేదు. దానియెత్తుగడలో, దాని నడకలో, దాని ముగింపులో, దాని యితివృత్తంలో, దాని పాత్రలలో, ఆపాత్రల పోషణలో కొన్ని ప్రత్యేకతలే, కొన్నివిశిష్టతలే "చిన్న కథ"ను తక్కిన కథాసాహిత్యంనుంచి వేరుచేస్తున్నాయి; అవే వర్తమానసాహిత్యంలో దానికి ఒక ప్రముఖస్థానాన్ని సంపాదించి పెట్టాయి.

చిన్నకథ ప్రత్యేకతలను, విశిష్టతలను చర్చించడానికి ఇది సమయమూ కాదు; సందర్భమూ కాదు. కాని, పాశ్చాత్య సాహిత్యంతో సన్నిహిత పరిచయ మేర్పడిన పిమ్మటనే, దాని ప్రభావం ఆంధ్ర రచయితపై బలంగా పడిన పిమ్మటనే నవలవలె, ఆత్మకథవలె, ఆత్మాశ్రయ కవిత్వంవలె చిన్నకథ సయితం తెలుగుతోటలో పూచిందని చెప్పవలసి వుంటుంది. ఈ నాల్గింటిలోను మొదటి రెండింటికంటె చివరి రెండు సాహిత్య విభాగాలే హెచ్చుగా పూచి, హెచ్చుగా తమ తావులను నలుదిక్కులకు విరజిమ్ము తున్నవి.

పాశ్చాత్య ప్రభావ సంజనితమైనది కాబట్టి, తెలుగు చిన్నకథపై సహజంగా పాశ్చాత్య రచయితల ప్రభావం కొంతవరకు కానవస్తుంది. టాల్‌స్టాయ్, చెఖోవ్, మపాసా, ఓ. హెన్రీ, డి. హెచ్. లారెన్స్, మామ్, హెమింగ్వే, కేథరీన్ మ్యాన్స్‌ఫీల్డ్, హెచ్. ఇ. బేట్స్, ఫ్రాంక్ ఓ కోనార్, విలియం శారోయన్ ప్రభృతుల ప్రభావం బలీయం కాగా, వారిని అనుకరించడానికి ప్రయత్నించిన - ప్రయత్నిస్తున్న - కథకులు పెక్కుమందివున్నా, గురజాడ మొదలు, పద్మరాజు వరకు కథాశిల్పంపై అధికారాన్ని సంపాదించి, ప్రతిభా పూర్వకంగా స్వతంత్ర రచనలను కొనసాగించిన వారు కూడా ఎన్నదగు సంఖ్యలో లేకపోలేదు. తక్కిన రాష్ట్రాలలోనేగాక, కొంతవరకు ఇతర దేశాలలో సయితం ఈ సిద్ధహస్తులు తెలుగుకథకు మన్నన సంపాదించగలిగారు.

ప్రపంచ కథా సాహిత్యంలోనే గౌరవస్థానానికి అర్హమైన కథలు అనేకం తెలుగులో వున్నందున, ఈ 'కథామంజరి' సంకలన సందర్భంలో "ఏ కథను ఎన్నుకొనడం?" అనేది కాక, "దేన్ని విడిచిపెట్టడం?" అన్నది ఒక పెద్ద సమస్యగా పరిణమించింది. కనీసం ఒక వెయ్యిపుటలను నింపడానికి తగినన్ని ఉత్తమ కథలు ఈనాడు తెలుగులో వున్నాయనడం అత్యుక్తి కాదు. ఉత్తమ కథకులుగా పరిగణించదగువారు ఈ సంపుటిలో కానవచ్చే వారికి కనీసం రెండు, మూడు రెట్లు వుంటారు కూడా!

వినోద, విజ్ఞాన, వికాసాలకు దోహదమిచ్చే గ్రంథ జాలాన్ని ప్రజా బాహుళ్యానికి అందుబాటులో వుండగల ధర

లకు అందించడమే ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్న దక్షిణభాషా పుస్తక సంస్థవారు ఏర్పరచిన పుటల సంఖ్యాపరిమితుల లోపల కథావస్తువులో, శిల్పంలో వీలైనంత వైవిధ్యాన్ని ప్రతిబింబింప జేయడానికి ఈ సంకలనలో ప్రయత్నించబడింది. కాగా, ఈ సంకలనను గురించి మరొకమాట: శ్రీమతి మాలతీ చందూర్ దీనికొక రూపమివ్వడంలో ప్రత్యేకించి కృషిచేశారు. కథారచయితలను గురించిన పరిచయ వాక్యాలుకూడా ఆమె కూర్చినవే.

ఉత్తమమైన ఆంధ్ర కథా సాహిత్యానికి ఈ సంపుటి వాచవిగా ఉపకరిస్తుందనీ, పాఠకుల మన్ననలకు పాత్రం కావడం ద్వారా ఇట్టి సంకలనలు మరెన్నో వెలువడ్డానికి ఇది దోహద మివ్వగలదనీ ఆశిస్తున్నాను.

నార్ల వెంకటేశ్వరరావు

విశ్వనాధ సత్యనారాయణ

# ఏమి సంబంధము

విశ్వనాధవారి కలం నుంచి వెలువడ్డ 'కిన్నెర సాని' అమరత్వం పొందింది. 'వేయి పడగలు' నవల తెలుగు జీవిత మొక్కదానికేకాదు - భారతీయ నాగరికతకే ప్రతిబింబం. మహా కవిగా, నవలా రచయితగా, విశ్వనాధ అంతవారు తెలుగుదేశాన మరొకరులేరు. ఏమైనా వీరి కధలు, నవల నడిచినంత తీవిగా, కవిత్వమంత మృదువుగా నడవవు - కాని వీరి రచన లేనిదే ఏ సాహిత్య సంపుటికీ పరిపూర్ణతరాదు.

అప్పటికి నాకు పదహారేండ్లో, పదిహేడేండ్లో, నాకు సరిగా జ్ఞాపకంలేదు. ఏదో బంధువుల యింట్లో పెళ్లికి వెళ్లాం ఒక ఊరు. మేము మగపెళ్లివారము. ఒక యిల్లు విడిదికి యిచ్చారు. ఆ యింటివాళ్లు వాళ్ళయింట్లో కొంతమేర సర్దుకొని తక్కినభాగం విడిదికి వదలిపెట్టారు. కాని అది పల్లెటూరు. అయిదు రోజులపెండ్లి. పెళ్ళివారింటికి ఆ యింటివారు

కూడ రెండుపూటలు భోజనానికి. రెండురోజులు గడిచేటప్పటికి వాళ్ళూ వీళ్ళూ కలిసి చనువుగా ఉంటున్నారు. మూడవరోజున మధ్యాహ్నం అనుకొంటాను, నే నా చావట్లో పడుకొన్నాను. ఆ యింటాయన చనిపోయాడు. ఆయన భార్య, కూతురు ఆయింట్లో ఉంటున్నారు. మగపిల్లలున్నారు. వాళ్లు చదువుకోటానికి వెళ్లారోయేమో? ఊళ్ళో లేరు. ఈ రెండు రోజులమట్టీ నే నెవ్వరో వాళ్ళకు తెలుసు. నేను చదువుకొంటున్నానని, మాది అన్నోదకాలకు లోపంలేని సంసారమని ఆవిడకి తెలిసింది. నేను కొంచెం తెలుగులతో పరిచయం చేయడం, కంఠమెత్తి పద్యం శ్రావ్యంగా చదవటం అప్పటికే ఉంది. సామాన్యంగా మనయిళ్ళల్లో ఆడవాళ్లు భర్తలు పోయినతర్వాత భారతమో, భాగవతమో, భక్తవిజయమో, ఇల్లాంటి గ్రంథాలు చదువుకుంటూ కాలక్షేపం చెయ్యటం సహజమే. ఆవిడకూడా అటువంటిదే. అందుచేత నేను తెలుగు పుస్తకాలతో పరిచయం కలవాణ్ణి అని తెలియటం మూలంగా నే నంటే ఈ రెండురోజుల్లో కొంచె మభిమానంగా ఉంది.

ఆవిడ కూతురు అప్పటికి పదేండ్లపిల్ల. కాలిపొడుగరి. చిదిపిదీపం పెట్టవచ్చు. తల్లి చాలా భారీమనిషి. ఆ అమ్మాయి కూడా పెద్దదైతే తల్లియంతది ఔతుందిలాగా ఉంది. పుష్టిగల పిల్ల. చేతులు పొట్లాలల్లే ఉన్నవి. ఆ మొగములోని అందము చెప్పటానికి వీలులేదు. పెద్దకళ్లు, గుబురుగా పెరిగిన నల్లని కనుబొమలు. భగవంతుడు సౌందర్యం అంటే ఇట్లా ఉండాలి అని చేసి చూపినట్లుగా ఉంది ఆమె మొగం. ఆపిల్ల నవ్వుతుంటే ఇప్పుడు తలుచుకుంటే అప్పుడు నేనెంత

ఉవ్విళ్లూరానో తెలుస్తోంది. కాని ఆ పిల్లను చూచి నే నెంత సంతోషించానో మనస్సులో అంత దిగులూ పడ్డాను. మా నాయనగారు నాకు పదియవయేటనే పెండ్లి చేశారు.

ఆ మధ్యాహ్నం సావిట్లో పండుకొని ఉండగా ఆ తల్లి, కూతురు ఇద్దరూ వచ్చారు. ఆ తల్లి సన్నమైనా పద్యాలు చదవమన్నది. నేను చదివాను. ఆవిడ చాలా సంతోషించింది.

ఆ కూతురు ఎంత అందకత్తెయో అంత చిలిపిపిల్ల. ఆ పిల్ల నాతో సరాగాలాడటం మొదలు పెట్టింది. అప్పటికి చిన్నతనం విమృతంకాని జీవితంలో ఉన్న మోహమంతా సుందరంగా భావించే రోజులు. ఆ పిల్ల దగ్గరకువస్తే, నాతో మాట్లాడితే, నవ్వితే, పరాచికాలాడితే అప్పుడు నా శరీర మంతా పులకితమైంది. నా మనస్సంతా ఆనందధామమైంది. ఆ పిల్ల శరీరచ్ఛాయ మేలిమిబంగారం. ఆ కాంతి వ్యాపించి నా శరీరంలో చొచ్చి నే నేదో ఒక తేజోమూర్తి నైనా ననిపించింది.

ఆ రోజున సదస్యమవటం మూలంగా పెళ్ళివారందరూ పెళ్ళియింట్లోనే ఉన్నారు. మేము ముగ్గురమే విడిదిలో ఉన్నాము. ఆ పిల్ల చేసిన కొంటెపనులన్నీ జ్ఞాపకం లేవు. లీలగా ఈ ఒక్క విషయమే జ్ఞాపకముంది.

నేను చిన్నప్పటినుండి బస్తీల్లో చదవటం మూలంగా పల్లెటూరి విషయాలు నాకు తెలియనివి కొన్ని మిగిలి పోయినై. అన్ని చెట్లు ఎరుగుదును. అన్ని మొక్కలు ఎరుగు దును, సీమ మెరపకాయమాత్రం మెరుగను. సరిగా అది గండు చీమంత ఉంటుంది. ఆ ప్రమాణంలోనే పండుతుంది. ఆ పిల్ల

వాళ్ళదొడ్లోకిపోయి పండిన యీ సీమ మెరపకాయ తెచ్చి నాకిచ్చి యిది తియ్యగా ఉంటుంది తినమన్నది. అందులో తెలివిగా ఏమిచేసిందంటే, తొడిమ లేకుండా తెచ్చింది. కామించి పళ్ళు మొదలైనవి యెరుగుదును. ఇది అట్లాంటి దేమో ననుకొన్నాను. అని నోట్లో వేసికొని నమలితిని. ఇంక చూడు నోరుమండిపోయింది. ఆ మంటని పట్టుకోవటం కష్టమైంది. అటు పరుగెత్తి నీళ్ళు పుక్కిలించి ఉమిసి ఎంత చేసినా కారము తగ్గదు. కళ్ల వెంట నీళ్లు, ఆపసోపాలు పడటం, చెవులల్లోంచి పొగరావటం, నే నింత బాధపడుతుంటే ఆ పిల్ల నవ్వటం, తల్లి చిరునవ్వుతో తూష్ణీంభావం వహించటం. ఇద్దరిలోనూ నాయందు ద్వేషంలేదు. ఇద్దరికీ నే నంటే అభిమానం ఉన్నది. నేను తెలివితక్కువగా ఆకాయ నమలట మేమిటి? నా మనస్సులో కొంతసిగ్గూ ఉన్నది. ఆ పిల్లమీద నాకు గలప్రేమని నా చిన్నతనపు తెలివితక్కువ వలన వచ్చిన సిగ్గు వెక్కిరించింది. ఆ పిల్ల నేను బాధపడుతుంటే సంతోషించటానికి కోపం వచ్చింది కాని ఆసిగ్గునూ కోపాన్నీ అణచిపెట్టి నేనుకూడా అదంతా ఒక సరదాలాగా నటించక తప్పక వచ్చింది.

నాకు వివాహ మైందని ప్రసంగంలో మా అమ్మగారి వల్ల ఆవిడకి తెలిసింది. ఆవిడ నవ్వుతూ "అయ్యో అల్లాగా, మా అమ్మాయిని మీరు చేసుకుంటా రనుకున్నానే!" అంది. పెళ్ళి అయిదవరోజున మాదారిని మేము వచ్చేశాం. తరువాత యేడాదికో రెండేండ్లకో నాభార్య కాపురానికి వచ్చింది. ఆ పిల్లనుగురించి ఐదారేండ్లు తలచుకొంటూ ఉండేవాడిని.

వాళ్ళకూ మాకూ బాంధవ్యమూ లేదు. ఆ యూరికీ మాకూ సంబంధమూ లేదు. పూర్తిగా మరచియే పోయినాను.

## 2

మంచి నడివేసంగి. ప్రొద్దుటిమట్టి భోజనం లేదు. బెజవాడలో ప్రొద్దున్నే ఆరుగంటల కెక్కితే సాయంత్రం అయిదున్నరకి గుంటకల్లులో దిగింది బండి. నేను అనంతపురం వెళ్లుతున్నాను. ఆ రోజున శుద్ధసప్తమి అనుకొంటాను. సంజ వెన్నెల కాస్తున్నది. అనంతపురం బండి బయల్దేరింది. నాలుక పిడుచగట్టుతోంది. ఈ చెవిలో గాలి ఆ చెవిలో దూసుకొంటోంది. ఆగాలి మొగంమీద చేతులకు తగిలినంత మేర విరవిరలాడి పోతున్నది. ఆ రైలుబండి యెందుకువచ్చిందిరా బాబూ అన్నట్టు నడుస్తున్నది. దూరాన చిన్నిచిన్ని గుట్టలు చీకటి ముద్దలు పడ్డట్టు కూర్చున్నవి. ఎటుచూచినా రాళ్లే. రైలు వాగులమీదుగా పోతున్నది. వాగులలోని యిసుక వెన్నెలలో నీళ్లులేక నాలుక చాచినట్లున్నది. రైలు పెట్టెలలో నీళ్ళు లేవు. స్టేషను వస్తుందిగదా అక్కడ మంచినీళ్లు దొరకుతవని ఎదురుచూచాను. ఒక స్టేషను, రెండు స్టేషనులు, ఏ స్టేషనులోనూ నీళ్ళు లేవు. త్రాగేనీళ్ళని డబ్బాలలో పెట్టారు. వాటిల్లో నీళ్ళు లేవు. నా ప్రాణం తహతహలాడి పోతోంది. అప్పటికే తొమ్మిది కావస్తోంది. ప్రతి స్టేషనులో దిగటం, ఆ పరుచుకు పోయిన వెన్నెల్లో రాత్రి ప్లాటుఫారములమీద నీళ్ళకోసం దేవులాడటం.

ఒక స్టేషనులో నేను రైలుపెట్టెలో నుండి దిగి నీళ్ళు దొరుకునేమోయని వెళ్ళుతుంటే ఆడవాళ్ళపెట్టెలో ఒక స్త్రీ నన్ను పిలిచి "అయ్యా మా పిల్లల నాలుకలు ఎండిపోతున్నవి. కొంచెం మంచినీళ్ళు తెచ్చిపెట్టారా?" అంది. నేను కూర్చున్న పెట్టెలో దీపం గ్రుడ్డిది. ఆ ఆడవాళ్ళపెట్టెలో దీపం మంచి ప్రకాశంగా ఉంది. అయినా ఆవిడ కిటికీలోనుండి వ్రాలి నాతో మాటాడటం మూలంగా వెల్తురు ఆమె ముగంమీద పడటం లేదు. ఆవిడ ముఖరేఖలు నాకు విస్పష్టంగా కన్పించటంలేదు, స్థూలంగా చూస్తే చాలా అందకత్తెవలె కన్పించింది.

"సరే, నేను మంచినీళ్ళకోసమే వెళ్ళుతున్నాను. దొరికితే తెస్తా" నన్నాను. "ఇదిగో ఈ చెంబుతీసుకో వెళ్ళండి" అని ఆమె మరచెంబు మరతీసి నాచేతికందిచ్చినది. ఆ దప్పిక స్థితిలో స్త్రీపురుషవిభేదంలేదు. పరపురుషవిభేదంలేదు. ఆవిడ చేయి నాకు తగిలినది. ఇంకోగంటసేపటివరకు నీళ్ళే దొరకక పోతే కడకు చచ్చిపోవటమే. మృత్యువునకు గంటదూరంలో ఉన్న ఆ సమయంలో ఆవిడచేయి నాకుతగిలి నేను సంతో షించటం అధర్మలక్షణమా? జంతులక్షణమా?

ఆ స్టేషనులో నీళ్ళు దొరకినవి. నేను కడుపునిండ త్రాగాను. ఆ చెంబునిండ పట్టుకొన్నాను. నేను బ్రతికా నన్న సంతోషంకంటె ఆవిడకి చెంబెడునీళ్ళు తీసుకువచ్చి యివ్వటానికి వీలైందన్న సంతోషమెక్కువైంది. నే నావిడకి మహోపకారం చేస్తున్నాననా? ఈ ఉపకారానికి ప్రత్యుప కారంగా ఆమె నాయందు స్నిగ్ధురాలౌతుందనా? నీళ్ళుతీసి కొనివెళ్ళి యిచ్చాను. ఆవిడ చెంబు పుచ్చుకొనటంలో

ఈసారి తనచేయి నాచేతికి తాకకుండానే పుచ్చుకొన్నది. పిల్లల కిచ్చింది; తాను కొంచెం త్రాగింది. నే నాపాటున వెళ్ళిపోవచ్చునా, వెళ్ళిపోలేదు. "చాలునా? ఇంకొక చెంబెడు తీసికొనిరానా?" అని అడుగుతూ అక్కడే నిలుచున్నాను. ఆమె "అక్కర లేదండీ" అంది. నేను నీళ్ళు తెచ్చిపెట్టానన్న కృతజ్ఞత ఆమె మొగంలోఉన్నది. కాని "నేనుకృతజ్ఞురాలను, నమస్కారములు" మొదలైన నాగరపు మాటలు ఇంగ్లీషు భాష నేర్వనివాళ్ళకు తెలియవుగనుక ఆమెనాతో నన లేదు కాని, మొగములో ఆ కృతజ్ఞత మాటలన్నీ మాటలలో కంటె రెట్టింపు కనిపించుచున్నవి.

ఈ పిల్లలకు మంచినీళ్ళిచ్చుటలో ఆమె అటు నిటు మసలుటలో, ఆ చక్కని వెలుగులో నామె మొగము చక్కగా నాకు కనిపించింది. మొదట ఆమె సౌందర్యమే నన్ను కొట్టింది. తరువాత ఆమె మొగ మెక్కడో చూచిన ట్లనిపించింది. నన్నిదివఱ కామె చూచిన ట్లామె మొగములో లేదు. నే నిదివఱకామెను చూస్తే, ఆవిడా నన్ను చూచియుండాలికదా! ఇదీకాకుండా కొందరిని చూచినప్పుడు వాళ్ళని మనం చూడకపోయినా చూచిన ట్లుంటుంది. అటు వంటి ముఖలక్షణములు కల వ్యక్తినెవరినో చూచియుంటాము. ఆ లక్షణసామ్యంచేత వాళ్లనూ చూచినట్లుంటుంది. మీా దే ఊరు? మీారెక్కడికి వెళ్ళుతున్నారు? మొదలైన ప్రశ్నలు వేస్తే బాగుండేదేమో! కాని ఆమె మొగము చూస్తే కృష్ణా గోదావరిజిల్లాలస్త్రీవలె ఉన్నదిగాని దత్తమండలపు స్త్రీవలె లేదు. అడుగుదా మనుకొని అడగకుండానే నా

పెట్టెలోకి నేను వెళ్ళిపోయాను. కాని ఆమె ఆ సుందరమైన ముఖం నా మనస్సులో ముద్రితమయ్యే ఉన్నది.

## 3

తర్వాత రెండేండ్లకు ఆ ఊళ్ళో నాకుద్యోగమైంది. అక్కడికి వెళ్ళాను. అద్దెయింటికోసం తిరిగాను. చివరకొక యింట్లో ఒక భాగం కుదిరింది. కుదిరినరోజున సాయంత్రమే మావాళ్ళు వచ్చారు. ఆ ప్రక్కభాగం ఎప్పుడూ తాళంవేసే ఉన్నది నాలుగు రోజులు. ఆ యింటాయన వేరే కాపుర ముంటున్నాడు. ఆ భాగంలో ఎవరుంటున్నారని అడిగాను. ఆ ఉంటున్నాయన కలెక్టరాఫీసులో గుమాస్తాఅనీ, ఆయన భార్య ప్రసవించటానికి పుట్టింటికి వెళ్ళిందనీ, ఆయన ఒక్కడే ఉంటున్నాడనీ, నాలుగురోజులు సెలవుమీద యింటికి వెళ్ళాడనీ చెప్పారు. అయిదవరోజున ఆయన వచ్చాడు. ఆయన సబ్ మేజస్ట్రేటుచేసి మళ్ళీ కలెక్టరు ఆఫీసుకి ఒక పెద్ద గుమాస్తాగా వచ్చాడు. ఆయనరాత్రి ఎప్పుడో పదింటికి వచ్చేవాడు. ప్రొద్దున్నే తొమ్మిదింటికి వెళ్లేవాడు. నేను రోజూ ప్రొద్దున్నే లేచేటప్పటికే ఏడున్నరౌతుంది. మేమిద్దరము కలుసుకొని మాట్లాడడమే పడలేదు. పైగా ఆయన కొంచెం మేజస్ట్రేటుచేసి వచ్చినవాడుగనుక కొంచెం టెక్కుగూడా కలవాడు. నాలుగైదు నెలలు ఆ యింట్లో కలసిఉన్నా, ఆయనా నేనూ కలసి మాట్లాడలేదు. ఆయ నెవరో? నే నెవ్వరో? ఇట్లా ఇంకొక నెల గడిచింది.

ఒకరోజున సాయంత్రముపూట వాకిట్లో వచ్చి గుఱ్ఱపు బండి నిలిచింది. అందులోనుండి ముగ్గురు పిల్లలు, పసిపిల్ల తల్లి దిగారు. నేను వాకిట్లోకూర్చొని యేదో వ్రాసుకుంటున్నాను. తలయెత్తి చూస్తే ఆవిడ కనిపించింది. చప్పున పోల్చుకోలేక పోయాను. రెండేండ్ల క్రిందట రాత్రిపూట రైలు పెట్టెలోఉన్న వెలుగులో చూచిన మొగమాయెను. కాని ఆ కనులు, కనుబొమ్మలు 'నేనే' అన్నవి. ఆవిడ బండి దిగుతూనే తలయెత్తకుండానే యింట్లోకి వెళ్లిపోయింది. ప్రక్కభాగంలో ఎవరో ఉన్నారు, మన కెందుకులే అనుకొన్నదో, ఎవరో ప్రక్కభాగంలోకి వచ్చారని భర్తచెప్పాడో! యెంత అనుకొన్నా ప్రక్కగా ఒక మనిషిఉంటే తలయెత్తి చూడటం మానవ సహజం. తాను మేజస్ట్రేటు భార్య. రేపుప్రొద్దున్న మగడు తహసీల్దా రౌతాడు. మనసులో ఆ అహంకారం ఉండి యుండవచ్చు.

కాని ఆవిడ బండిదిగి యింట్లోకి వెళ్ళేవరకూ నేనావిడ వంకనే చూస్తున్నాను. భర్తకూడ వెంటనే ఉన్నాడు. నేను తన భార్యవంక చూస్తున్నానని ఆయనకు తెలుసు. నన్ను మర్యాద తెలియనివాడనుకోవలసిందే కాని గద్దించటానికి వీలులేదు. అభియోగం తీసికోరావటానికీ వీలులేదు. ఆయన నడకలో చూపులో ఒక తిరస్కృతి, నిరాదరణ కనిపించినా పైకి పొక్కలేదు. అయినా నే నిట్లు వ్రాయడ మెందులకు? చూస్తే తప్పా, ఇది మనుష్యసహజం. ఊరికే చూచారో దురూహతో చూచారో ఎట్లా తెలుస్తుంది?

ఇంతకూ ఆవిడ ఆనాడు ఎండదెబ్బ తగిలినా మనిషి

యొక్క శరీరము, మొగము పుష్టిగా కనుపించినవి. ఇప్పుడు బక్కచిక్కి యున్నది. ఆ నాటి శరీరసౌష్ఠవం లేదు. బుగ్గలు లోపలికి పోయినవి. కనులు కొంచెము గుంటలు పడ్డవి. జానుపు చాలా కష్టపు కానుపైందేమో? పాప యింకా తేరుకోలే దనుకొన్నాను.

పది రోజులైంది. మా అమ్మ అంది· "అబ్బో! వాళ్లకు చాలా టెక్కు. పలుకరించినా మాట్లాడర్రా" అని. "పోనీలే" అన్నాను.

ఆ ఊళ్ళో నూతులు పాతాళగంగలు. ఒకరోజున వాళ్ళ పనిమనిషి రాలేదు. స్నానానికీ, పానానికీ అన్నిటికీ ఆవిడే తోడుకోవాలి. మనిషి, పాపం నీరసస్థితిలో ఉంది. తొమ్మిదిన్నరకు అన్నం పెట్టకపోతే ఆ మగడు ఆవిడమీద కూడా మేజిస్ట్రేటుగిరీ చెలాయిస్తాడు. రాత్రికి పెందరాడే వంట కావాలి. భోజనంచేసి ఆఫీసుకు వెళ్ళాలని చెప్పాడట. సాయంత్రం, నే నైదింటికి యింటికివస్తే నూతిలో నీళ్లుతోడు తోంది. ఒక బొక్కెన బయటకు వచ్చేటప్పటికి ఆవిడ ప్రాణాలు కడబట్టుతున్నవి. అక్కడ రెండు బిందెలు పెట్టింది. రెండు బిందెలనిండా నీళ్ళు కావాలి. నాలుగుబొక్కెనలైతే గాని బిందె నిండదు. "నేను కొంచెం కాళ్ళుకడుక్కుంటాను. బొక్కెన యిస్తారా?" అన్నాను. బొక్కెన వదలిపెట్టి యింట్లోకి వెళ్ళింది. నేను కాళ్లుకడుక్కొని ఆ రెండుబిందెల నిండా నీళ్ళుతోడి యింట్లోకి వెళ్లాను,

తర్వాత మూన్నాళ్ళకు ఒకరోజున సాయంత్రం నేను ఇంట్లోకి పోతుంటే ఆవిడ యింట్లోకి యెదురుగా వస్తోంది.

నామీద కనులునిలిపి చూచింది. ఆ కన్నులలోకి ఏదోగుర్తు తగిలినట్లుగా తోచింది.

ఆ నీళ్ళు తోడిపెట్టటంవల్ల ప్రసన్నురాలైందో, ఆ రైలుబండిలో నీళ్లుతెచ్చిన నాటి గుర్తు తగిలిందో, మా అమ్మతో మా వాళ్ళతో పరిచయంగా మాట్లాడటం ప్రారంభించిందట.

చిన్నప్పుడు రాగచ్ఛాయగా పద్యం చదవట మనే గుణం నాతో పెరుగుతూ వచ్చింది. అప్పుడు కంఠమెత్తి పది పది హేను రాగాలు పద్యాలమీద జోడించి పాడటం, ఫర్వాలేదు బాగానే ఉందని వినేవాళ్ళనుకోటం జరుగు తుండేది. వారానికో, పదిరోజులకో ఒకసారి రాత్రిపూట భోజనంచేసి పడుకొని సంగీతాలు తీస్తుండటం నా కలవాటు. ఒకరోజున రాత్రి అల్లా సంగీతాలు తీశాను. మరునాడు "మీఅబ్బాయి సంగీతం పాడుతారండీ!" అని మా అమ్మతో అన్న దట.

తరువాత వారం రోజులకు పగలు నేను భోజనం చేస్తుంటే మా అమ్మ చెప్పింది. "ఒరేయి, ఈ అమ్మాయి యెవరో యెరుగుదువా? నీ చిన్నప్పుడు మన మా ఊరు పెళ్ళికి వెళ్ళితే నీ చేత సీమమెరపకాయ కొరికించిందే ఆ అమ్మాయి. మొన్న నేను ఆ అమ్మాయిని కూర్చోబెట్టి పుట్టుపూర్వోత్తరాలన్నీ అడిగాను. ఈ అమ్మాయి తమ్ముడు ఇప్పుడు మన ఊళ్ళో ఉద్యోగం చేస్తున్నాడట. మనయింటి ప్రక్కన రెండిండ్ల అవతల ఉన్న దేరామారావుగారి యిల్లు – ఆ యింట్లో అద్దెకున్నారట. వాళ్ళ అమ్మనాకు మల్లేనే చాలా

ముసలిదైనదట. నిన్నెక్కడ చూచామా అని ఆ అమ్మాయి అనుకొన్నది. నీవు సంగీతం పాడినతర్వాత ఆ అమ్మాయికి సరిగా తెలిసిందట. ఆ చిన్నప్పుడు నీవు పాడిన పద్యమే సరిగ్గా అల్లాగే పాడావట. అప్పుడు చప్పున ఆ అమ్మాయికి జ్ఞాపకం వచ్చిందట'' అని చెప్పింది.

అదివరకే అనుకుంటున్నారు. వాళ్ళాయనకు తహాసీల్దారైంది. మా అమ్మ యీమాట చెప్పిన మరునాడే వాళ్లు ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయినారు. ఆరోజున నేను ఊళ్లోలేను.

## 4

తర్వాత మూడేండ్లకు నేనా వూళ్లో ఉద్యోగం మానేసి మాఊళ్ళో చేరాను. ఆవిడ తమ్ముడు, అతని సంసారం, ఆ రామారావుగారింట్లోనే అద్దెకుంటున్నారు. వాళ్ళ కబుర్లు రోజూ చెప్పుకొంటూనే ఉంటాం. తెలిసిందేమిటంటే ఆ అమ్మాయి మళ్ళీ కడుపుతోఉందనీ, తమ్ముడు అక్కగారిని పురుటికి తీసుకొనివస్తాడనీ. అయిదవనెల పడలేదు. ఏడవ నెల పడలేదు – తొమ్మిదవనెల వచ్చింది. తల్లిపోరుపడలేక తీసుకొచ్చాడనీ, ఆ అమ్మాయి ప్రసవించే రోజులనీ.

మూడవరోజురాత్రి ఆ అమ్మాయికి నొప్పులు వచ్చినవనీ, డాక్టరును తీసుకువచ్చారనీ. ఆరోజురాత్రికి యెల్లాగో అల్లాగ గడిచిందనీ.

తర్వాత రెండురోజులు ఆవిడ పని కిందెట్టు మీదెట్టుగా ఉన్నది. ప్రసవసంబంధమైన వ్యాధికాదు. వేరేవ్యాధి యేదో

వచ్చింది. చుట్టుపట్ల యిళ్ళవాళ్ళందరూ చూడటానికి వెళ్ళారు. నేనూ వెళ్ళాను. వెళ్ళిన నిమిషంలోనే ఆ అమ్మాయికి ప్రాణ నిష్క్రమణవేళ అయింది. క్రిందకు దింపటానికి యెవ్వరూ లేరు. భర్తకు టెలిగ్రాం యిచ్చారు. రాలేదు. నేనూ, వాళ్ళ తమ్ముడూ పట్టుకొని క్రిందకు దింపాము.

మరునాడు మోసేందు కెవ్వరూ రాలేదు. రెండు ప్రాణాలు. అందరకూ అశుభమే. నేనుకూడా వాహకులలో నొకడనైనాను. ప్రొద్దుగ్రుంకిన తర్వాత నక్షత్రదర్శనం చేసి భోజనంచేశాను.

# 5

ఆ రాత్రి ఒక రాత్రివేళ కలవచ్చింది. ఆ అమ్మాయి పదేండ్ల పిల్ల. నేను పదిహేరేండ్ల కుఱ్ఱవాడిని. వాళ్ల యింటో నేను పద్యాలు చదివాను. ఆ అమ్మాయి సీమ మెరపకాయ తీసికొనివచ్చి తినమన్నది, తిన్నాను. నోరుమండింది. ఏడుస్తూ నిద్రలేచాను. నిద్రలో గుర్రుకొడుతూ నోరుతెరిచి నిద్ర పోయినానేమో, అగ్నిమండలపు పురుగు నాలుక చివర ప్రాలింది. భగ్గునమండింది. నిద్ర మెలకువ రావటంతో ఓ తెలిసినది. అది నాలుక చివరేకాకుండా పెదవిమీదకూడా పుండైంది. ఆ పుండు సరిగ్గా పదిపన్నెండు రోజులవరకూ మానలేదు. అన్నం తిననీయలేదు.

అడవి బాపిరాజు

# శైలబాల

కీర్తిశేషుడు బాపిరాజుగారిని నవలారచయిత, కధకుడు, కవి అనేకంటే చిత్రకారుడు అనడం సబబు. నృత్యం, చిత్రలేఖనం, కవనం - యీమూడింటిలోనూ ఆయన కృషిచేశారు. వీరినవలల్లో, కధల్లో చిత్రకారుడు అడుగు అడుగునా మనని పలకరిస్తూంటాడు. 'నారాయణరావు' వీరినవలల్లో సుప్రసిద్ధమైనది. బాపిరాజుగారు కలంతో కధని రాయరు - రంగుల కుంచెతో చిత్రిస్తారు.

శిధిలమై ఒరిగిపోయిన మండపాలు; ముక్కలై భూపతనమైన అంతఃపురాలు; కూలి వ్రీలిపోయిన గోపురాలు; పాడవడిగి ప్రోగులుపడ్డ దేవాలయాలు; తలక్రిందులైన శిఖరాలు; రాలిన విగ్రహాలు; ఒకనాడాంధ్రప్రపంచానికి శిరోమణియై శత్రురాజ్యాలకు నిర్భేద్యమై సమస్త దక్షిణాపథాన్ని

ఏకచ్ఛత్రంగా ఏలిన విద్యానగరమహాపురము నేడు నామ మాత్రమై, పెద్ద వస్తు ప్రదర్శనశాలయై యాత్రికులను నిశ్చేష్టులను చేసి, కళ్ళ నీరు నింపుతున్నది.

తన ఆనందాన్ని చీకుసల్పుతూన్న ఆ శిథిలత్వంలో ఏదారిని నడుస్తున్నాడో తెలియక, తిరిగినదారినే తిరుగుతూ, ఏదిచూస్తున్నాడో తెలియక చూచినదాన్నే చూస్తూ, కళ్ళ కాంతులు శిలాత్వము పొందగా తుంగభద్రానదీతీరాన, పెద్ద ముళ్ళపొదపక్కనే నాగచంద్రుడు చదికిలబడ్డాడు.

నాగచంద్రుడు చిత్రకారుడు. రసానంద తన్మయుడు. మహా శిల్పగానంలో ఆ భయంకరాపశ్రుతి అతని జీవితాశ యాలను భగ్నంచేసింది.

ఇంతలో వెనుక ఎవరో అతన్ని తీవ్రదృష్టులతో పరి కిస్తున్నట్లుంది. చైతన్యరహితుడై ఉన్న నాగచంద్రునికి ఆ చూపుల తీవ్రత చురుక్కుమనితగిలి మత్తువిరిగే మందిచ్చి నట్లయింది. అతడు లేచాడు. వెనక్కి పరికించి చూచాడు. పెద్దపొద; మరేమిన్నీ కనబడదు. ఆ అదృశ్యవ్యక్తిచూపులు చల్లనై తోచినవి. నాగచంద్రుడు ఇదేమని పొదచుట్టూ చూచి యేదిన్నీ కానక, పొగమంచు కమ్మిఉన్న హృదయ పథం మరిన్నీ చీకట్లు అలుముకోగా, వెఱ్ఱివానివిస్మయం పొందుతూ మళ్ళీ నదిఒడ్డున కూర్చున్నాడు. ఈసారి అతనికి నిట్టూర్పు వినబడింది. నాగచంద్రుడులేచి, సగము నిద్రమత్తు వెలుస్తున్న వానిలా తూలుతూ, పొదదగ్గిరే నిల్చుని, పొద లోనికి పారచూచినాడు. అస్పష్టంగా మెడలో హారాల చప్పుడు. నాగచంద్రుడు తూలి ముళ్ళడొంకలో పడబోయి

నాడు. స్పష్టంగా మళ్ళీ నిట్టూర్పు. అది ఘంటారావమై అతని మెదడులో మోగింది. నాగచంద్రునికి పూర్తిగా మెళుకువ వచ్చింది. పక్కనేఉన్న సంచిలోనుంచి చేతిగొడ్డలి తీసి పొద నరకడం ప్రారంభించాడు.

బ్రెంక, రక్కెస, నాభిలత, అడవిమల్లె, పురుగుడు, పాలకర్ర, చిట్టిరేగూ విసవిసా వీరభద్రుడై నాగచంద్రుడు అరజాములో నరికిపార వేసినాడు. సగము నరికిన ఆ పొదమధ్య నృత్యము చేయబోయే శిలాబాలిక! పరువము పండించుకొన్న కోటి కోటి సంవత్సరాల ఈడు కలిగిన దక్కనుపీఠభూమి నల్లరాయిలో, స్నిగ్ధాతిస్నిగ్ధమైన చెక్కడం. స్త్రీప్రపంచాన అందం ఏరితెచ్చి, చేర్చి, ముద్దపోసి ఆ బాలికామూర్తి శిల్పించినారు. కోలమోము, లోతెరుగని నాసికామూలము, సమప్రవాహపతనమైన రేఖ, రేక మందార మొగ్గవంపులో తిరిగి ఓష్ఠాంచలముపైన సుడి తిరిగిపోయింది. చిరునగవున వికసించబోయే ఆమె పెదవులు కొద్దిగా విడివడి స్వినాలై. ఈవలావల కాశీరత్నపుపూల చెక్కిలిగుంటలను అలంకరించుకొన్నవి. అధరము దిగువ నిమ్నమై, చిరురసాల ఫలమైన ఆమె చుబుక మాధుర్యము గ్రీవశంఖాన ధారై చేరుకొన్నది.

ఆమె చతుర్భంగాభిరామ. ఆమె పరవశన ర్తకి. సన్నని బంగారు దుకూలమ్మో ఏమో కటిప్రదేశాన వ్రేలాడే మొలనూలు మెలపులలో కలిసిపోయి విద్యున్మాల అయినది. మంజీరములున్నూ, చిరుగంటలున్నూ అలంకరించిన ఆమెపాదము తరుల్లతై భూమిమీద వాలబోతున్నట్లున్నది. ఆమె ఎడమ పాదము మునివేళ్ళపైన ఎగరబోయ్యే పక్షిలా నృత్యగతిలో

ఆకాశపథభంగిమతో ఉన్నది. ఆటాడే తాచుబాము దక్షిణ హస్తము, కంకణాలతో, గాజులతో, భుజభూషణాలతో, చెదిరిపోయే వేణీబంధముతో, పొంకాలయి ప్రేమవాహినీ మాలాలై కదంబపుష్పాలై కలలనిధులైన వక్షాలపై ఉబికే అనేకహారాలతో నృత్యావేశ దివ్యసుందరియైన కాలాన ఒక క్షణికంలో శిల్పి ఒకడు శాంబరీవిద్యచేత శిలగా మార్చినట్లు ఆమె ప్రత్యక్షమైంది.

## 2

నాగచంద్రుడు అలాగే నిలుచుండిపోయినాడు. అతని ఊహాపథాలు దాటిపోయిన శిల్పసౌందర్యం. తొందర తొందరగా ఆ విగ్రహంచుట్టూ ఉన్న డొంకలు నరికిపారవేసి, ఆ ప్రదేశం అంతాశుభ్రంచేసి, తుంగభద్రలోనుంచితనసంచిలోని కలశంతో నీళ్లుతెచ్చి ఒత్తుగా చల్లినాడు. వివిధపుష్పాలు సేకరించి, దండలుగుచ్చి ఆమెమెడలోను వేణీభరంపైన అలంకరించాడు. పూవులతో ఆమెపాదాలు పూజచేసినాడు. తనివితీరని చూపులతో ఆమెనుచూస్తూ మోకరిల్లాడు. అప్రయత్నంగా అతనిఫాలం చివురుజొంపాలలాలిత్యం చూపిస్తూ కఠినమై ఉన్న ఆమెపాదంపైని చేర్చింది. లోతెరుగని ఉత్కంఠ నాగచంద్రుని వణికించింది.

ఏమిది? అతని శిరస్సుపైన నాతిదూరానఉన్న ఆమె కుడిపాదము నెమ్మదిగా దిగుతూ అతనిమూర్ధానికి కొంచెం తగిలింది. నాగచంద్రుడు ఉలిక్కిపడిలేచి ఆమెమోముపైన

తీక్షణదృష్టులు పరిపినాడు. అతనికుడి చేయిఆమెఎడమమీగాలి పైన నఖంపచస్పర్శనందింది. ఇంతలో ఆ బాలిక చిరుపులుగు ఎలుగుల నవ్వి ఒడలు కొంచెం కదలించింది. బిగిసిపోయే హృదయంతో నాగచంద్రుడు లేచి నిలుచున్నాడు.

చైతన్యోదయ మవుతూ ఉన్న అస్నిగ్ధ నీలోత్పల శరీరాన నులివెచ్చ రక్తము జలజల పోటెత్తి సమవిషమతలాల క్రొమ్మొలకులు పులకించి సమస్త నాడుల స్పందించి మెత్తని దారులై, కొంజివ్వరై నవనీతమైపోయింది. చూస్తూ ఉండగానే ఆ శరీరము ఉదయసంధ్యాకాశములా క్షణక్షణం వన్నెలు మారుస్తూ, కపిశమై, పిశంగమై, శ్వేతమై, పాటలమై, పీతమై పుటములో బంగారమైపోయినది. కర్కశమైన ఆమె కబరీభరము నల్ల పట్టుకుచ్చుల వేణీభరమైనది. నగలు బంగారులై తళుకులాడినవి.

''తణికిటతోం'' అని ఆబాలిక నాట్యమాడ ప్రారంభించింది. కాళ్ళచిరుగంటలు చతుశ్రగతి త్రిపుటతాళము వేసినవి. రానురాను స్ఫుటమైన కంఠంతో—

లలిత లవఙ్గలతా పరిశీలనకోమల, మలయసమీరే
మధుకరనికర కరమ్బిత కోకిల కూజిత కుంజకుటీరే
విహరతి హరిరిహ సరసవసంతే
నృత్యతి యువతిజనేన సమంసఖి!
విరహిజనస్య దురంతే—

అనిపాడుతూ ఆ బాలిక అభినయిస్తున్నది. నాగచంద్రునిముఖము విరిసిపోయిన దిరిసెన చెట్టులా ప్రఫుల్లమయింది. శాంకాలయి పొలుపుమీరిన ఆమె హస్తాల విన్యాసవేగము

అడవి నిమ్మపూవుల పరిమళమయింది. చిరుచెమ్మటలు నఖా గ్రాలతో తుడుచుకుంటూ నాట్యమాడి మధురమైనఊర్పులు విడుస్తూ ఆ బాలిక వచ్చి, నాగచంద్రుని బుజాలపైన చేతులు ఉంచింది. అతని దేహానగగుర్పాటులు మలయసమీరము రివ్వున ప్రవహించినప్పటి చెరువులో నీటికెరటాలలా పరువు లిడినవి. విడివిడి ఆమెపెదవులు పరిమళములో అతని కపో లాలపైన అలమిపోయినవి. దివ్యయౌవనం విరిసిపోతూ పరమసౌందర్యం విరజల్లుతూ ఆ బాలిక చటుక్కున తనను ఆవరించినప్పుడు నాగచంద్రుని చేతులు అప్రయత్నంగా ఆమెను కౌగిలించుకోబోయి మరల వాలినవి.

"ఏమయ్యా, తుంగభద్రాతీరానకూర్చుందాము రా" అని ఆమె అతని కుడిచేయి పట్టుకొని నదిగట్టుదగ్గరికి అతనికి దారి చూపుతూ అక్కడేవున్న ఓ నల్ల రాళ్ళగుట్టమీద అధి వసింపజేసింది. అతనిపక్కనే ఆసీనఅయింది.

"నీ హృదయంలో నేనెవర్నా - అన్న ప్రశ్న మొలకెత్తింది. ఈరాళ్ళన్నీ ఒకరకం చుట్టాలు నాకు. ఈ సంధ్యా శబలరాగంలో అవ్యక్తంగా కనబడే ఆమాతంగగిరిపక్క ఒక్క చిన్నశిల నా పూర్వరూపం. ఈ కథ విను!

"ఆనాడు ఎందుకో సార్వభౌముడు విచారమేఘంతో పొదువబడ్డ మలయగిరిశృంగం అయ్యాడు. అష్టదిగ్గజాలు ఆ శౌరునిహృదయానికి ఉపశమనం కూర్చలేరు. పెద్దన్నగారి పద్యాలు మేఘంలో ఉరుములయ్యాయి. పేరుపొందిన అంద కత్తెల్ని నెలవెలపోవచేసే మావాళ్ళు భరతపయోరాశి

మథించగా పుట్టిన అప్సరసలు, రాజులో రసజ్ఞతా చంద్రిక ఉదయింప చెయ్యలేకపోయినారు.

"ఒకనృత్యాంగన చెంగల్వరాయ సేనానాయకుల వలపుకత్తై, శ్రీకృష్ణరాయసార్వభౌములవారి ఆదరణపొంది, శ్రీవారి ఆగ్రహానికి గురియైన తనస్వామికి ఉపకారం చేయ చూస్తూఉన్నది. ఆమెతనకుమార్తెను పిలిపించిగజ్జెకట్టించింది. ఆ బాలిక తిలోత్తమకు అందం వంకలు దిద్దగలదు. ఆటలో ఊర్వసికి అపరావతారం. అంతవరకూ, ఆమె కన్నె చెర వీడలేదు. ఆ బాలికను సార్వభౌమునికి సమర్పించడానికి తల్లి చెంగల్వరాయనితో మంతనం సలిపి అదను చూస్తున్నది. ఇంతకన్న వేరేసమయంరాదని ఊహించి ఆ నట్టువరాలు తనకుమార్తెను సభలోకి ఉత్సవములతో కొనివచ్చింది.

"ఆ మేళానికి గురువుఅమ్మనాచార్యులవారు. చక్రవర్తికి జోహార్లుచేసి, 'మహాప్రభూ! దివ్యనృత్యేశ్వరు పాదాలకడ పూజచేస్తూ విద్య నభ్యసించిన ఓ అప్సరోంగన దేవ రాజ్యంలో ఉద్భవించింది. ఆ బాలిక భరతంలో పదహారు సంప్రదాయాలూ నేర్చుకొన్నది. ఆమెవిద్య అపర దేవేంద్రులైన సార్వభౌములు దివ్యచిత్తాన అవధరింతురుగాక! రాజ రాజేశ్వరుల హాసాంచసుషమ లా కన్నెపైన ప్రసరించి ఆమెను పవిత్రను చేయునుగాక!' అని నివేదించుకొన్నాడు. మహారాజులుంగారు అంగీకారసూచకంగా తలపంకించారు.

"అర్ధచిటికలో క్రొక్కారు మెరుగుతీగలా ఆ బాలిక చక్రవర్తిఎదుట నాట్యాన సాగిలబడి, ప్రభువు 'లే' అనేవరకూ భూమిపైన ప్రాలిన చంద్రకళలా, పచ్చికలో ప్రసరించే కేతకి

పన్నగిలా ఆ సభాచంద్రశిలాతలముపైన అల్లే పడిఉన్నది మహారాజు కనుసన్న అయినది. ఒక్కుమ్మడిగా తొలుతిత్తి శ్రుతులతో ఒక విపంచి, ఒక కిన్నెర, ఒక సైరం పక్కవాయిద్యాలయినవి. దశావతార కథనము ఎత్తుకొని హంగుచేసే గణికలు తాళాలు వాయిస్తున్నారు. మృదంగం పూర్ణలయావతారమైనది. రసము తొలుకాడే ఒక్క విహంగనన్నృత్తగతిలో ఆ బాలిక సుడిగాలిలా లేచి:—

ప్రళయ పయోధిజలే ధృతవానసి వేదం
విహిత వహిత్ర చరిత్ర మఖేదం ధృతవానసి వేదం.
కేశవ, ధృతమీనశరీర, జయ జగదీశ హరే!
క్షితి రతి విపులతరే తవ తిష్ఠతి పృష్ఠే
ధరణి ధరణి కిణ చక్రగరిష్ఠే. తవ తిష్ఠతి పృష్ఠే
కేశవ, ధృత కచ్ఛపరూప, జయజగదీశ, హరే!...

అని పాడుతూ అభినయించి సభను సమ్మోహనం చేసింది.''

## 3

నాగచంద్రుడా బాలికమాటలు వింటూ, సంభ్రమాశ్చర్యాలకు లోనౌతూ, తుంగభద్రనీళ్ళు చీకట్లుతాలుస్తూ ఉండడం కనుగొంటూ, ప్రణయపూజాసేవకుడౌతూ, ఆ బాలిక అందాలమోము పరికించి చూస్తూ, దగ్గరగా అధివసించిన ఆమె యౌవనానందానికే సమ్మోహితుడౌతూ, నిలువునా పులకిస్తున్నాడు.

''ఈ ప్రదేశం నన్ను దివ్యానందంలో పరవశుణ్ణి చేస్తున్నది!''

"సార్వభౌములకాలంలో ఇక్కడే ఒక శిల్పమందిరం ఉండేది."

నాగచంద్రుడామెవంక చకితుడై చూస్తూ, "ఈ తుంగభద్రానదీ సౌందర్యము ఏలాటి దివ్యస్మృతులు మొలకలెత్తిస్తున్నది!"

"నీ హృదయసౌందర్యమున్ను అలాంటిదే"

"సుందరతరమైన నీ రూపజ్యోతి నన్ను పాదాం క్రాంతుణ్ణి చేసుకుంటూంది!"

"అయితే నాకు హృదయం లేదంటావా, ప్రభూ?"

"ప్రభూ! ప్రభూ!" అనుకుంటూ నాగచంద్రుడు విస్మయం పడ్డాడు.

"నీ హృదయం నా ఊహ కందరానిది"

"పణ్యస్త్రీకి హృదయం ఉంటుందా స్వామీ ?"

"సర్వప్రపంచానికీ సౌరభాలు చూరలిచ్చిన పణ్య స్త్రీల హృదయాలు వందనీయాలు."

"హేళనా ప్రభూ?"

"హేళనా? నీ ఆవిర్భావం ఇంతవరకు నన్ను అచేతనుణ్ణి చేసింది. ఏ అందాన్ని నేను ఊహచేసుకోలేకుండా ఉన్నానో, ఏ అందం నాకు ఇంతవరకూ ప్రత్యక్షం కాలేదో, ఏ అందం ఉంటుందని భావించి భావించి, దేహం పరవశం కాగా, హృదయం ద్రవించిపోగా, నా ఆత్మస్వార్పణకోసం ఎదురుచూస్తున్నదో, ఆ అందం ఈనాటికి నీలో చూసిన నాకు హేళనా, ప్రణయదేవీ?"

ఆ బాలిక ఆతని ఒడిలోకి వాలిపోయింది.

నాగచంద్రుడు ఆవేశంతో, పూజ్యభావంతో ఆమెను బిగియార కవుగిలించుకొన్నాడు. ఆ ముహూర్తము అతి పవిత్రమైనది. ఆ సంశ్లేషములో వారిప్రేమ మరీ గాఢమై మధురాతి మధురమైనది.

"దేవీ! దేవీ!"—గద్గదమైన అతని గొంతుక ప్రేమ పూర్ణమైనది. ఆమె కంఠం నుంచి అస్పష్టమైన విచార స్వనము వినిపించి ఆతని శ్రవణాలకు భూకంపనిస్వనమైంది.

"ఏమిటి, ఏమిటిది! కళ్లనీళ్ళు నింపుతున్నావే! నీ బంగారు దేహలత వణుకుతూ ఉన్నదేమిటి? ఈ విచార మెందుకు పవిత్రమూర్తీ!"

"నీపూజ నన్ను మూలానికి కదులుస్తున్నది. రూపం అమ్ముకొనిబ్రతికే మేము ప్రేమమాధుర్యము రుచియైనా ఎర గం. నన్ను పూజాపీఠమెక్కించి పరవశురాల్ని చేస్తున్నావు!"

"విద్య నాలో వ్యక్తమౌతూవున్న ఇంతనాటినుంచీ ఒక అద్భుతమూర్తినీ, ఆమూర్తిని ఆవరించిఉండే ఓ చిత్ర హృదయాన్నీ, ఆ సర్వాన్ని ఆవరించి పూర్ణించుకొని ఉన్న పవిత్రాత్మను ఉత్కృష్టాశయం చేసుకొని నేను ఆ దేవికోసం లోకాలు గాలిస్తూ, నా హృదయం దేవాలయం చేసుకొని పూజాద్రవ్యాలతో అంతులేనియాత్ర చేస్తున్నాను"

"ఆ ఆశ్రయం మృగతృష్ణామాత్రమే కదా ప్రభూ!"

"నిజమనుకొనే ఈ ప్రపంచాని కన్న మృగతృష్ణ ఎక్కువ నిజం కాదా దేవీ!" అంటూ నాగచంద్రుడావిచిత్ర బాలికను మరీ గాఢంగా కవుగిలించుకొన్నాడు. ఆ అమృత మూర్తిని అలముకొన్న పరిమళాలతో వివశుడయ్యాడు.

చక్రవర్తి పరమేశ్వరపదజనితమైనట్టిన్నీ, నందికేశ్వర సముపదిష్టమైనట్టిన్నీ, భరతమహర్షి ప్రచారితమైనట్టిన్నీ, ఏ విద్య ఉన్నదో, ఆ మహాకళ నాడు ఆ బాలికలో మూర్తీభవించి, వికసించడం కనుగొన్నాము.

నాగచంద్రుడు విప్ఫారిన నయనాలతో ఆమెను తిలకిస్తూ, "దేవీ! ఆ బాలికవు నువ్వు కావుగదా" అనిఅడిగినాడు.

"ప్రభూ! నేను కానని చెప్పనా, అవుదునని చెప్పనా?"

ఈషదవనతమైన ఆమె మోమును నాగచంద్రుడు చుబుకముపట్టి లేవనెత్తుచూ "దేవీ! నీ పెదవుల్లో మందహాసలేశమన్నా నర్తింపకుండా నన్ని విచిత్రస్వప్నంలో తేలుస్తున్నావా?" అన్నాడు.

"ప్రభూ! నాసర్వస్వము నీకుపూర్ణార్పణం చేస్తున్నా. ఈ దివ్యక్షణాలు స్వప్నమో నిజమో నాకే తెలియకుండా ఉన్నవి."

"ఈ దివ్యస్వప్నమే ఎప్పుడూ నిలిచి ఉండరాదా!"

"అవును ప్రభూ!"

అని నిశ్వసిస్తూ ఆ బాలిక – "ఆ నృత్యము సార్వభౌమునికి ఆనందం నివేద నిచ్చింది. ఆ రాత్రి –" అన్నది.

"ఆ రాత్రి?"

"సార్వభౌముని అంతఃపురానికి ఆ బాలికను పంపడమయింది" నాగచంద్రుడు కూలిపోయినాడు. ఆతని చేతులు వాడిపోయిన తామరతూళ్ళయి వాలిపోయినవి. అతడు నిట్టూర్పువిడుస్తూ ఆ నల్లరాతిమీాద తల వాల్చాడు "ఇక వినలేను దేవీ!"

''ప్రభూ నేను పణ్యస్త్రీని.''

''నిన్నా రాత్రిపంపిన పాతకులు భ్రష్టులు, పిశాచాలు!''

''ప్రభూ! అతిహీనకులంలో జన్మించిన మాపాపహృదయాలు పవిత్రం కాగలవా? సార్వభౌముని క్రీగంటిచూపు మమ్మల్ని అప్సరసల్ని చేయదా!''

''మీావి దివ్యజన్మలే దేవీ! మిమ్మల్ని అనుభవించే ఆ నీచాతినీచులు-''

''ప్రభూ, విను - సర్వాలంకారాలతో వాసకసజ్జికనై, మహారాణినైనట్లు ఉప్పొంగిపోతూ, చక్రవర్తిరాకకై ఎదురుచూస్తుంటిని. ముహూర్తాలు గడచినవి. కోటలో ఘంటారావాలు మోగుతున్నవి. అర్ధరాత్ర తూర్యారావాలు తృతీయయామపు ఢంకానినాదాలూ వినబడుతూనే ఉన్నవి. అంతఃపురాలన్నీ నిశ్శబ్దంలో జోగిఉన్నవి. ఆ చిన్నమాంబారసికుడు రాలేదు. నాహృదయంలో దవానలం చిగురించింది. లజ్జతో కుంగిపోయాను. ఆ మహాపరాభవంలో వైతాళికుల హెచ్చరికలు, వందిమాగధులపాటలు నా హృదయకుహరంలో బ్రహ్మాండము పగిలినట్లు ప్రతిధ్వనించి, ఒళ్ళు తెలియని మూర్ఛలో మునిగిపోయినాను.''

నాగచంద్రుడు చివుక్కున లేచి కూర్చున్నాడు.

''సార్వభౌముని సౌజన్యము నే నొక్కక్షణమాత్రం సందేహించాను. నువ్వంతఃపురంలోకి వెళ్ళిన సంగతి మహారాజుకు తెలుసునా?''

''ఈ పణ్యస్త్రీకి అంత విచారణ చేసేయోగ్యత కలదా ప్రభూ! చిన్నమాంబాదేవి సరససల్లాపానందుడైన చక్రవర్తికి,

ఆ దేవిపైన యేదో కారణంచేత కొంచెం కోపం వచ్చిందనీ, ఆ నాటి నానాట్యం ఆయన హృదయంలో సందేహాన్ని వెన్నెలై చీకట్లు పారదోలిందనీ, సభనుంచే, ఆపట్టునే మహాప్రభువు చిన్నమాంబాదేవి అంతఃపురానికి పోయి క్షమాపణ వేడి ఆమెను అనునయించినాడనీ తరువాత నేను విన్నాను.''

''చెంగల్వరాయల దుశ్చేష్టితం సుమా దేవీ ఇది!''

''అయిదురోజుల వెనక, తీవ్రజ్వరంలో ఉన్న నాకు స్ఫుటాస్ఫుటంగా మెలకువ వచ్చింది. నృత్యంనాటి ఆసభలో రాజశిల్పి శిష్యులతో వచ్చి ఉన్నాడట. ఒక శిష్యుడు, ఆనందరసైకజీవి, దివ్యసౌందర్యానందుడు – ఈ పాపినీ ఈమె నాట్యాన్నీ చూచి వెర్రిప్రేమలో మునిగిపోయినాడట – ''

''మునిగిపోవటం అబ్బురమా దేవీ?''

''ఆ బాలిక ఆ జ్వరంతో కృశించి కృశించి అసువులను నాలో కలయించు''...ఆమాట ముగించకుండానే నాగచంద్రుడు ఆశిలాబాలను, చెమర్చే కన్నులతో దరికి చేరదీసుకొని ఆ మోము తన హృదయాని కద్దుకొని, ఆమెతల కన్నీటితో తడిపినాడు.

తూర్పున కొండలప్రక్కనే ఎర్రనై, నాగచంద్రుని సంతోషరాగములా చంద్రబింబము ఉదయించింది. తుంగభద్ర నీళ్లు శిలాబాల హృదయములా కెంపుజీరలు సాగినవి. సర్వ ప్రపంచము జ్యోత్స్నానందంలో వివశత్వ మొందింది.

ఆ శిలావేదికపైన నాగచంద్రుడు మెత్తనితల్పము అమరించి ఆ బాలికను అధివసింపచేసినాడు. ఆమె మోమును తనివితీరగా పరికిస్తాడు. ఆమె సౌందర్యరేఖల చేతులు

హృదయాని కద్దుకొని దూరాన్నుండి దగ్గరనుండి గమని స్తాడు. ఆమె లావణ్యము పుడిసిళ్ళకన్నుల కద్దుకుంటాడు. ఆమె ఇంకనూ శిలాబాల కాదుగదా అన్న అనుమానము వీడని చూపులతో, స్పర్శతో కవోష్ణతను, కాంతులను పరి శీలిస్తాడు.

ఆమె చిరునవ్వుతో, సిగ్గుతో కొంచెం వంచిన మోముతో నీలాల జాలరులైన కనురెప్పలచాటుననుండిన అతని ఆనందము తనహృదయాన్ని నింపుకుంటూన్నది.

నాగచంద్రుడు ఆమెయెదుట మోకరించి, "నువ్వు నా స్వప్నబాలవు. నా జీవితాధిష్ఠాన దేవతవు. నేను తుంగ భద్రను, నీవు కృష్ణవు" అని ఆమె ఒడిలో వాలినాడు.

## 5

అతడా ఆనందతన్మయత్వంలో, తమినిండిన హృదయ ముతో, అరుణావిర్భావమును గుర్తింపలేదు. మాల్యవత్పర్వత సానువులపైన ఒక రెప్పపాటు తనరథము ఆపి, కర్మసాక్షి యైన సూర్యభగవానుడు ఆనూత్నదంపతులపైన తనఅరుణ కిరణ కుంకుమాక్షతలు చల్లినాడు. సుఖపారవశ్యముద్రితా లయిన కనుదమ్ములతో, చెదరిన ముంగురులతో, సడలిన వేణీభరంతో, తన హృదయతలముపైన కలువపూదండలా వాలిఉన్న శైలబాలలోని తీయని వన్నెను నాగచంద్రుడు అరమోడ్పుకనులతో ఆస్వాదిస్తున్నాడు. అలసాలసాలయిన వేబోక తెమ్మెరలు తుంగభద్రాతరంగ శీకరశైత్యాలతో

ఆయితమైవచ్చి శైలబాల ముంగురులను పాపటకు చక్క-నొత్తుతూ కనుదమ్మిరేకులను ఇంచుమించు విప్పసాగినవి. నాగచంద్రుని కంఠాన పెనవేసికొన్న బాహులత ఇంచుక సడలించి చటుక్కున కళ్ళు తెరచి తల ఇంచుక ఎత్తి ఆమె అతనిమోము తిలకించినది. ఆమెచూపులలో నునుసిగ్గులు చిరుకెరటాలై ఆనంద కాంతుల మిలమిలలాడి, అంతలో ఆమె రెప్పలమాటున అదృశ్యములైనవి. అర్ధపూరితాలైన చిరునవ్వులు ప్రసరిస్తూ అతడామెను గట్టిగా హృదయాని కదుముకున్నాడు.

రూపవిలాస ముగ్ధలైన శిల్పుల ఆనందము రూపలయాన్ని కోరుతుందా? ఉత్కృష్టరూపాన్ని సృష్టించే ఆశయంమాత్రం శిల్పులతపస్సు కాదా? అల్పదోషమైనా ఎరుగని రూపోత్కృష్టాన్వేషణకు ఫలము ప్రాకృతజనులుకోరే దేహానందము మాత్రమేనా? రూపురేఖలు పొదిగించుకొనే వికాసము నులివెచ్చని దేహంచే బంధితమైనదా! ఏమిటీవిచిత్ర సంఘటనం!

"ప్రభూ! మీ శంకితహృదయాన్ని ఆవరించిన తెరను తీయలేను. కాని, సంశయా లెరుగని ఆ తరుణశిల్పి సభలో నన్ను చూచిన మరుక్షణాన్నుండి ఉన్మత్తుడై పోయినాడట!"

"నువ్వు మూర్తీభవించిన సౌందర్యసర్వస్వానివి!"

"అప్రశ్రుతిలేని దివ్యసౌందర్యము స్వప్నమాత్రము ప్రభూ!"

"మనోరథప్రాయమైన రూపానికి రేఖలు లేవు. మూర్తి

లేదు. మూర్తించుకోగలిగిన ఉత్కృష్టరూపమే శిల్పికి ఆశ యం. తీర్థాలు తిరిగిన ఈ నాకు ఈనాడు ప్రత్యక్షమైనావు.''

''ఆనాడు కాదా ప్రభూ!'' అంటూ కంఠాన భుజల తలు పెనవేసి కన్నులలోకి చూపుల చొనిపి హృదయాన్ని మేలుకొలుపుతున్న శైలబాలను కంపించిపోతున్న కరము లతో ఎడంగా చాచిపట్టి దేహమనఃప్రాణాల్ని చూపులలోకి తెచ్చుకొని, ఒక్కనిమేషం ఒరసిచూస్తూ, సుఖస్వప్నంనుంచి లేవలేక నిద్రలేస్తున్నవానిలా ''దేవీ, ఎన్నాళ్ళకు!''అంటూ ఆనందమూర్ఛితుడైనాడు నాగచంద్రుడు.

తుంగభద్రాతరంగాలవంటి కరతలాలతో ప్రియుడి మేను నిమురుతూన్న శైలబాలను - ఒక్కనిట్టూర్పుపుచ్చి, ''దేవీ, స్వప్నం కాదుకదా?'' అంటూ హృదయానికి అదు ముకుని ''దేవీ, మధురతరమైన మన కథనము నన్నింక చెప్పనీ'' అని నాగచంద్రు డన్నాడు.

''నిన్ను చూచిననాటనుంచీ నీ స్వరూపాన్ని పరు వాలు నింపుకొన్న నీలగ్రావంలో మూర్తింప నారంభిం చాను.''

''ధన్యను!''

''నీజబ్బులో ఎప్పుడునూ మీయింటికి వచ్చేవాడను. జీవవర్ణాలు వెలిగే వివిధపుష్పాలుసేకరించి, రసహృదయా లయిన ఫలములకానుకలతో దినదినమూ మీమేడకువస్తూ, నీ కవి అర్పించుకొన్నాను.''

''ఫలములేకాదు, నీ ప్రణయమే ఔషధానికి అను పానం చేశావు -''

''దేవీ, నేను సంకల్పించిన శిల్పమూర్తికి నా ప్రేమ రసంతో మెరుగులు దిద్దుకొన్నాను. ఎంత రసభావన ధార పోసినా, మూలానికి నా నిర్మించిన ప్రతిమ బింబమాత్రమే అయిపోయిందని సిగ్గుపడ్డాను. నీనయనాంచలాల మెరుపులూ, నీ మందహాసాల శీతద్యుతులూ, ఆనాటి నీ నాట్యభంగిమలో సౌకుమార్యమూ, హృదయాన పదిలించుకొని తెచ్చి నా టంకంపు మొనతో ముంచి, నా శిలాబాలకు అందించుకున్నాను. నా పూజాకల్పనం నీయెదుట నిలవడానికి నాకు ధైర్యం చాలింది కాదు.''

''శిల్పిశేఖరా! నాసపత్ని యేది? అని నేను దినదినం ప్రశ్నించేదాన్ని ప్రభూ!''

'తేరుకొంటున్న నీ ఆరోగ్యానికి భంగం కలిగించలేక''

''దినములు గడుపుతూండే నేనొకనాడు పట్టుపట్టి నాను. చూస్తానని కాదు ప్రియా?''

''దేవీ! ఆ దారుణకథ మళ్లా ఎందుకు స్మరిస్తావు?''

''ప్రభూ! ఉండు. నేను ఎవరువాదించినా వినక, ఒక నాడు పల్లకీలో బయలుదేరాను. నువ్వు నరికివేసిన పెద్దపాదే నీశిల్పమందిరం కూలగా బయలుదేరింది. ఆ శిల్పమందిరానికి ఆపరాని ఉద్వేగంతో, నిలుపలేని ఉత్కంఠతో పల్లకీ దిగి వచ్చి నా ప్రతిబింబాన్ని చూచాను. నా రూపంలో నాలో ఉండే లోపాల్ని సవరించుకొని దివ్యత్వంతాల్చిన సౌందర్యం ముందు లజ్జించి నిశ్చేష్టనై చాపకట్టులా పడిపోయాను.''

''దేవీ! నాశిల్పబాలకు నేను పోయలేని ప్రాణాన్ని నీ వప్పు డర్పించి నన్ను ధన్యుణ్ణి, అధన్యుణ్ణి కూడా చేశావు''

"ప్రభూ! ఆ విగ్రహాన్ని చూచి నేను నీ ప్రేమగంభీర తనూ విశ్వరూపాన్ని తెలుసుకొన్నాను. నా తుచ్ఛ దేహాన్ని వదిలేసి, నాదివ్యరూపంలో చేరుకొని తరతరాలనుంచీ నీ కోసం ఈ మందిర శిథిలాల్లో ఈ నదితీరాన తపస్సు చేశాను."

## 6

పవిత్రాలయిన మూడురాత్రిళ్లు లిప్తలై జరిగినవి. దీర్ఘాలు అర్ధనిమీలితచకోరాలు, బెళుకులీనుకురంగనయనాలైన ఆమె పెడదకన్నులు తనివితీరని చూపుల పూవుల పూజతో తన్ను నింపివేస్తున్నప్పుడు, సరసమై, స్పష్టమై, సున్నితమై, దివ్యరేఖలుకలదై, నులువెచ్చనై, ఉదయారుణకాంతిలా మెరిసిపోతున్న ఆమె శరీరసౌందర్యము తన్ను సుడిగుండంలా, చంద్రకిరణంలా, వికసించిన మల్లెకావనంలో సువాసనలులా చుట్టివేస్తున్నప్పుడు, ఆమె తనలో లీనమైపోతున్నప్పుడు, కోటిపాటల కుసుమాలలో మధువుల వాకలు ఆమె పెదవులు తనపెదవుల గాఢమైనతమిలో చుంబించేటప్పుడు నాగచంద్రుని దివ్యానందతన్మయత్వము, కోటి ఉద్యానాల సౌరభా లొక్కబిందువులో సమాహృతాలయినట్లయినది.

అది నాల్గవనాటిరాత్రి – సంపూర్ణ పూర్ణిమాజ్యోత్స్న తుంగభద్రాతోయాలపై పన్నీటి పరిమళాల తుంపురు చల్లుతున్నది.

ఆ ఉత్కృష్ట యువయుగ్మానందంలో లయమై లోకమంతా నిశ్శబ్దమైంది.

వారిరువురూ యుగాలనాడు ఏ మహాతారలలో ఉద్భవించి యాత్రచేస్తూ భూమి కవతరించిన కిరణద్వయమో!

“ఓ కళాధిష్ఠాన దేవా, సుధాకర సార్వభౌమా! పూర్ణతతో తూగే సౌందర్యబాలకై కల్పాలలో తపస్సు చేసుకొన్నాను. ఆమెను సందర్శించుకున్నాను. పరిపూర్ణతను చేరే సౌందర్యమూర్తిగా సృష్టించుకొన్నాను. రూపరేఖా కాంతి సౌందర్య సంపూర్ణత్వాన కలిగే అద్భుతానందం ఒక క్షణికము మాత్రము. ఈ సౌందర్యం, ఈ ఆనందం, ఈ దివ్యనిమేషమూ అనంతం చెయ్యవోయి ప్రభూ!” అని మహాయోగవంతమైన అభ్యర్థనము చేశాడు నాగచంద్రుడు.

ఒక చిరుమబ్బు చంద్రబింబాన్ని ఒకలిప్తమాత్రం కప్పినది. ఒక లిప్తమాత్రము గాఢాంధకార మయినది.

ఇంతలో దిక్కులు స్పష్టాలై మళ్ళీ చంద్రకాంతులతో తళతళలాడినవి.

శిల్పబాల యథాప్రకారం శిలావిగ్రహమై అనంత నాట్య మొనరిస్తున్నది. నాగచంద్రుడు మోకరించి దివ్యానందభంగిమలో ప్రణయశిల్పి స్వరూపాన ఆమె ఎదుట కాల శిలావిగ్రహమూర్తిలో ఘనీభూతుడైనాడు.

తుంగభద్ర ప్రవహించింది.

## గురజాడ అప్పారావు

# మీ పేరేమిటి?

'దేశమంటే మట్టికాదోయ్—దేశమంటే మనుషులోయ్' అని తెలుగువారిని మేల్కొలిపిన మహనీయుడు గురజాడ అప్పారావుగారు. 'ముత్యాల సరాలు' తెలుగు ప్రజానీకంలో నూతనకాంతులు వెదజల్లాయి. శతాబ్దుల పాటు జీవించగల మహోత్కృష్ట రచన వీరి 'కన్యాశుల్కం'. గురజాడవారు మనకి నూతన యుగకర్తలు.

దేవుడు చేసిన మనుషుల్లారా!
మనుషులు చేసిన దేవుళ్లారా!
మీ పేరేమిటి?

పురాణములను గురించి మేము శంకలు వేస్తే, మాగురువుగారు "వెధవ చదువు! మీ మతులు పోతున్నాయి. మీరు వొట్టి బౌద్ధులు" అనేవారు.

"బౌద్ధులు యెటువంటివారు, శాస్త్రుల్లుగారూ?" అని రామమూర్తి అడిగాడు. రామమూర్తి శతపెంకె.

"రేపు ఆదివారంనాడు పువ్వుల తోటలో ఉపన్యాసం యిస్తాను; అంతా రండి" అని శాస్త్రుల్లుగారు శలవిచ్చారు.

ఆదివారంమధ్యాహ్నం నాలుగుగంటలప్పుడు పువ్వుల తోటలో ఒక పరువుమామిడిచెట్టు క్రింద యిసకలో మేమంతా పాతికమంది కూచున్నాం. మధ్య గావంచా పరచుకుని మాకు అభిముఖంగా శాస్త్రుల్లుగారు కూచున్నారు. నేల బల్ల చెక్క తెచ్చి వెయ్యబోతే, "వొద్దురా, మీరంతా క్రింద కూచుంటే, నేను బల్లమీద కూచుంటాన్రా!" అన్నారు. రెండు కొబ్బరికాయల నీళ్లుతాగి, తాంబూలంవేస్తూ, శాస్త్రుల్లుగారు బౌద్ధమతం విషయమై ఉపన్యాసం ఉపక్రమించారు. పది నిముషములు అయేసరికి, రామ్మూర్తి తన చేతనున్న పుస్తకం విప్పి చూచి 'శాస్త్రుల్లుగారూ, తాము శలవిస్తూన్నదంతా సర్వదర్శన సంగ్రహములోనిది కాదండీ' అని అడిగాడు. ఆశ్చర్యపడి, శాస్త్రుల్లుగారు "ఔరా! నీకెలా తెలిసిందిరా? అదేం తర్జుమా కాదుగద?" అన్నారు.

"ఔనండీ."

"ఈ యింగిలీసువాడు ఉద్దండపిండమురా! ఆ రెండో పుస్తక మేమిటో?"

"బుద్ధ చరిత్రమండి."

"ఎక్కడ సంపాదిస్తార్రా యీ అపూర్వ గ్రంధాలు? యేదీ తే."

శాస్త్రుల్లుగారు పుస్తకం అందుకుని, అతి మధురమైన [illegible] చదివి, అర్థం చెప్పడం ప్రారంభించారు.

నాలుగు రోజులు పోయిన తరువాత, శాస్త్రుల్లుగారు

క్లాసులో యిలా శలవిచ్చారు. 'ఒరే యీ పుస్తకం చదివిం దాశా, బుద్ధుడిమహిమ నాకు తెలియలేదురా, తప్పకుండా యీ మహానుభావుడు శ్రీమహావిష్ణు అవతారవేన్రా.

ఆ నాటనుంచీ శాస్త్రుల్లుగారు మమ్మలని బౌద్ధులని దూషించడం మానేశారు.

కిరస్తానుల మనిమట్టుకు అంటూ వచ్చారు. క్రీస్తును, శ్రీ మహావిష్ణువుయొక్క పదకొండవ అవతారంగా చెయ్యడం సాధ్యంకాక, వొడబడి వూరుకున్నాం.

మా గురువుగారివంటి గురువులు లోకంలో లేరు. చిర కాలంకాశీవాసంచేసి, తర్కశాస్త్రము చదువుకున్నారు. మన దేశంలో అంత తార్కికుడు లేడని ప్రతీతి. శాస్త్రంమాట కేంగాని, కావ్యాల్లో మంచిరసగ్రాహి. మరి సుగుణసంప త్తికో అంటే, సత్యకాలపుమనిషి అన్నప్పుడు, ఆయనే సత్య కాలపు మనిషి. అంత పాండిత్యం యింత సత్యకాలం ఒక బుఱ్ఱలో యేలా యిమిడివున్నయ్యో, ఆశ్చర్యం!

ఈ జరిగినది పదిసంవత్సరముల కిందటిమాట. ఇప్పుడు శాస్త్రుల్లుగారు పించను పుచ్చుకున్నారు. మాలాంటి శిష్యుల శుశ్రూష పొందుతూ, మాకు సంస్కృతగ్రంథాలు చెబుతూ సంతోషిస్తూ,సంతోష పెడుతూ కాలంవెళ్ళబుచ్చుతున్నారు.

నేను వర్తకం చేస్తున్నాను. రామమూర్తికి భూములు లావుగావున్నాయి. కొత్తకొత్త మోస్తర్లను వ్యవసాయం చేస్తున్నాడు. ఊటగెడ్డదరిని సీతారామ కోరుతున్న ఒక బ్రహ్మాండమయిన తోటవేశాడు. అవి పువ్వులు కావు, అవి పళ్లుకావు. తొలిఫలాలు గురువుగారు ఆరగి[illegible]

రామ్మూర్తి చెట్టుముట్టడు. ఆతోటలో విహారించడం గురువు గారికి అత్యానందం. అక్కడనే మేంతరుచు మీటింగులు చేస్తూంటాం. వెంకయ్య స్కూలులో మేష్టరు. ఖాయిదా లావుచేసి తిట్లు తింటూవుంటాడు. మా స్కూలుజట్టులో ఆ రేడుగురం యిక్కడేవున్నాం. గురువుగారూ, మేమూ కలసి నప్పుడల్లా స్వర్గఖండం ఒకటి అక్కడికి దిగినట్లువుంటుంది.

ఇక ప్రస్తుతకథ. మా పట్నానికి ఎనిమిది మైళ్ళదూరంలో రామగిరి అని ఒకవిష్ణుక్షేత్రం గలదు. దాని వర్ణన మరి వకమాటు చేస్తాను. ఇప్పటి మట్టుకు మీకు తెలియవలసినదేమంటే: అక్కడి విష్ణుక్షేత్రం ఆధునికం. ఆవూరి నల్లకొండల నంతటను శిధిలమైన బౌద్ధకట్టడములు కలవు. అక్కడి వారు వాటిని పాండవుల పంచలంటారు. ఈ దేశంలో పాండవులు వుండని గుహాలూ, సీతమ్మవారు స్నానమాడని గుంటలూ లేవు.

ఒక పెద్ద గుహాలోనున్న బౌద్ధవిగ్రహాము ను శివుడని, దాని ప్రక్కనున్న దేవీవిగ్రహామును గౌరి అని భావించి జంగాలు పూజచేస్తున్నారు.

ఉండగా ఉండగా కొన్నాళ్ళకి ఒక దొర గుమస్తాలతోను, బిళ్ళబంట్రోతులతోనూ వచ్చి, మెట్లపడమటనున్న ముదరమామిడితోటలో కాంపు ఖణాయించాడు. మరిన్ని వందలకొలది కూలీలను కూర్చి ఆ కొండలమధ్యవున్న దిబ్బలు తవ్వించడం ఆరంభించాడు. ధనంకోసం తవ్వుతున్నాడని అక్కడివాళ్ళంతా అనుకొన్నారు. కాని విరిగిన ప్రతిమలూ, [illegible]గు చెక్కిన రాళ్ళూ, పాతుకుపోయిన పాతకుండలూ

మండలూ బళ్ళమీద పెరికి, ధనంకంటేనూ యెక్కువభద్రంగా యేర్చి పేర్చాడు. ఇవి చూచుట కే మేంవెళ్ళాం.

మేం ఆవూరు వెళ్ళేసరికి, జంగాలు పూజచేసే పాల రాతి బుద్ధప్రతిమను గూర్చి వూరంతా కోలాహలంగా వుండెను. ఆబొమ్మ మేం చూశాం, బహు సొగసైనది. ఇంత తీరైన చిత్రము గాంధార దేశంవైపు తప్ప మరెక్కడా చూడ లేదని దొర మాతో చెప్పారు. దాని పీఠంమీద "యేధర్మా హేతు ప్రభవా' ఇత్యాది బౌద్ధసిద్ధాంతము సొంపుగా వ్రాయబడి వున్నది. దొరగారు దానిమీద కన్ను వేసి "ఇస్తారా?" అని అడగగా, శైవులలో పెద్దలు "ప్రాణముల నయినా యిత్తుముగాని, దానిని యివ్వజాలము" అనిరి. దొర గారు నలుగురిలో సాయిలాపాయిలాగా తిరిగేవారు గనుక మర్యాదగా జవాబు చెప్పారు. మరివకరైతే, కథ చాలా దూరం చెళ్ళివుండును. దొరగారు అంతటితో ఆ ప్రయత్నం మానుకున్నారు.

ఇలావుండగా ఒకనాటి రాత్రి పూజచేసి జంగం శర భయ్య ఆ ప్రతిమను పెగిల్చి, కొంపోయి, దొరగారికి రెండు వందలికి అమ్మజూపాడు. "దొంగతనంగా తెస్తివి, పుచ్చుకో జాలను" అని దొర తనకు మాటరాకుండ వుండగలందులకు వూరి పెద్దలకు కబురుపెట్టాడు. ఏమిటి, దొరబుద్ధి తక్కువా. అని శరభయ్య కొంత ఆశ్చర్యపడి కొంచెం కనుజాటు కాగానే, మెట్టలవైపు పరుగుచ్చుకున్నాడు. నాటికీ నేటికీ మరి ఒకరు లేదు.

శాయన్న భుక్త గారియింట బసచేసి, ఆవూళ్లో [illegible]

మూడురోజులున్నాం. శాయన్నభక్త మా గురువుగారి దగ్గర కొన్నాళ్లు తర్కం చదువుకున్నాడు. మంచి సాహిత్యం కద్దు. కొంచం కవిత్వంకూడా అల్లుతాడు.

మూడోనాడు రాత్రి భోజనంచేసుకుని, డాబామీద నలుగురమూ కూచున్నాం. చిన్నగాలి రేగి, తోటలో కొబ్బరి మట్టలు అల్లాడడం ఆరంభించాయి. ఎదుట దేవుడికొండ బ్రహ్మాండమైన మహాలింగంవలె చీకటిని చీల్చుకొని మిన్ను ముట్టి మనిషియొక్క అత్యల్పతను సూచించుచు, ఏదో చెప్ప రాని చింతను, భీతిని మనస్సులకు కలుగజేయుచుండెను. దేవ తలు పూజచేసిన దివ్య కుసుమములవలె చుక్కలు శిఖరము చుట్టు చెదిరి వెలిగెను. మా మనస్సులు గతకాలమునాటి స్థితి గతులనుగూర్చిన ఊహాలతో నిండియుండెను. తలపోసి, తల పోసి ఆనాడు యీ స్థలం యెలావుండెనో, బౌద్ధులు యేమేం చేసినారో అని నేనంటిని.

"ఆ పీనుగులు మనలాగే యేడుస్తూవుండేవారు. మన కంటె అర్థానంగా వుండేవారు" అని సున్నితమైన తలంపులు బెదరి చెదిరే పెళుసు గొంతుకతో వెంకయ్య అరిచాడు. నాకు కళ్ళుమొయ్యా కోపంవచ్చి, "నీ అమూల్యమైన వూహా లతో నువ్వు ఆనందించరాదా? నా తలలో నే కల్పించుకున్న బౌద్ధ ప్రపంచమును పెటుకుమాటలాడి యేల కలతపరచె దవు?" అని అడిగాను.

"కాని" శాస్త్రుల్లుగారు అన్నారు: "బుద్ధుడు విష్ణ్వవ తారంగదా? ఈజంగాలు శివుడని యేల పూజచేస్తున్నారా?" అని శంక వేశారు.

శాయన్నభుక్త పొడుండబ్బీ తీసి, పెద్దపట్టుపీల్చి గావంచాతో ముక్కుతుడుచుకొని 'ఒక కథ వుంది' అన్నాడు. కథంటే శాస్త్రుల్లుగారికి సరదా. 'అయితే చెప్పు,' అన్నారు. చెవినొగ్గి విన్నాం. ఇదీ కథా:

"ఈ గ్రామంలో శైవ వైష్ణవ మతాలకు వైరం చిర కాలంనుంచీకద్దు. శివమతానికి మొనగాడు జంగం శరభయ్య, అనగా యిప్పుడు పారిపోయిన పూజారే. మొన్న ప్రతిమను పెరికి పలాయనం అయిందాకా అతగాడు సాక్షాత్తు నంది కేశ్వరుడి అవతారమని, రాత్రులు గుహయెదుట వృషభరూపమై మేస్తూవుంటాడని యిక్కడ జంగాలకూ దేవాంగులకూ నమ్మకం. ఇప్పుడైనా ఆ దొర కిందటిజన్మలో పరమ మహేశ్వరుడౌటచేత ఆ విగ్రహమును కోరినాడనీ, భక్తవాత్సల్యం చేత శివుడిచ్చిన శలవును అనుసరించే శరభయ్య విగ్రహాన్ని పెరుక్కు వెళ్ళాడనీ, డేరానుంచి పారిపోవడంలో వృషభ రూపం ధరించి రంకెవేసి మరీ దాటేశాడనిన్నీ, ఒక వార్త అప్పుడే అతని శిష్యులు పుట్టించారు. రేపో, నేడో వీరాసనం వేసుకుని, ఒకధ్యానంచేస్తూ కొండమీాదనో, గోపురము మీాదనో ఆవిర్భవిస్తాడు. బాజాబజంత్రీలతో వెళ్ళి ఉల్లభం బట్టి తోడ్కుకు వస్తారు. ఆపైని కంసాలి వీరయ్య (వీరణాచారి అని పిలిస్తేనేగాని కోపగిస్తాడు) ఆ కథకి చిలవలూ పలవలూ కల్పించి ద్విపద కావ్యం రచించి అచ్చువేస్తాడు. ఆ యుభయుల కీర్తి దిగ్దంతులకు వెల్ల వేస్తుంది!"

"ఔరా, వీళ్ళ 'మూఢభక్తి! ఈ ప్రపత్తి పండితులకు వుండదురా! వీళ్ళది యేమి అదృష్టం" అని గురువుగారు

అన్నారు. ఆపైని వెంకయ్య యేమో అనబోతే, చేతితో నోరు అడ్డాను. "ఎవరి అభిప్రాయం వారు చెప్పకుండా నీశాసనం యేమిటి?" అని అడిగాడు. మాటాడవద్దని సైగ చేశాను. శాయన్న భక్త తిరిగీ యెత్తుబడి చేశాడు.

"అవును, తాము శలవిచ్చినట్టు పామరులకువుండే గాఢ భక్తి పండితులకు వుండదుగాని, యీ మూఢభక్తి ఒకప్పుడు ప్రాణాంతం తెస్తుంది; అదే చెప్పబోవుచున్నాను వినండి."

"నేనూ ఆమాటే చెప్పబోతే చెప్పనిచ్చాడు కాడు" అని వెంకయ్య అన్నాడు. "అవును, నీకంటూ తెలియని సంగతి లేదు, మరి వూరుకో" అన్నాను.

"శివస్థలంయొక్క ఉత్పత్తి మీకు తెలియనే తెలుసును. పూజారి శరభయ్య చాలా కథకుడౌటచేతను, వీడి రోజుల్లో శివస్థలానికి మిక్కిలిగా వైభవం కలిగింది. చుట్టుపట్ల గ్రామాలవాళ్ళందరూ మొక్కుబళ్లు చెల్లిస్తారు. ఉత్సవపు రోజులలో పెద్ద జాతర్లు సాగుతాయి. మరిన్నీ యిక్కడి దేవాంగులు కలిగినవాళ్లు. జంగంపాడు యావత్తున్నూ, దేవరపేటానున్నూ శరభయ్య మాటమీద నడుస్తారు. ఈ గ్రామంలోవుండే విష్ణుస్థలం రెండువందలయేళ్ళ క్రిందట యీ దేశం యేలే ఒక మహారాజు కట్టించి రాజభోగాలకు నొక గ్రామం స్వామికి సమర్పణ చేశారు. అప్పటినుంచి రంగాచార్యులుగారి కుటుంబస్తులే యీ స్థలానికి ధర్మకర్మలై వుంటూ వచ్చారు. ఈయన యిద్దరు ముగ్గురు వైష్ణవులను జీతమిచ్చి వుంచి, వాళ్ళచేత మిక్కిలి భక్తి శ్రద్ధలతో స్వామివారి కైంకర్యం జరిపిస్తూ వున్నారు. రంగాచార్యులుగారు బహు

యోగ్యులు. ఆయన యొక్క సంస్కృత సాహిత్యం మీరు చూడనే చూశారు. ద్రావిడ వేదములలోకూడా గట్టివారని ప్రతీతికద్దు. ఆయనకొమాళ్ళు కృష్ణమాచార్యులు కూడ సంస్కారేగాని విశేష ప్రయోజకుడు కాడు. ఆ యింటికి వెలుగు తెచ్చినది యీ కృష్ణమాచార్యులు భార్య నాంచారమ్మ. ఆమె తల్లీ తండ్రీకూడా పండితులౌట చేత ఆంధ్రగీర్వాణముల యందు మంచి జ్ఞానం సంపాదించింది. పురాణం ఆయిల్లాలు చదివినంత శ్రావ్యంగానూ, రసంతోనూ యెవరూ చదవ జాల్రు. రూపమూ, రూపానికి సదృశమైన గుణసంపత్తీకలదు. ఆమెకు ఒక కుమార్తె, ఒక కుమారుడున్ను; ఇల్లూ, దేవాలయం కూడా ఆమె చక్కబెట్టుకుంటారు.''

''ఇదికవిత్వమా, నిజమా?'' అని వెంకయ్యఅడిగాడు.

''మాకూ వాళ్ళకూ రాకపోకలుగలవు. నా భార్య చెప్పినమాటలు నే చెబుతున్నాను. ఆమె పురాణం చదవడం చెవులారా విన్నాను. మీకు వినడపు అభిలాష వుంటే, రేపటిదాక వుండిపొండి...విష్ణుస్థలంయొక్క స్థితి ఇది. గాని, అయ్యవార్లంగారు మతసంబంధమైన జట్టీలలో యెన్నడు జోక్యం కలుగచేసుకోవడంలేదు. వైష్ణవపక్షానికి కెప్తాను సాతాని మనవాళ్ళయ్య. అనగా రోజూ పొద్దున్న ఉపాదానానకు వచ్చి, స్తోత్రపాఠాలతో పెణక యెగరగొట్టేస్తాడే, అతగాడే. ఒకనాడు తెల్లవారగట్ల కలక్టరుగారు గుఱ్ఱమెక్కి వస్తూండగా గ్రామ పొలిమేరను మనవాళ్ళయ్య యెదురై, పెళపెళమని శ్లోకంయెత్తుబడిచేసేసరికి, ఇతని స్థూలకాయం, బత్తెనామాలు, రాగిధ్వజం, కోలాహలమూ చూసి గుఱ్ఱం బెదిరి

రింది. కోపంవచ్చి కలక్టరు అయిదు రూపాయలు జుల్మానా వేశారట. ఈ కథ శుద్ధాబద్ధం అని, తనచేత శ్లోకాలు చదివించి దొరగారు అయిదు రూపాయలు ప్రెజంటిచ్చారనీ, అవిపెట్టి కొత్త వ్యాయవారపాత్ర కొన్నానని మన వాళ్ళయ్య చెబుతాడు.''

## 2

శైవులలోవున్న ఐకమత్యం వైష్ణవుల్లో లేదు. సాతాన్లు చాలమంది మనవాళ్ళయ్య శిష్యులే. అయినప్పటికి కొందరు మట్టుకు అతను అవతారపురుషుడని చెప్పరు. అత నంటాడు – ''శరభయ్యే వృషభావతారమైనప్పుడు, నేను గరుడాళ్వారి పూర్ణావతారం కాకపోతే కాకపోవచ్చునుగాని, వారియొక్క అత్యల్పాంశవల్లనైనా జన్మించివుండకూడదా? గరుడాళ్వారి నఖములయొక్క తేజస్సు నాయందు ఆవిర్భవించి వున్నది. కాబట్టే శరభయ్యను యిలా చీల్చి పేల్చుచున్నాను'' అని.

అయ్యవార్లంగారికి ఒకమాటు యీమాట చెవిసోకి గట్టిచీవాట్లు పెట్టారు. ఆచీవాట్లుతిని పైకివచ్చి, ''యీబ్రాహ్మలది జ్ఞానమూ కాదు, అజ్ఞానమూ కాదు. కడజాతి మనుష్యులే భక్తిప్రభావంచేత ఆళ్వార్లు అయివుండిరికదా. ఇంతకాలవాయి రాముడిధ్వజమును జయప్రదంగా మోస్తూ, శైవ సంహారంచేసిన నేను శ్రీమద్గరుడాళ్వారి నఖాగ్రంయొక్క అవతారం యేలకాను? గరుడాళ్వారి నఖములు

పెరిగి, ఖండన ఐనప్పుడూ ఆముక్కలు నావంటి భక్తులుగా ఆవిర్భవించి పరమత సంహారం చే స్తవిగాని, వృథాగా పోసే ర్చునా? వట్టిమాట!'' అన్నాడు.

''ఔరా! యేమి మూర్ఖత! యేమి అహంభావము! యీ అజ్ఞులా అవతార పురుషులు? ఇలా అన్నందుకు వీళ్ళ తలలు పగిలిపోవురా?'' అని గురువుగారు అన్నారు.

''శాస్త్రుల్లగారూ, పాతరోజులైతే, వీళ్ళే అవతారా లయి పోదురు. వీళ్ళ పేరట బొమ్మలునిలిపి దేవాలయాలు కట్టి, మనమే పూజ్జేతుం. మరి బుద్ధుడు అలాంటి మనిషేగ దండి'' అన్నాడు వెంకయ్య.

''చాకిబట్టెకి సముద్రానికి సాపత్యం తెస్తివి'' అన్నాడు గురువుగారు.

''అన్నమాటకల్లా వ్యాఖ్యానం చేస్తేనేగాని వూసు పోదురా!'' అని నే అన్నాను.

''ఈవూరి నాయకులు స్తోమం కలవాళ్ళు. అందులో సారధినాయుడు లక్షాధికారి. అతని బావమరిది రామి నాయుడు గ్రామమునసబు. కొంచం ధూర్తు, నిషాశాజీన్నీ భోజన ప్రియుడు. ఈ తాలూకాలోకల్లా పెద్దసారాదు కాణం యీ వూళ్లోనే వుంది. దాన్నిబట్టి యీ వూరి యోగ్యత మీరు వూహించుకోవచ్చును.

నాలుగు సంవత్సరముల క్రిందట యిక్కడికి దక్షిణ దేశంనుంచి ఒక అయ్యవార్లంగారువచ్చి, సారధినాయుడికీ, ఇంకా మరికొందరు నాయకులకూ, చక్రాంకితం చేసి, వైష్ణవ విచ్చారు. ఆనాడు మునసబు రామినాయుడు రామస్వామి

వారి ఆలయంలో తూ(ంపట్టు పులిహోరా, వైష్ణవమూ యేక కాలమందే గ్రహించాడు. నాటికీ నేటికీ రెంటియందూ ప్రవృత్తి యేకరీతిగానే వుంది; అప్పటినుంచీ సారథినాయుడు ద్వాదశి ద్వాదశికి స్వాంవారికి విరివిగా రాగభోగాలు నడిపిస్తున్నాడు. ద్వాదశి అంటే రామినాయుడికి పెద్ద పండుగ.

నాయుళ్ళంతా వైష్ణవం పుచ్చుకొని శివకోవెలవైపు తిరిగి చూడకపోవడం శరభయ్యకు కంట్లో మిరపకాయలు రాసుకున్నట్టు వుండెను. ఆలోచించి ఒక యెత్తు యెత్తాడు.

ఆ రోజుల్లో హైదరాబాదురాజ్యంనుంచి శివాచార్లు కొందరు దేశసంచారార్థం యీ ప్రాంతానికి వచ్చారు. మరి రెణ్ణెల్లనాటికి పీఠంతోనూ, ప్రభలతోనూ, రుంజలతోనూ పెనుప్రళయంగావచ్చి యిక్కడికి దిగబడ్డారు. రోజూ అర్ధరాత్రివేళ శివార్చన చేసేవారు. ఆ సమయంలో శంఖాలు, జయఘుంటలు, ఢమామీలు వీటిధ్వని పామరుల మనస్సులో భయోత్పాతం పుట్టించేది. ఈ నల్లరాతికొండలో ఆ ధ్వనులకు ప్రతిధ్వనులు కలిగి, కోలాహలంగా వుండేది. ఈ అట్టహాసంతో వైష్ణవం పుచ్చుకున్న ఒక్కొక్క నాయుడే నామాలకి నామంబెట్టి విభూది రుద్రాక్షధారణం చెయ్యడం ఆరంభించాడు. వచ్చిన పదోరోజున శివాచార్లు గుండం దొక్కటానికి పెద్ద ప్రయత్నాలు చేశారు. సారథినాయుణ్ణి కదిలించడమే వాళ్ళ ముఖ్యప్రయత్నంగా వుండెను. అదివరకే సారథి నాయుడికి శివమతంవేపు తూగులావాయెను. గుండం తొక్కడం చూసిన తరువాత సారథినాయుడు సిద్ధాంతంగా శైవం పుచ్చుకుంటాడని అంతా నమ్మారు. అందు

చేతనే శైవుల్లో మొనగాళ్ళంతా రుంజలతో సారథినాయుడి యింటికి వెళ్ళి చాలా కైవారంచేసి, ఉత్సవం చూచుటకు రాకతీరదని పిలిచారు.

ఈ మాట చెప్పగా, అయ్యవార్లంగారు యేమన్నారంటే "రాముడి ఆజ్ఞ యేలావుంటే అలా జరుగుగాక. వైష్ణవుడు శైవుడు కావాలని కోరితే అడ్డి యేమికార్యం? కాక కాశీలో మృతిపొందినవారికి శివుడేకదా తారకమంత్రోపదేశం చేస్తాడు. గనుక యీ జన్మలో పరమశైవుడైన వాడికి, వచ్చే జన్మలో తారకమంత్రోపదేశం చేసి, ముక్తి యివ్వకపోతాడా? ఏమతమైనా ప్రతిపత్తివున్నవాడికి త్రోవ వుంది. అదిలేకుంటే, వైష్ణవుడైనా కార్యం లేదు." సాతాన్లకి అయ్యవార్లంగారి ఉదాసీనత చెయి విరుచుకున్నట్టు వుండెను.

"ఈ బ్రాహ్మడికి వైష్ణవాభిమానం తక్కువ; గనక మనం విజృంభిస్తేనేకాని వైష్ణవమత ప్రభావానికి అగౌరవం వస్తుం" దని మనవాళ్ళయ్య ప్రగల్భించి, శివాచార్ల గుండం దొక్కే నాటిరాత్రి రెండుజాములప్పుడు, కోవిలయెదటి రావిచెట్టుక్రింద పెద్ద మీటింగు చేశాడు. సాతాన్లు నాయలూ వొందలికి జమ అయినారు; అందులో యోధులు దుకాణంలో రహస్య సేవ సేవించి, ఒక్కొక్కరే దిగబడ్డారు. అంతట మనవాళ్ళయ్య చెట్టు మొదటి రచ్చరాతి మీద వంగి నిలచి, గెడ్డము కింద వక కఱ్ఱ ఆనుకుని, యేమని పలికెను: "పరమ భాగవతోత్తముల్లారా! వింటిరా? ఈ శైవులయొక్క రాకసమాయలో పడి అప్పుడే

చాలామంది నాయులు వైకుంఠానికి పోయే రాజమార్గమైన వైష్ణవమతం విడచి, అంధకారబంధురమైన శైవమతంలో కూలి పోయినారు. ఇక మన పరమమిత్రుడున్నూ, భక్తాగ్రేసరుడున్నూ అయిన సారథినాయణ్ణి మాయగమ్మి తమలో బడ వేసుకొనుటకు యిప్పుడు విపుల ప్రయత్నం చేస్తున్నారు. ఈ రాత్రి అతడు వెళ్ళి శైవుల ఘోరకృత్యములు చూసెనా, మరి మనవాడు కాడు. గనుక అతన్ని కాపాడి, శ్రీమహావిష్ణు యొక్క మహిమ ప్రజ్వలింపచేసేసాధనం యేమిటో తాము అంతా ఆలోచించండి. సారథినాయడు యీ రాత్రి అక్కడకు వెళ్లకుండా ఉపాయము కల్పించడము మన కర్తవ్యమని నా అభిప్రాయము.''

ఎలాగంటే, యెలాగని నలుగురూ తలపోయుచుండగా, రామానుజయ్య లేచి నిలిచి అన్నాడు: ''దీని కింత ఆలోచనేలా? యేమి? వాళ్ళు చేసేపని మన వేలచేయరాదు? రామభక్తుడైన శివుడికే అంత మహిమ వున్నప్పుడు, సర్వేశ్వరుడైన ఆరాముడికి అంతకన్న వెయ్యిరెట్లు మహిమ ఉండకపోయీనా? గనుక, నా సలహా యేమిటంటే, శ్రీమద్గరుడాళ్వారి అవతారమైన మనవాళ్లయ్యరాగిధ్వజం చేతపట్టుకొని నాలాయిరం పఠిస్తూ గుండం తొక్కి తేసరి. శివ వైష్ణవ మతాల తారతమ్యం లోకానికి వ్యక్తంకాగలందులకు శివాచార్ల గుండంకంటె మరి బారెడు ఆస్తి లావుచేసి, యీ చెట్టుకిందే యీ క్షణమందు బ్రహ్మాండమైనగుండం తయారుచేస్తాను. ఇందుకు అభ్యంతరం చెప్పేవాణ్ణి వైష్ణవుడని భావించను.''

చీకట్లో యెవరికీ కానరాలేదుగాని, మనవాళ్లయ్య నోరు వెళ్లబెట్టాడు. నలుగురూ "బాగుంది! బాగుంది!" అనే సరికి అతని ప్రాణాలు యెగిరిపోయినాయి. ఒక్క నిమిషం ఆలోచించి అన్నాడు: "అన్నల్లారా! తమ్ముల్లారా! పరమభాగవతోత్తముల్లారా! రామానుజయ్య నన్ను ఆక్షేపణ చేస్తున్నాడు. నేను పడవలసిందే? ఈ శరభయ్యేవచ్చి తానువృషభావతారవఁని నిక్కి నీలుగుతున్నాడుగదా? మనం దెబ్బకిదెబ్బ తీదాం అని కేవల వైష్ణవాభిమానంచేత, నేను గరుడవేషం వేశానేగాని, ఇంత భారమైఁన శరీరంతో నేను గరుడాళ్వారిని యెన్నడూ కానేరనే! ఆమాట నాకు తెలియదా? రామానుజయ్య అయితే, చులాగ్గా డేగలా వున్నాడు గనుక, అవశ్యం అతగాడే గరుడాళ్వారి అవతారం. అతణ్ణి గుండం తొక్కమనండి. నేనుగానీ నిప్పుల్లో కాలుబెట్టానంటే గజం లోతుకూరుకుపోయి చస్తాను. రామానుజయ్య తేలిగ్గా వున్నాడు: అంటీ అంటనట్టు చప చప అడుగేసుకుపోతాడు. అన్నల్లారా! న్యాయం ఆలోచించండి" అనేటప్పటికి రామానుజయ్య సన్న సన్నంగా జారాడు.

రామినాయుడు జల్దుకొని అన్నాడు: "రావఁస్వామికి మయిమం వుందా, లేదా? వుందా, యీ యేషాలుమాని తిన్నగా గుండం దొక్కు." ఆమాటవిని, మనవాళ్ళయ్య మొహం జుమాలింది. రామానుజయ్యలాగ మందలోఁజొచ్చి మాయవ్వాఁదాఁవంటే, చీమా దోమా కాడు. పది యిరవై మణుగుల పట్టు. "హా దైవమా! నేను ఒక్క అరగడియ

గరుడాళ్వారినే అయితే, ఎక్కడికైనా యెగిరి ప్రాణం దాచు కుందును గదా?'' అని అనుకున్నాడు.

'ఏం, పల్లకుంటావేం' రామినాయుడు పొడవడం ఆరంభించాడు. ''అల్లాడం బెల్లాడం అని తెల్లారకుండంగ వొచ్చి, తెగ అరుస్తావుగదా? ఆ ముక్కలన్నీ మావంటోళ్లని బెదిరించి, కూరా నారా లాగడానికేనా? ఆటి మయమం యే కాసింతైనా కద్దా?''

మనవాళ్ళయ్య నిట్టూర్పు విడిచి, రామానుజులను స్మరించి యిట్లాఅన్నాడు: ''రామినాయడన్నా! నువ్వూ నేనూ చిరకాలమునాటి నేస్తులం. నువ్వు గవునరు మెంటువారి తరఫున మునసబీ అధికారం చాలా కాలవాఁయి చలాయిస్తున్నావు. యుక్తాయుక్తం యెరిగిన మనిషివి. అవునుగాని వైష్ణవమతం యొక్క ఆధిక్యత అగుపర్చాలంటే ఆ శరభయ్యచేసే తక్కువ పనా, నన్ను చెయ్యమంటావు? 'పృధివ్యాప స్తేజో వాయురా కాశాత్' అన్నాడు. విష్ణుభక్తుడైనవాడి కర్తవ్యం ఉత్తమో త్తమం. పృథివీ అనగా భూమిమీద నడవడవేఁ. పంచభూతములలో మరిఒక భూతంమీద వైష్ణవుడన్నవాడు అడుగేసి నడవనేకూడదు. అంతకు ఒక వీసం తక్కువ ఆపః అన్నాడు; అనగా నీట్లో ఉరకడం ఒకపాటి కర్తవ్యంగావచ్చు. అధమాధమం అగ్గిలోకి ఉడం గనక, మీరు యావన్మందిన్ని యిప్పుడే నా వెంటరండి. ఈ నిశీధ సమయంలో శ్రీ మహావిష్ణు నామ స్మరణచేసి అమాంతంగా సీతాగుండంలో పుణుకుతాము, అప్పట్లో నా మహిమ మీకు తెలియగల్దు.

రామినాయుడు దగ్గరకు వచ్చి, మనవాళ్ళయ్య చెయి

పట్టుకుని గట్టిగా నొక్కుతూ అన్నాడు: "యిన్నావా వైష్ణ
పోడా, మా ఇయ్యంకుడు సారధినాయుడు జంగపాళ్లలో కలిసి
పోతే, దోదసి పులిహోరి, శక్కరపొంగళం పోతాయి, ఆ
మాట నీకూ యెరిక, నాకూ యెరిక. నీవు సీతమ్మగుండంలో
ఆనపకాయ తుంబలాగ తేలి, యీతలాడితే, నీమయిమం
ఆడొప్పుతాడా? యెర్రికుట్టికబుర్లు మానేసి, మావాడు రెండు
కళ్లతో సూస్తుండగా, అల్లాంషం బెల్లాండం అంటూ అగ్గి
దొక్కు!"

"సరే, నేస్తం. నీకభిప్రాయం ఆప్రకారం వున్నట్ట
యితే అలాగే కానియ్యండి. శ్రీమహావిష్ణువుయొక్క మహిమ
నిలబెట్టడానికి అగ్గితొక్కుతానా, తొక్కిచూస్తానా? ఇప్పుడు
చాలా రాత్రైంది, యిళ్ళకిపోయి పరుందాం. రేపు యీ
వేళ్లప్పుడు యీస్థలంలోనే బ్రహ్మాండమైనగుండం చేసి,
దందహ్యమానమైన ఆ గుండం తొక్కి, వైష్ణవమత
ప్రభావం కనపరుస్తాను. అప్పట్లో ఆ గరుడాళ్వారే, నన్ను
ఆవహించి, అంత గుండమునూ చెంగున ఒక్కదాటున
దాటిసారు."

"ఆ పప్పు వుడకదు; ఈ రాత్రి మావాడు జంగ
పాళ్ళలో కలిసిపోతే, రేపు నువ్వుదాటేం, దాటకేం?
ఆదాటే దాటేదో, యీయీాళ ఆళ్ళగుండంలోనే దాటు!
లెండొస్సి - యీవైష్ణవోణ్ణి మోసుగెళ్ళి గుండం తొక్కి
ద్దాం' అని రామినాయుడు అనేసరికి, నలుగురు నాయులు
మనవాళ్ళయ్య రెక్కలుపట్టుకుని రచ్చరాతిమీాదనుంచి కిందికి
దించారు.

మీారి వచ్చిందని మనవాళ్ళయ్య ఒక యెత్తుపన్నాడు. "ఆగండి, ఆగండి; గుండం తొక్కవలసివచ్చినప్పుడు, అందుకు కావలసిన పరికరమంతా కూర్చుకోవడవాఁ?— లేకుంటే, కట్టుగుడ్డలతో గుండంలో పడేసి, వొళ్లు తెగ్గాలుస్తారా? ఆ శివాచార్లు వీరభద్రవిగ్రహం చేతబట్టి, మంత్రాలు పఠిస్తూ, శంఖధ్వనికి వీరావేశంపుట్టి గుండం తొక్కుతారు. ఆలాగే శ్రీ రామస్వాంవారి తాలూకు ఉత్సవ విగ్రహం వొకటి నానెత్తిని కొడితేగాని యేలా చస్తాను? గరుడాళ్వారు అయినా యెప్పుడూ పెరుమాళ్ళారిని వీపున మోసుకునే బయల్దేరుతారు; గాని ఒట్టినే రెక్కకదపరు. మీా రెరుగరా?" అనేటప్పటికి, సాకధినాయుడు 'ఆ మాట నిజవఁరా; యిగ్గరవిఁస్తాడు; అయ్యావోర్ని తెలుపుకు రండోస్సి' అన్నారు.

నల్లురు నాయులు పక్కనున్న అయ్యావార్లంగారి ఇంటికి వెళ్ళి పైమీాద గుడ్డ అయినా లేకుండా ఆయనను మోసుకు వచ్చి రావిచెట్టుక్రింద రచ్చరాతిమీాద కూచోబెట్టారు. ఈ గడబిడ కనిపెట్టి కృష్ణమాచార్లు అటకెక్కి దాగున్నాడు.

## 3

అతి వినయమును నటిస్తూ మనవాళ్ళయ్య రంగాచార్యులుగారికి ప్రస్తుతాంశము విన్నవించి, ఉత్సవ విగ్రహము యిమ్మని వేడాడు.

రంగాచార్యులుగారు అన్నారు: 'ఓరి మూర్ఖుల్లారా!

మీకు మతులు శుభ్రంగా పోయినాయర్రా? ఈ గుండం తొక్కడమనేది గర్హ్యమైన తామసవ్యాపారము. వైష్ణవ మతనిషిద్ధము. మన గ్రంథాల్లో యెక్కడా యీప్రక్రియ లేదు. గుండం తొక్కడానికి ఒక విధీ, మంత్రం యేడిస్తేనా?'

'శక్కరంతోటి వాళ్ళల్లా తెగ్గాల్బడానికీ మంతరం కద్దా! అట్టా మాటలు శెలవియ్యక, ఆ యిగ్గరవేఁదో సాతా నోడి కియ్యండి' అని రామినాయుడు అడిగాడు.

'ఛీ పొండి. మూర్ఖుల్లారా! నేను యిచ్చేది లేదు. ఉత్సవ విగ్రహములు శూద్రులు ముట్టుకోవలసినవి కావు. ముట్టుకుంటె కళ్ళు పేలిపోతాయి.'

అని రంగాచార్లుగారు అనేసరికి, మనవాళ్ళయ్య 'బతికానురా దేవుడా!' అనుకొని, సారథినాయుడితో 'చూశావా నేస్తం! ఆ మాట నిజమే! నేను ఉత్సవ విగ్రహములు ముట్టుకోకూడదు; అందుచేత యిప్పుడు కర్తవ్యం యేమిటంటే ఆ విగ్రహం పట్టుకొని అయ్యవార్లంగారే గుండం దొక్కవలసి వుంటుంది. ఆ ఆధిక్యత అనేది వారికే వుండవలసినది.'

మునసబు, 'ముసలాయన యిగ్గరాలట్టుకుని గుండం తొక్కేదేటి! సిన్నసోఁవిని లెగదీసుకెళదాం రండత్తా' అన్నాడు.

''వాడిజోలికి వెళ్ళకండి, మా బాబే! వుత్సవ విగ్రహాలు పట్టుకొని నేనే గుండం తొక్కుతాను. మావాడు పట్నం వెళ్ళాడు. వూళ్ళో లేడు'' అని రంగాచార్యులుగారు అన్నారు.

"అయితే లెండోయ్!" అని మనవాళ్ళయ్య బొబ్బ వేశాడు.

అంతట ఆ రావిచెట్టుమానుచాటున గప్పున ఒక వెలుతురు పుట్టింది. అందరూ భీతిల్లారు; నిషాలు దిగజారజొచ్చాయి. వెంటనే మానువెనుకనుంచి ఒకచేత కరదీపము, రెండవచేత సూరకత్తి పట్టుకుని వుంగరాలజుత్తు గాలికి తూగులాడుచుండగా, నిబ్బరంగా అడుగు వేసుకుంటూ వచ్చి, నాంచారమ్మ మామగారిపక్కను నిలిచి, ఆయన రెక్కలుపట్టుకుని వున్ననాయలవంక బాకు మొనజూపి "దుష్టుల్లారా! యీపరమ పవిత్రమైన బ్రాహ్మణ్ణి వొదుల్తారా, బాకుకు బలియిచ్చేవా?" అని అడిగినది.

హటాత్తుగావచ్చిన యీ వీరరూపమును చూచి అందరి ధైర్యాలూ అడుగంటాయి. అయ్యవార్లంగారిని పట్టి నిలిచిన నాయలు బెదిరి దూరం సాగారు. అంతట ఆమె చేతిదీపం రచ్చరాతిమీద వుంచి, 'నీ కేం కావా'లని మన వాళ్ళయ్యను అడిగింది. మనవాళ్ళయ్య రెండడుగులు వెనక్కివేసి తన కేమీ అక్కరలేదన్నాడు.

'నీకు ఉత్సవమూర్తులు కావలెనంటివే?'

'నా కెందుకు తల్లీ, అపవిత్రుడను! వాటిమెత్తు బంగారం కరిగియిస్తే నాకు అక్కరలేదు. రామినాయుడు యేమో కొంచం...'

ఆమె అటునించి యిటు తిరిగి, రామినాయడిని నిష్కారంగా చూస్తూ, 'నీ కేం గావాలి, మునసబు నాయడా' అని అడిగింది.

మొహం వొంచి, రామినాయుడు తన కేం అక్కర్లేదని పైకి చెప్పి 'ఆడదాయితో యవడు మాటాడగల్డు' అని గొణుగుకున్నాడు. రామినాయడి పెళ్ళాం గయ్యాళి.

నాంచారమ్మ : 'యెవరికీ యేమీ అక్కరలేకుంటే, యీ ముసలిబ్రాహ్మణ్ణి వొంటిమీద బట్టయినా లేకుండా నిద్దరమంచంమీంచి యెందుకు యీడుచుకువస్తిరి? ఎవరూ మాటాడ్రేవిఁ?'

రామినాయుడు కొంచెం ధైర్యం తెచ్చుకొని 'ఆడదాయితో మాటలకంటే సావ్లేంగాని, యీ రాత్రికడ ఆ జంగపోళ్ళు శివుఁడు పేరుజెప్పి గుండం తొక్కుతారుగదా, మన రామసోంవోరిపేరు జెప్పి మనీంకూడా గుండం దొక్కకుంటే మన పెండెం యిరిగిపోదా?'

నాంచా : నువ్వేల తొక్కరాదూ?

ముస : నాకు మంతరం, మాయా యెరికిలేదే! అందకనే సాతానోణ్ని తొక్కమన్నాను.

నాంచా : (మనవాళ్ళయ్యతో) నువ్వెందుకు తొక్కకూడదూ?

మన : అమ్మా యీవేళ యేదో నాప్రారబ్ధం చాలక యీ మీటింగు తలపెట్టాను. బుద్ధి గడ్డితిన్నది, యిదిగో లెంపలు పడపడ వాయించుకుంటున్నాను. తల్లీ నన్ను యీకాడికి వొదిలివేస్తే శ్రీరంగం వెళిపోతాను. ఈ నాలుగు వూళ్ల పొలిమేరనూ నేనంటూ తిరిగీ కనబడితే, నా నెత్తిమీద పెద్ద పిడుగు పడిపోవాలి.

నాంచా : నీకు కొండంతగుండె వుంది. (రామినాయ

డుతో) మునసబునాయడా, నీ వియ్యంకుడు సారథినాయడు విరిగిపోతే, ద్వాదశి ద్వాదశికీ 'శక్కరపొంగళం' 'పులీయూరీ' లేకపోతాయనికదా దుఃఖం?

మునసబు : (తలగోక్కుంటూ) నా కొక్కడికే అన్న మాటేటమ్మా, ఆ రామస్వాంవోరికిమాత్రం పులిహోరం కరువైపోదా?

మన : అమ్మా! శక్కరపొంగలి, దధ్యోదనమూ అనేవి ముఖ్యములు కావు. వైష్ణవమతోత్కర్ష మహిమ కనపర్చి, వుద్ధరించాలి, అదీ కర్తవ్యం.

నాంచా : ఆ వుద్ధరించడం యేదో నువ్వేల చెయ్యరాదు? నీకు వుత్సవవిగ్రహామంటూ యేలా? ఆకాశమంత రాగిధ్వజం మోసుకు తిరుగుతావుగదా, దానిలో అరకాసంతైనా మహత్తు లేదా?

మనవాళ్ళయ్య 'మళ్లీ మొదటికొచ్చింద'ని సణుక్కుంటూ, కష్టంమీంద మండలో దూరి అంతర్ధానం అయిపోయినాడు.

నాంచా : రాముడే కాడు, ఏ దేవుడిమీందనయినా నిజమైన నమ్మకమన్నది యేడిస్తే, ఒక్క గుండమేం కాదు, అన్నికష్టాలూ తరించవచ్చును. నేను మా మామగారిపేరు స్మరిస్తూ గుండం దొక్కుతాను. నావెంట రాగలిగిన వైష్ణవులెవరైనావుంటే యెదటికి రండి.

ఎవడూ కదలలేదు.

నాంచా : (నిరసననవ్వు నవ్వి) "ముసలాయనను అగ్గిలోతోసి పైనుంచి చూడడానికి మీరంతా వీరులా?"

ఎవడూ పులక లేదు, పలక లేదు.

నాంచారమ్మ అందరిని కలయజూసి, 'పీరుసాయీబు యిక్కడ లేడా?' అని అడిగింది. పీరుసాయీబు వెంటనే యెదటికి వచ్చి 'అమ్మా యిదిగో దాసుడ'నని చెయి జోడించి నిలుచున్నాడు.

పీరుసాయీబు దూదేకుల సాయీబు అయినప్పటికీ, రామభక్తుడు, కీర్తనలు చెప్పుతాడు. హటయోగం అభ్యసిస్తాడు. రోడ్డుపక్క యేటివొడ్డుతోటలో మఠం యితనిదే. ఇతనికి శిష్యబలగం లావు.

'సాయీబు, నువ్వు గుండం తొక్కగలవా?' అని నాంచారమ్మ అడిగారు.

'మీ శెలవైతే అవలీలగా తొక్కుతాను, తల్లీ' అని అన్నాడు.

నాంచారమ్మ : యేడీ మనవాళ్లయ్య! గరుడుడి అవతారం అంతర్థానమైపోయిందీ! రామినాయడా, పరమ భాగవతోత్తములై యుండిన్ని, మీరు ఎవరూ గుండం తొక్కజాలినారు కారుగదా! అట్టిస్థితిలో ఈ పచ్చితురకకి గుండం తొక్కడానికి భగవంతుడు సాహసధైర్యాలు యిచ్చాడు; గనక, వైష్ణవమతం గొప్పా? అతగాడి తురక మతం గొప్పా? రామినాయడా, మీ దేవులాటంతా యీ శాస్త్రి వైష్ణవులు, శైవులికి పరాభవం చెయ్యాలనిగదా? అందుకు వుపాయం చెబుతాను వినండి. మతాలు సాత్వికాలు, తామసాలూ అని రెండువిధాలు. ఈ రెండువిధాల మనుష్యులూ శైవుల్లోనూ వున్నారు; వైష్ణవుల్లోనూ

వున్నారు. గుండాలు తొక్కడం మొదలైన తామస కృత్యాలు చేసేవాళ్ళని శైవుల్లోశివాచార్లు అంటారు. మన వైష్ణవుల్లో అట్టి కృత్యాలుచేసే తెగకూడా వున్నారు; ఎవరో మీకు తెలియునా?

మనవాళ్ళయ్యగుంపులో మరివక పక్కనించి తన బుఱ్ఱ పైకిపెట్టి "యెవళ్ళమ్మావాళ్లు?" అని అత్యాతురతతో అడిగాడు. బుఱ మళ్ళీ మందలో మాయమై పోయింది.

నాంచారమ్మ: "ఆ వైష్ణవులు యెవరా? మరెవరు? తురకలు! పీరు అనేది యేమిటనుకున్నారు. శ్రీ స్వామివారి తిరునామమే. పట్టణంలో మా యింటిపక్కనే ఒక సాతాని పీర్లని నిలిపి, గుండం తొక్కేవాడు. పట్టణంలో యెంతో మంది హిందువులే పీర్లపంజాలు వుంచి గుండాలుతొక్కుతారు. కనక శ్రీరామస్వామివారి నామంతెచ్చి పీరుకట్టి యిస్తాను. ఆ పీరు పట్టుకుని, పీరుసాయిబు గుండం తొక్కుతాడు. పీరుసాయిబు యోగ్యత మీ రెరిగినదే. అతగాడు కబీరు దాసంత భక్తుడు. గనక భయాలు విడిచి అతని వెంటవెళ్ళి జయించుకురండి. వేళకి భక్తినిలుస్తుందో, నిలవదో, చేతికఱ్ఱలు మాత్రం మరువకండి."

ఆమె విరమించే సరికి పెళపెళమని ఆ మూకలోనుండి మనవాళ్ళయ్య శ్లోకపఠనం ఉపక్రమించి యిటూఅటూ మనుషులను తోసుకుంటూ యెదటికివచ్చి సాష్టాంగం చేసి 'అమ్మా! మీరు సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి అవతారం. వైష్ణవమతం నిలబెట్టారు. మతమే అన్నమాట యేమిటి?

మా ప్రాణాలుకూడా నిలబెట్టారు. ఇహ నా విజృంభణం చూడిండి' అన్నాడు.

మనవాళ్లయ్య పెద్ద హికమద్దారుడు; ఆ రాత్రి వైష్ణవతంత్రం తరవాయికథ అంతా అతనే నడిపించాడు.

అంతా చల్లారగానే అటకమీదనుంచి కృష్ణమాచార్యులు దిగాడు. కష్టసాధ్యమును సాధించిన సంతోషముతో నాంచారమ్మ కరదీపం తిరిగి చేతపూని, యింటికి సవిలాసముగా నడిచిపోవుచుండగా, పెనిమిటి యెదురైనప్పుడు ఆమె ప్రేమ పరిహాసములు పెనగొనుదృష్టితో చూసెను. ఆ దృష్టి తనకు దేవత్వమిచ్చి తన్ను అవతారపురుషుణ్ణి చేసిందని కృష్ణమాచారి మర్నాడు నాతోచెప్పి ఆ అర్థంతో శ్లోకం రచించాడు. తమ రహస్య శృంగారచేష్టలు మిత్రులతో చెప్పితేనేగాని కొందరికి తనివితీరదు.

ఆ రాత్రి శివాచార్లు గుండంతొక్కడం చూడ్డానికి నేను వెళ్ళివుంటిని. తెల్లవారగట్ల నాలుగు గంటలవేళ, చిరిచీకటిలో గుండంలో నిప్పులు కణకణలాడుతుండెను. ప్రాతఃకాలపు శీతగాలి సాగింది. ఒక్కపట్టున గర్భనిర్భేదమయ్యేటట్టు శంఖాదివాద్యములు రేగాయి. ఇంగిలీషు చదువుకున్న నాగరికాగ్రేసరులకుకూడా ఆ కాలమందు బెతుకు కలిగిందని వారే వొప్పుకున్నారు.

పందిటిలోంచి వీరగంధాలు పూసుకున్న నలుగురు శివాచార్లు గుండందగ్గరకు వచ్చి నిలుచున్నారు. ఒకడు నెత్తిమీద భీకరమైన రాగిప్రతిమ పెట్టుకున్నాడు. ఎదురుగా నిలిచి మరివకడు కత్తి ఝుళిపిస్తూ వీరవాక్యాలు కొలిపాడు. ఒకడు

గుండంలో నెయ్యిపోసి గుమ్మిడికాయతుండలు గుండంలోకి విసిరాడు. వెంటనే శివాచార్లు గుండంజొచ్చి నడుచుకు పోయినారు. అవతలవొడ్డు చేరి తిరిగి తొక్కటకు వారు యిటు అభిముఖులై యుండగా, "అల్లా—రామ్!" అని కెవ్వుమని ప్రళయమైన కేక ఒకటివేసి, తక్షణం శివాచార్లు గుండందిగిన వేపునుంచి, మూకను చీల్చుకుని ఒక మనుష్య ప్రవాహము గుండము దాటుకొనిపోయింది. వారిలో అంద రున్ను ముఖములమీద ముసుగులు వేసుకున్నారు. ఆ మనుష్య ప్రవాహమునకు అగ్రమందు వెండిపీరు వకటి రెండుచేతులా పట్టి ఒక వీరుడు భీమునివలె నడుచుకు పోయి నాడు. ఇది అంతా అరనిమిషం పట్టలేదు.

మూక, చకాపికలై చెదిరిపోయినది. కొందరు సాతాన్లకీ, శివాచార్లకీకూడా యెత్కించిత్ కాళ్ళు కాలాయి. అది భక్తిలోపంకింద కట్టారు. తరువాత శరభయ్యకీ, మన వాళ్ళయ్యకీ రాజీనామా అయినదని అనుకుంటారు. పైకి మట్టుకు దెబ్బలాడుతున్నట్టే వుంటారు.

అదిగో, మా యింటికి యెదురుగా ఆ రచ్చసావిట్లో నిలిపిన పీరు ఆ పీరే. నాటినుంచీ, ప్రతిసంవత్సరం ఆ పీరుకు పండుగచేస్తారు. ఊరు ఆబాలగోపాలం శైవ వైష్ణవభేదం లేకుండా పీరుదేవరకు మొక్కులు చెల్లిస్తారు. త్రిశూలా కారం గనక ఆపీరు శివపీరే అని శరభయ్య అంటాడు. ఆ వ్యవస్థేదో వెంకయ్యపంతులుగారే చెయ్య సమర్థులు.'

శివుడూ, విష్ణూ పీర్లే అయినప్పుడు, బుద్ధుడు శివుడు కారాదా?" అని శాయన్నభుక్త కథ పరిసమాప్తిచేశాడు.

మా గురువుగారు యీ చరిత్రకు చాలాఆశ్చర్యపడి అన్నారు : "ఔరా! కలికాలంలో మనుష్యులేకాదు. దేవుళ్ళు గూడా సంకరం అవుతున్నారు. అయినా తప్పేమి? శివుడన్నా, విష్ణున్నా, పీరన్నా, బుద్ధుడన్నా ఆ పరమాత్మ మట్టుకు ఒక్కడే గదా!"

వెంకయ్య వూరుకుంటాడా, "అందరు దేవుళ్లూ ఒక్కరే అయితే, ఆ పీనుగుల్ని అందరినీ, ఒక్కచోటే నిలిపి అందరూ కలిసి పూజ తగలెట్టరాదా?" అన్నాడు.

అంత, గురువుగారు "ఓరి! దేవుళ్ళని పీనుగులంటా వురా? నువ్వు వొట్టి కిరస్తానువి. ఇంకా కిరస్తానుకైనా దేవుడంటూ వున్నాడు; నువ్వు కిరాతుడివి. పీరో, బిత్రో, దెయ్యమో, దేవరో యీ అజ్ఞులకు మూఢభక్తి అయినా వుంది. నువ్వు అందరు దేవుళ్ళకీ పెద్ద నామంపెట్టావు," అంటే "ఒక్క మీకు తప్ప, శాస్త్రుల్లుగారూ" అన్నాడు.

"నీ జన్మానికల్లా విలవైనమాట అంటివిరా" అని నే అన్నాను.

# గుడిపాటి వెంకటచలం

## షమ్మ

తెనుగు సాహిత్యసీమలో చలంగారు ఒక వుప్పెన. పాతిక ముప్పయి ఏళ్ళక్రితం యీయన తన రచనలతో తెలుగుదేశంలో ఒక దుమారం లేవనెత్తారు. దాంపత్యం లోని అన్యాయాలూ అక్రమాలూ నశించాలని వీరి వాదన. స్త్రీకి జరిగే అన్యాయాన్ని సహించలేక కలంపట్టిన వీరుడు చలం. నవలలూ, కథలేగాక 'మ్యూజింగ్స్' 'ప్రేమలేఖలు' అనే పేరిట నవ్యపంథా తొక్కారు.

శేషమ్మకి యీ లోకంలో ఏ మాత్రమూ ఆనందమూ సౌందర్యమూ కనపడడం మానేసి ముప్ఫై యేళ్ళయింది. ఇతరులు నవ్వుతున్నా, తింటున్నా, పాడుతున్నా, ఆమెకి విచారమో లేక అసహ్యమో కలుగుతుంది. పిట్టల కూతలూ, పిల్లల నవ్వులు కూడా ఆమెని 'ఇరిటేట్' చేస్తున్నాయి.

''పాడు పిట్టలు – పనిలేదు వీటికి. వెధవ అరుపులూ, గోలలూ అంతకన్న చస్తేనేం?''

ఆమెకి ప్రపంచం దుఃఖమయం, పాపభూయిష్ఠం, అప విత్రం. దీన్నంతా విడిచిపోవాలని, మృత్యువుని తలచుకుని అందరూ వినేట్టుగా ఆహ్వానిస్తోవుంటుంది. "ఆ యీశ్వరుడు యెప్పుడుదయతలుస్తాడో, యెప్పుడు పిలిపించుకుంటాడో, యీ నరకంలోంచి నన్ను!"

ఆ యీశ్వరుడు తన తండ్రిలాగూ, తనని భూలోక మనే అత్తవారింటికి పంపినట్టూ మాట్టాడుతుంది. నాలు గేళ్ళ క్రిందట కలరా తగిలినప్పుడు మాత్రం—

"ఒరే చస్తానురా, చస్తానురా. డాక్టరేమన్నాడూ? ఆస్పత్రి పెద్ద డాక్టర్ని పిలుచుకురా. ఆ పెరుగు తోడుకుందో లేదోచూచావులే. మా అమ్మ ఎనభై యేళ్లు బతికిందిరా. ఇంత చిన్నదాన్ని నాకప్పుడే గేం చావు? అవునులే. ఈ ముసలిముండ చస్తే ఎవరికేం? అందరికీ పీడ విరగడైపో తుంది" అంది మళ్ళీ.

ఆమె మొహాన నవ్వు చూసిన వాళ్లెవ్వరూ లేరు. చిన్న పిల్లలు గంతులేస్తోవుంటే, "ఈ గంతులెన్నాళ్ళు, మీ కాళ్ళు విరగా! ఇదేం పోయేకాలంరా, సరిగా కూచుని యేడవలేరూ?" అన్నట్లు చూస్తుంది. ఎంత విచారంగా కన పడితే యీ లోకంమీద, యీ మాయ మీద ఎంత అసహ్యం కనపరిస్తే, ఎంత సౌందర్యాన్ని ద్వేషిస్తే యీశ్వరుడికి అంత సన్నిహితురాలూ, ప్రియుతమురాలూ ఐవుంటుంది. ఈ లోకంలో తనవంటి సన్మార్గులకు కష్టాలు తప్ప యింకేమీ లేవు కనక సుఖపడే వాళ్ళంతా దుర్మార్గులే ఐవుండాలి.

తను కష్టాలకోసం ఎంత ప్రయత్నించి ఏరుకుంటుందో ఆమెకి తెలీదు.

"అదేమిటీ ఆ కామాక్షి అట్లా పాడుతో వుంటుంది ఎప్పుడూ! దేన్నీ చూసుకునీ! మొగుడి వుద్యోగం వూడిన ప్పుడు తెలుస్తుంది, అమ్మగారి అదిరిపాటు!"

ఆమెని "ఎట్లా వున్నారమ్మా!" అని అడిగితే ఎప్పుడూ "బాగానే వున్నా" నని అనలేదు.

అసలు యీ దేశంలో ఆమాట అనేవాళ్ళే తక్కువ. నిజంగా బాగా వుండేవాళ్లే తక్కువ. బాగా వున్నా కూడా, బాగా వున్నామని తెలుసుకున్న వాళ్ళు చాలా తక్కువ. తెలుసుకున్నా, 'బాగా వున్నా' మని అంటే దిష్టితగిలి, అదృష్టం మారుతుందని ఆమాట అనరు. అంతేకాక బాగా వుండడం దోషమనీ, పాపాత్ములు మాత్రమే బాగా వుంటా రనీ, మూర్ఖులు మాత్రమే బాగా వున్నామనుకుంటారనీ నమ్మకం.

"ఏం బావుండడ మమ్మా! కుర్రాడికి నిన్నటినించి జలుబుకదా! ఇంతవరకు కన్ను తెరిచి ఎరగడు. ఆవు పాలివ్వ డం మానేసింది. మొన్ననేగా మాతాతగారి సవితితల్లి మేన మామ పోయినాడు. వాడి మనమడు మూడో క్లాసు తప్పిపో యినాడా! రాచ్చిప్ప చిల్లిపడ్డది. నిక్షేపమంటి రాచ్చిప్ప! ఇట్లావుంది మాగతి. ఏమోనమ్మా, యీ కాలంలో అంతా మాయ. మాయ రాచ్చిప్పలూ, మాయ మనుషులూ! అవు నులే అమ్మా, ఏంశాశ్వతం? ఈ దేహమూ అంతేకద, వూరికే పట్టుకు పాకులాడుతారు గాని."

ఈ వాక్యాలే ఏ దేశాభిమాని ఐనా విన్నాడా, అక్కడే మూడు పల్టీలుకొట్టి, "హా భారతమాతా! ధన్యురాలివి. ఇల్లాంటి ఆధ్యాత్మికులైన ముసలమ్మల్ని కన్నావు," అని అరిచి ఆనందంలో మూర్ఛపోతాడు.

"దుగ్గిరాలవారింట్లో పెళ్ళయిందా? వాళ్ళకేం? పెళ్లిళ్లూ చేస్తారు. వొడుగులూ చేస్తారు, వాళ్ళ ముత్తాత మాటలు సంపాయించి పడేసిపోయినాడుగా! ఒక సీతా, న్యాయమా? ఏముంది, పరాయివాళ్ళని దోచుకునేదీ, పెళ్ళిళ్ళు చేసేది!" డబ్బువుందంటే అన్యాయార్జితమనే ఆమె వుద్దేశం.

ఎవరన్నా – "అదీ, ఆ రత్తమ్మ! మొన్నరాత్రి పారిపోయిందటమ్మా!" అంటే, – శేషమ్మ "ఛీ, ఛీ. అట్లాంటి మాటలు నా చెవిని పడనీకు. నాకెందుకు? నా రామనామమేమో నేనేమో! ఎవడితో?"

"అక్క యింటికి."

"ఇంతేనా? పారిపోయిందంటా వేం?"

"ఏమో వాళ్ళంటే నేనన్నాను."

కొంచెం ఆగుతుంది శేషమ్మ, యింకాయేమన్నా చెపుతారేమోనని. చెప్పకపోతే –

"నాకెందుకమ్మా! కాని అక్కయింటికి యెవరు తీసికెళ్ళారు? ఎవడో మొగాడు వుంటాడు. బాగా చూడమను. వాతలు పెడితే యిద్దర్ని పట్టుకుని – నాకెందుకులే. వొద్దన్నా నాకెందుకు చెపుతావు! అక్క యింటికెళ్ళిందో, ఆ అక్క సంగతి తెలుసుగా! దాని షోకులూ, రవ్వల దుద్దులూ _ నాకెందుకమ్మా! బండెడు చాకిరితో చస్తున్నాను."

"మీ కోడలు పని చెయ్యదా?"

"అయ్యో, దాని చేతులు పువ్వులు, దాని కాళ్లు తామ రాకులు."

"మీ కూతురో?"

"మా కూతురికి గంపెడు రోగమమ్మా! అదేం చేస్తుంది, దాని మొహం!"

"అట్లానమ్మా! బాగానే తిరుగుతో వుంటుందే!"

"మీ కంటికి అట్లానే కనపడుతుంది. పై పుష్టేగాని, లోపలంతా గుల్ల. ఒకటే ఆయాసం."

"మరి యెప్పుడూ అల్లా చిరుతిళ్లు తింటే –"

"అయ్యో, ఏం తింటుంది? అన్నం అసలే తినదు. చిరుతిళ్ళు కూడా లేకపోతే ఎట్లా?"

"మా కూతురమ్మా, మాసుబ్బులక్ష్మి దానికి ఒక్క రోజు జబ్బు చెయ్యదు కద!"

"చెయ్యకేమమ్మా! అట్లా తిరిగేవాళ్ళు గబాలున పడతారు. మా మామ మనవుడు అంతే. పిడిరాయిలాగు-"

శేషమ్మ ప్రపంచం పనీ, ఆచారమూ. తెల్లవారికట్ట నాలిగింటికి లేచి, రాత్రి పదకొండింటి వరకు (మధ్యాహ్నం రెండు గంటలు విశ్రాంతితో) పని చేయడం. ముప్ఫై యేళ్ళ నించి, ప్రతిదినమూ ఆ విధంగా పని చేస్తోంది. ఆమె పని చేసి నంతసేపూ, ఆమె నోరూ పని చేస్తో వుంటుంది – మాటలతో తిట్లతో. తెల్లారకట్టే రాత్రి అల్లరి చేసిన పిల్లుల్ని, యెలికల్ని తిట్లు; తరవాత పదింటిదాకా దాసీదాన్ని తిట్లు; అల్లరి చేసే పిల్లల్ని, కాకుల్ని తిట్లు; కానీకి వీశెడు బీరకాయ లివ్వని

కూరలదాన్ని, మజ్జిగదాన్ని తిట్లు. ముఫ్ఫై యేళ్ళలోనూ ఒక రోజుకూడా చిక్కని మజ్జిగ కూడా పొయ్యలేదు కదా, ఒక గొల్లది కూడా; పుచ్చిపోని కూర లివ్వలేదుకదా ఒక కూరలవాడు కూడా! మధ్యాన్నించి యిరుగు పొరుగు వాళ్ళనీ, కోడల్నీ, కొడుకు అనాచారాన్నీ, కృతఘ్నతని, దేవుణ్నీ, పిచికల్నీ, తోవపొయ్యే వాళ్ళని తిడుతుంది. ఎవరూ లేక పోతే రాత్రి పదింటికి తనని తాను తిట్టుకోడం ప్రారంభి స్తుంది. పని చెయ్యలేకుండా వుండలేదు. అదే ఆమె మతం. ఆమె శరీరమే పనిచేసే మర అయిపోయింది. ఆమె 'ఇన్ టె లిజెన్సు' ఎప్పుడో మానింది, 'రొటీన్' తప్ప యింకేమీ ఆమె చాతకాదు. ఒక్కరవ్వ ప్రోగ్రామ్ మారిందా, యిల్లు పడుకుంటుంది. అంట్ల శుభ్రం. యిల్లు కడగడం, పేడచల్లడం. మెతుకులూ, యెంగిలీ, మైల మైల అని అరవడం - యిదే బతుకు! ఒక కొత్తపనీ ఒక కొత్త యోచనా! రెండూ ఆమెచాత కావు. గానుక్కి కట్టిన ఎద్దునయం. అందువల్ల నే మార్పు అంటే గుండెలు పగిలి చస్తారు. బెత్తంలేకుండా పాఠం చెప్పమంటే ముసలి స్కూలు మాస్టరుకి యెట్లా వుంటుందో, యింగువ లేకుండావంటచేయమంటేఆమెకట్లావుంటుంది. టేపులేకుండా పని చెయ్యమంటే గుమాస్తాకి యెట్లా వుంటుందో, మడి కట్టుకోకుండా వండమంటే ఆమెకట్లా వుంటుంది. ప్రపంచం ముక్కలైనా ఆమెకి అంత ఆశ్చర్యం కలగదు. ఇంతపని యిన్నేళ్ళు చేసిందా, యెవరికా వుపయోగమంటే, యేమీ కనపడదు. అందరూ ఆమెని చూచి విసుక్కునే వాళ్ళేగాని కృతజ్ఞత కనపరిచేవాళ్లు లేరు. నలుగురికి భోజనం పెడు

తోంది, తాను తింటోంది. ఇంటిని మురికి చేస్తుంది. ఎందుకు? కడగడానికి. కడగడమెందుకు? మళ్ళీ మురికి చెయ్యడానికి. అంతకాలం వంటచేస్తే మూడువందల మందికి భోజనం పెట్ట వచ్చు'వొకమనిషి. స్వర్గంలో అంట్లు తోమడమూ, బట్టలార వెయ్యడమూ, లేకపోతే ఏంచేస్తుందో యీ మనిషి?

పాపం, ఏకొత్తకాంతినీ, ఆశనీ, ఆనందాన్నీ, కోర్కెనీ, అన్నిటినీ త్యజించి, ఆవంటిల్లే తన ప్రపంచంగా, తన బాధే ఆనందంగా, తన చేతికిచిక్కిన అయిదారుగురూ దాసీతో సహా, తన నోటి తీటను తృప్తి పరచగల సాధనాలుగా, తన ఆచారాన్నీ, తులసికోటనీ చూసుకుని గర్వపడి బతుకు తోంది. భూకంపాలు రానీ, దేశాలు సామ్రాజ్యాలు పడి పోనీ తగలపడనీ, ఆమెకేమీ సంబంధంలేదు - తన యింటికి వందగజాలు దాటి ఆమె మనసు పనిచెయ్యదు.

కాపరము, పిల్లలు, ప్రేమ, ఏమీలేక, తనది, స్వం తంగా తనది అనే ఆస్తిగాని, మనిషిగాని లేక, క్రమంగా క్రమంగా మనసు మోడైపోయి నిలిచింది ఆమె. ఇంకే ఆసక్తిలేక, ఆపాత పురాణాలలో విన్న అక్కడక్కడి వచ నాలని పట్టుకుని, వాటి వాస్తవత్వం పైన తన ఆత్మపురోభి వృద్ధిని ఆధారం చేసుకొని, కన్నంలో ఎలికవలె బతుకు తోంది. ఎవరికైనా ప్రేమించడం కన్న ద్వేషించడం సులభం. ప్రేమ మనిషిని తన స్వంతంగా చేసుకోవాలని ప్రయ త్నిస్తుంది. ఈపేద వితంతువు స్వంతం కావడానికి ఎవరంగీక రిస్తారు? తన కోడలికి ఒక్కొక్క బిడ్డే పుడుతోవుంటే తన స్వంతం చేసుకోవాలని చూసింది. ఆ తల్లి ప్రతినిమిషమూ

జ్ఞాపకంచేసేది ఆపిల్ల తనదని—చూపుచాతా, నడవడిచాతా. ఆపిల్లలే మూడేళ్లు రాగానే అందరికన్న లోకువ గనక కర్రలు తీసుకుని బాదేవారు ఆమెను. ప్రేమలేక, సంతోషంలేక, జీవితంలో యింటరెస్టు లేక, తను ఏబాధపడ్డా కరుణించేవారు లేక, ఇంక విధిలేక యీ బండచాకిరిలో తన శక్తినీ, ద్వేషంలో తన ప్రేమనీ, తిట్లలో తన ఆనందాన్ని, సార్థకం చేసుకోవాలని ప్రయత్నిస్తుంది. ఇట్లా ఎందరు ఎందరు యీ దేశంలో యిల్లా కొయ్యబారిన ఆత్మలతో తమ జీవితాన్ని యితరుల జీవితాన్ని క్షోభపెట్టి చివరికి మృత్యువులో తప్పించుకునే స్త్రీలు! కాని మృత్యువులోనైనా తప్పించుకుంటూరా? వాళ్ళజన్మలో వుందా యీలోపం, వాళ్ళ నిట్లా చేసిన సంఘ పరిస్థితులలో వుందా? వాళ్లు సంఘాన్నిట్లా ఎండపెడుతున్నారా, సంఘం వాళ్ళని కొయ్యల్నిచేసోందా?

## త్రిపురనేని గోపీచంద్

# ధర్మవడ్డీ

నేటి కథకులలో గోపీచంద్‌గారికి ఒక విశిష్టమైన సానం ఉంది. కథని అల్లడంలో మంచి చాకచక్యం కనపరుస్తూ, పల్లెటూరి జీవితాలని చక్కగా చూపిస్తారు. 'అసమర్థుని జీవయాత్ర' ఒక కొత్తరకం నవల. సాంఘిక పరిస్థితులమీద కథలు రాసినవారు చాలామంది వున్నారు కాని, గోపీచంద్‌గారిలా రాజకీయ ప్రభావం మీద కథలు అల్లినవారు బహుకొద్ది.

నేనా వూరు ఎందుకు వెళ్ళానో, నాకిప్పుడు జ్ఞాపకం లేదు. కాని వెళ్ళటం, చిన్నప్పటి స్నేహితుడు కనపట్టం, తన ఇంటికి నన్ను తీసుకువెళ్ళటం జరిగింది. కలవక కలవక కలుసుకోవటంవల్ల, చిన్నప్పటి విషయాలు తలుచుకొని నవ్వుకుంటూవున్న సమయంలో అతడొచ్చాడు. రావటం రావటం ఎలా వచ్చాడని?

ముందు వాకిలి నెమ్మదిగా తెరిచాడు. కుడికాలు గడపలో పెట్టి అటూ ఇటూ దొంగచూపులు చూశాడు. చంకలోవున్న మూటని పదిలంగా రెండోచేత్తో పట్టుకుని, తల ఓరగా పెట్టి అడుగులో అడుగు వేసుకుంటూ, నా స్నేహితునిదగ్గరకువొచ్చి చంకలో మూట అందిస్తూ, "ఇదిగోనోయ్, డబ్బు" అన్నాడు.

అసలు అతన్ని చూడగానే నాస్నేహితునికి కళవళికలు మారిపోయినై. అంతకు ముందున్న సంతోషం మాయమై పోయింది. నెమ్మదిగా మూట అందుకుంటూ "మనిషంటే మనిషివి నువ్వే సూరయ్యా, నికార్సయిన మనిషివి" అన్నాడు.

ఈ మాటకు సూరయ్య సంతోషం పైకి కనపడనివ్వకుండా, "మాటలకేంలే! డబ్బు తీసుకోగానే కాదు. నెల రోజుల్లో అసలు ఫాయిదాలు ఇచ్చి వెయ్యాలి. వడ్డీ నీకు తెలిసిందేగా - ధర్మవడ్డీ - నెలకు నూటికి రూపాయిన్నర. అదైనా నువ్వని ఇస్తున్నాను" అన్నాడు.

"అలాగే సూరయ్యా, నెల దాటకముందే ఇస్తాను," అన్నాడు నా స్నేహితుడు.

"ఇస్తానంటేకాదు. మాట చెల్లించుకోవాలి. శుభ కార్యం ఒకటి తలపెట్టానా, మంచికీ చెడ్డకీ డబ్బు కావాల్సి వొస్తుంటుంది. తర్వాత కోర్టు గీర్టూ అంటే......"

"అదేమిటి సూరయ్యా, నీ దగ్గర ఎన్నిసార్లు డబ్బు తీసుకోలేదు, ఎన్నిసార్లు ఇవ్వలేదు - ఎప్పుడైనా మాట తప్పీసిలు వొచ్చిందా?"

"సరేలే. డబ్బు లెక్కపెట్టుకో. అన్నీ రూపాయలే. కొద్దిగా మాత్రం చిల్లర వుంది. మళ్లీ నాకు రూపాయలే ఇవ్వాలిసుమా! నోట్లూ గీట్లూ అంటే కుదరదు."

"నువ్వు చెప్పాలా, సూరయ్యా" అంటూ నా స్నేహితుడు మూట విప్పాడు. చూసేటప్పటికి నా తల తిరిగి పోయింది. అయోమయం అయిపోయింది. ఆ మూటలో వున్నవన్నీ రాళ్ళే! చిన్న చిన్న రాళ్ళూ, పెద్ద పెద్ద రాళ్ళూ-పెద్దవన్నీ కంకర రాళ్ళూ, చిన్నవన్నీ గులకరాళ్ళూ! నమ్మలేక నాస్నేహితుని మొహం పరీక్షగా చూశాను. అతను మాత్రం ఇదంతా లెక్కచెయ్యకుండా, అతి జాగ్రత్తగా ఆ రాళ్ళని తీసి ఒక్కొక్కటే లెక్కపెడుతూ కూర్చున్నాడు.

నా కేమీ తోచక సూరయ్యవంక చూశాను. అత నింకా తల ఓరగానేపెట్టి లెక్కపెట్టబడుతూవున్న రాళ్ళను రెప్పవెయ్యకుండా పరీక్షిస్తున్నాడు. ఇంతలో నాస్నేహితుడు లెక్క పూర్తిచేసి, "సరిపోయినయ్యి, సూరయ్యా" అన్నాడు.

"ఇవ్వాళ సరిపోయినై అంటే కాదోయి. ఇవ్వాళ ఇరవై. మళ్ళీ ఇరవై సోమవారంనాటికి నాడబ్బంతా దమ్మిడీల్తో ఇచ్చెయ్యాలి," అని జ్ఞాపకంచేసి నా స్నేహితుడితో మూడుసార్లు 'ఇస్తాను' అనిపించుకొని వెళ్ళిపోయాడు సూరయ్య.

అతడు ఎప్పుడు వెళ్తాడా, ఈ తంతేమిటో ఎప్పుడు తెలుసుకుందామా అని కూర్చున్న నేను అడుగుదామని నా

స్నేహితునివైపుకి తిరిగేటప్పటికి, అతడు చేత్తో నన్ను వారించి వాకిలివైపుకి చూపాడు. నేను అటు చూట్టం, సూరయ్య గభాలున తలుపునెట్టుకొని లోపలకు రావటం ఒకేసారి జరిగింది. మనిషి ఇదివరకుమల్లే లేడు. ఆపాద మస్తకం వొణికిపోతున్నాడు. కళ్ళు యెర్రగా జ్యోతుల్లా వున్నై. గాలి తెగ పీలుస్తున్నాడు. తల మాత్రం ఓరగానే వుంది.

ఒక్కక్షణం వాకిట్లో ఆగి రంయిన నా స్నేహితుడి మీదకు వచ్చి ఇలా కేకలు వేశాడు - "ఏదీ నా డబ్బు? ఎన్నాళ్ళయింది? ఇదిగో అదిగో అంటూ కుక్కని తిప్పుకు న్నట్టు నీ యింటిచుట్టూ తిప్పుకుంటావా? పరువూ మర్యాదా ఉండక్కర్లా? కడుపుకి అన్నంతింటున్నావా, గడ్డితింటు న్నావా?"

నిజంచెప్పొద్దూ ఈ మాటలు వినేటప్పటికి నాకు కంపరం ఎత్తింది; కోపం వచ్చింది. కాని ఏమిచెయ్యటం? గుడ్లు వప్పచెప్పి చూస్తూ కూర్చున్నాను.

నా స్నేహితుడు భయంగా, అతి వినయంగా, "ఇదిగో సూరయ్యా, నీ డబ్బు! నాలుగు రోజులు ఆలస్య మైనంత మాత్రాన నీబోటి పెద్దమనిషి ఇట్లా నోరు పారేసు కోవటం ఏం మర్యాద?" అని తన దగ్గరేవున్న ఆ రాళ్ళ మూటని ఇచ్చాడు.

"మరి వడ్డీయో? డబ్బు నాకు చేదై ఇచ్చాననుకున్నావా? నీ తాతకి అచ్చుండి ఇచ్చాననుకున్నావా?

పూర్తి పరిష్కారం చేసి కదులు,'' అని బొడ్లో చెయ్యిని నిలవేశాడు సూరయ్య.

''ఇస్తాను సూరయ్యా, మరి వొదులు!'' అన్నాడు నా స్నేహితుడు.

''తీసుకురా'' అని ఒక్క తోపు తోశాడు సూరయ్య.

నా స్నేహితుడు పడబోయి నిభాయించుకొని గోడ పక్కకు వెళ్ళి, పదిరాళ్ళు ఏరి తెచ్చి సూరయ్య చేతులో పెట్టాడు. సూరయ్య వాటిని లెక్కపెట్టుకొని, నాస్నేహితునితో ఒక్క మాటైనా అనకుండా గిరుక్కున వాకిలి వైపుకు తిరిగి తల ఓరగానే వుంచుకొని గబగబా నడిచి వెళ్ళిపోయాడు.

నా స్నేహితుడు ఒక్క నిట్టూర్పువిడిచి నేను అడగవలసిన అవసరం లేకుండా తానే ఇలా చెప్పాడు - ''పాపం ఏం చెప్పను? ఒకప్పుడు ఈవూళ్ళోకల్లా షావుకారు ఈ సూరయ్య. ఇప్పుడు పిచ్చెక్కి ఈవిధంగా తయారయ్యాడు'' అన్నాడు.

''ఇతనికి పిచ్చా! ఎందుకెత్తింది? పిచ్చిలో ఇదేమిటి?'' అని అడిగాను.

నా స్నేహితుడు సూరయ్యకథ ఈవిధంగా చెప్పాడు.

''సూరయ్య ఈగతికి రావటానికి అతని తండ్రే కారణం. అతని తండ్రి చాలా మంచివాడు, మెత్తని హృదయం కలవాడు. అటువంటి అతడే, కొడుకు పతనానికి కారకుడయ్యాడు.''

''అంత మంచివాడు......''

"చెప్తాను విను. అంత మంచివాడు అవటం వల్లే దానాలు చేసీ, అడ్డాలు వుండీ తన ఆస్తంతా పాడుచేశాడు. ఆస్తి పోయిం తర్వాత పలకరించే దిక్కు లేకుండా చచ్చి పోయాడు. ఇది కన్నులారా చూచిన సూరయ్యకు సంఘం మీద కసి ఏర్పట్టంలో ఆశ్చర్యం లేదు. అందుకని పూర్తిగా తనస్వభావాన్నే మార్చుకొని, పెత్తనానికి వొచ్చి నప్పటినుంచీ కఠోరంగా సంపాదించటం మొదలు పెట్టాడు. మనుష్యుల్లోవున్న యితరత్రా సంబంధాలన్నీ క్రూరంగా తెగ్గొట్టుకున్నాడు. తనకీ మిగిలిన మనుష్యులకీ ఒక్కటే సంబంధం – వడ్డీ వ్యాపారం. తాను వడ్డీ డబ్బు ఇవ్వటానికి పుట్టాడు. మిగిలిన జనం డబ్బు పుచ్చుకొని వడ్డీ ఇచ్చుకో టానికి పుట్టింది.

ఇట్లా తయారై, మిగిలిన రైతుల్ని పీల్చి పిప్పిచేసి కొద్ది సంవత్సరాల్లోనే వూళ్ళోకల్లా షాహుకారై కూర్చు న్నాడు. ఎంత షాహుకారైనా డబ్బు సంపాదించటం అలవాటైంతర్వాత పద్ధతులు ఎలా మారతై – కనక డబ్బు అవసరం లేనప్పటికీ కూడా పాతపద్ధతులమీదే నడిచాడు. పిల్లికి బిచ్చం పెట్టేవాడు కాదు. అడిలి గీపెట్టినా దమ్మిడీ జారనిచ్చేవాడుకాదు. బాకీదార్లని ఎన్ని కష్టాలు పెట్టాలో అన్నీ పెట్టి ఇన్ని నీళ్ళుకూడా పుట్టకుండా చేసి, తన డబ్బు పిండుకునేవాడు. ఈ పిండుకోవటంలో కూడా దయా దాక్షిణ్యాల్లేవు. కొంపలుకూలినా, కుటుంబాలు నాశన మైనా అతని హృదయం కరిగేది కాదు.

అందుకని అతని డబ్బుతోపాటు, అతనిమీద వూళ్ళో

అసూయా అసహ్యంకూడా పెరుగుతూ వచ్చినై. అతన్ని చూస్తే భయమే తప్ప ఇష్టం ఒక్క వ్యక్తికూడా లేకుండా పోయింది. సూరయ్య ఇదికూడా మంచిదే అనుకున్నాడు. నాక్కావలసింది డబ్బు – వీళ్ళ ఇష్టం ఎవరిక్కావాలి? అంటూవుండేవాడు. పరిస్థితులు ఇట్లా వుండగా ఒక సంఘటన జరిగింది.

ఈ వూళ్ళోనే అవతలి వీధిలో చంద్రయ్య అనే రైతు వున్నాడు. చంద్రయ్య ఈ సూరయ్యకి రెండు వందల రూపాయల బాకీ ఇవ్వాలేడు. చంద్రయ్య అవటం చిన్నరైతే ఐనా, ఊళ్ళో సంబంధం వున్న వాడవటంవల్ల, డబ్బున్నా లేకున్నా లెక్క లేకుండా వుండేవాడు. డబ్బున్న వాళ్ళంటే అసహ్యం వుంది, భయంలేదు. తనకు అవసరానికి డబ్బిచ్చాడనే విశ్వాసం లేకపోగా తన దగ్గర సూరయ్య అన్యాయంగా డబ్బు దోచుకుంటున్నాడనే భావం, కోపం కలిగినవాడు. సూరయ్య హెచ్చువడ్డీ వస్తుందని అతనికి అప్పు పెట్టాడేగాని, పెట్టిందగ్గర్నుంచీ డబ్బు రాదేమో అనే భయంతో అతని ఇంటిచుట్టూతిరగటం మొదలు పెట్టాడు. ఒకరోజు చంద్రయ్యని నా డబ్బిచ్చి కదలమని నిలవేశాడు. నానా దుర్భాషలూ ఆడాడు; దాన్తో లోలోపల రగులుకుంటున్న అగ్ని చంద్రయ్యలో నుంచి గుప్పున బయటపడింది – "నేను దమ్మిడీ ఇవ్వను. నీ తాత్తో చెప్పుకో! ముందు గడపలో నుంచి అవతలకు వెళు" అని కేకలువేశాడు.

పాపం, సూరయ్యకు ఇట్లాంటి అనుభవం ఇదివర

కిప్పుడూకలగలేదేమో, చంద్రయ్య మాటలకు నిరు త్త రుడై ఒక్క నిమిషం మాట్లాడ లేకపోయాడు.

"వెళ్ళవ్!" అని గద్దించాడు చంద్రయ్య. "చం ద్రయ్యా, ఇది నీకు మంచిది కాదు; కోర్టుకులాగి పప్పు తీయి స్తాను," అన్నాడు సూరయ్య.

"పప్పు తీయిస్తావ్రా మాదచ్చోద్" అని నానా బూతులూ కూసి మెడమీద క్ర వేసి బయటకు గెంటాడు చంద్రయ్య.

ఇక చూడు సూరయ్య సంగతి. సూరయ్యకు శివం ఎత్తింది. పిచ్చి గంగిర్లెత్తినై. కనపడ్డవాడికల్లా చెప్పాడు. "ధర్మవడ్డీ - ధర్మవడ్డీ కూడా ఇవ్వడట! అసలే ఇవ్వడట! ఇదెక్కడన్నావుందా? రాములవారి కాలం నుంచీ ఈ వడ్డీ వుందిగదా!" అని మొత్తుకున్నాడు.

తిరిగి తిరిగి ఇంటికి వెళ్ళి గబగబా నాలుగు మెతుకులు నోట్లోవేసుకొని, అంగోస్త్రం నల్లంకి కట్టి, తెల్లగుడ్డ గొడుగు చంకన పెట్టి టౌన్‌కి బయల్దేరాడు. అప్పటికీ ఆశ చావక, చంద్రయ్యవాకిలి ముందు సకిలిస్తూ నాలుగైదుసార్లు అటూ ఇటూపచారుచేశాడు; బజార్న పోతున్న వార్ని నిర్నిమిత్తంగా పిలిచి, "కొంచెం కోర్టులో పనివుండి టౌన్‌కి వెళ్తున్నాను," అని ఇంట్లో వున్న చంద్రయ్యకు వినబడేటట్టు చెప్పాడు. చం ద్రయ్య, "కోర్టుకాదు, నిన్ను పుట్టించిన బ్రహ్మదేముడి దగ్గరకు వెళ్ళు. ఈ వూరు నీళ్ళు నీకు ప్రాప్తం లేదు" అని ఇంట్లో నుంచే కేకవేశాడు.

ఇంకేం చేస్తాడు? ఇక తప్పేదేముంది? చంద్రయ్య

మాటలకు మనస్సులో కొంచెం జంకినా డబ్బైలా వొదులుకో వటం? మనస్సుని తిట్టిలోబరచుకొని టౌన్‌కి వెళ్ళి ప్లీడరుతో మాట్లాడి చంద్రయ్యకు రిజిష్టరీ నోటీసు ఇప్పించాడు. నోటీ సైతే ఇప్పించాడే కాని మనస్సులో ఆరాటం హెచ్చింది. దిగులు దిగులుగావుండి ఏమీతోచక టౌనులో అటూ ఇటూ తారట్లాడి ఇంటికి బయల్దేరేటప్పటికి మసక పడ్డది. టౌన్ నుంచి మా వూర్రావాలంటే రోడ్డు దిగి డొంకలో మైలు నడవాలని నీకు తెలుసు. సూరయ్య డొంకదగ్గరకు వచ్చేటప్పటికి బాగా చీకటి పడ్డది. రోడ్డు దిగేటప్పటికి అతనికి భయం వేసింది. ఆ డొంక మా ఒక్క వూరికి వచ్చేదే అవటంవల్ల మనుష్య సంచారం తక్కువగా వుం టుంది. పైగా రెండుపక్కలా కొరివిదయ్యాలు తలలు విర బోసుకున్నట్లు కనబడే, గుబురుగా పెరిగిన చెట్లు. సూరయ్య ధైర్యంచేసి ఆంజనేయ దండకం పఠిస్తూ డొంకలో పది గజాలు నడిచాడు. ఆ పెద్దమర్రిచెట్టు చూశావుగా, అక్క డకు వొచ్చాడు. అకస్మాత్తుగా పక్కపొదల్లో అలికిడి విని పించి ఆగిపోయాడు. గొంతులోపాట గొంతులోనే ఆగి పోయింది. వెంటనే అతనికోసం పొదల్లో కనిపెట్టుకూచున్న చంద్రయ్యముఠా పదిమంది అతన్ని కమ్ముకున్నారు — మీదకు దూకారు. చావచితగ గొట్టారు. పాపం కింద పడేసి సున్నంమీద ఎముకల్లేకుండా కొట్టారు, చంద్రయ్య మీదపడి అతని జేబులోవున్న ఇరవై రూపాయలూ లాక్కొని, ''దావా దాఖలేశావుగా! కర్చెవ్వడు పెట్టు కుంటాడు నీ తాత?'' అని కాలికి వొచ్చినట్టు తన్ని, దిగి

లిన వాళ్ళని తీసుకొని, సూరయ్యని అక్కడే వొదలి వెళ్ళి పోయారు.

క్షణాలమీద ఈవార్త వూరంతా పాక్కింది. "సూరయ్యని కొట్టారంటే సూరయ్యని కొట్టా" రని వూరంతా ఆ గుబ్బుగా చెప్పుకుంది. కాని ఒక్కడు కూడా జాలి తలిచిన వాడే లేడు. 'పాపం' అన్న పాపాన పోయినవాడే లేడు.

సూరయ్య భార్యా, కూతురూ మాత్రం భోరున ఏడ్చారు. సూరయ్య భార్య దొడ్డఇల్లాలు. కూతురు కూడా చాలా మంచిది. కాని బయట జరిగే దురంతాలను వాళ్ళెలా ఆపగలరు? సూరయ్య మనస్సుని ఎలా తిప్పగలరు?

తెల్లకి తెల్లవారింతర్వాతవూళ్లో షాహుకార్లు సూరయ్యని పరామర్శించటానికి వొచ్చారు. సూరయ్యకు ఆ రాత్రంతా నిద్ర లేదు. ఏదో ఆలోచించుకుంటూ కూర్చున్నాడు. భార్యా కూతురూ నోటికి మాత లేకుండా ఏడుస్తున్నా, వాళ్ళ వంక కే చూట్టం లేదు. అన్ని దెబ్బలు తిన్నా ఒక్క మూలుగన్నా మూలగటం లేదు.

షాహుకార్లు వొచ్చి, "సూరయ్యా, ఇక చూస్తూ వూరుకుంటే లాభం లేదు. క్రిమినల్ కేసు బనాయించి వాళ అంతు కనుక్కోవలసిందే!" అన్నారు.

సూరయ్య ఏమీ మాట్లాడలేదు. ఏదో ఆలోచించు కుంటూ పడుకున్నాడు. అతనిమౌనాన్ని షాహుకార్లు అపార్థం చేసుకొని, "కాదు సూరయ్యా, మనం తప్పక గెలుస్తాం. అనుమానం లేదు..." అన్నారు.

సూరయ్య కొంచెం కదిలి, వాళ్ళని నింపాదిగాచూచి,

"ఇంకేం? అందరం చందాలు వేసుకొని వ్యాజ్యమాడదాం" అన్నాడు.

'చందాలు' అనేప్పటికి షాహుకార్లు మొహా మొహాలు చూసుకున్నారు. "అదేమిటి సూరయ్యా నిన్ను కొట్టట మేమిటి? మేం చందాలు వేసుకోవట మేమిటి?" అన్నారు.

ఈ మాటలకు సూరయ్యకు కోపం వొచ్చింది. అంత బాధలోనూ లేచికూర్చొని, "వాళ్లు నన్ను కొట్టారా? నా దగ్గరవున్న డబ్బుని కొట్టారు. అంటే ఈవూళ్ళోవున్న షాహుకార్లందర్నీ కొట్టారు. వడ్డీకోసం అప్పుపెట్టే ప్రతివాడ్నీ కొట్టారు. నన్ను కొట్టటమైతే ఒక్క చంద్రయ్యే కొట్టేవాడు. మిగిలిన వాళ్ళంతా ఎందుకు కుమ్మక్కు చేస్తారు? వాళ్ళు కొట్టకలరు కనక అంతా కలిసి కొట్టారు. మనం చందాలు వేసుకోగలం గనక అంతా కలిసి చందాలు వేసుకుందాం" అన్నాడు.

షాహుకార్లకు ఇదేమీ అర్థంకాలేదు. దెబ్బల్తో సూరయ్య మతి చెడ్డది అనుకున్నారు. నెమ్మదిగా ఒకరి తర్వాత ఒకరు జారుకున్నారు.

ఎంతమంది చెప్పినా ఎంత చెప్పినా సూరయ్య వినలేదు – కేసు పెట్టనంటే పెట్టనన్నాడు. "నా సొంతడబ్బు తగలేసుకొని, ఈడబ్బున్న వాళ్ళకోసం వ్యాజ్యం ఆడి పెట్టనా? నే చెయ్యను" అనేవాడు.

కాని చంద్రయ్య ఏ ముహూర్తాన చెయ్యిచేసుకున్నాడో గాని, అప్పటినుంచీ సూరయ్య దశతిరిగి పోయింది. దెబ్బలుతిని కేసు పెట్టక పోయేటప్పటికి వూళ్ళోవాళ్ళకి లొల్లి

అయిపోయాడు. తాము ఏ డబ్బుని చూచి భయపడుతు న్నారో ఆ డబ్బు సమయానికి సూరయ్యని ఆదుకోలేక పోయే టప్పటికి ఇంకేముంది? పెద్దలు మొదలు కుర్రాళ్ళవరకూ సూర య్యని ఆటలు పట్టించడం మొదలు పెట్టారు. ఇల్లు కదిలితే చాలు - "సూరయ్య వడ్డీ చంద్రయ్య లాఠీ" అని చప్పట్లు కొట్టుకుంటూ వెంటపడేవారు. రావలసిన డబ్బు అడిగితే బాకీ దార్లు "ఏం తన్నులు కావాలా?" అనేవారు. కొందరు 'ఇదిగో అసలు, ఇదిగో వడ్డీ' అని మొట్టికాయలు వేసేవారు కూడాను.

చివరకు సూరయ్యకు చిల్లిగవ్వకూడా వసూలు కాకుండా పోయింది. ఎట్లా వచ్చిన డబ్బు అట్లాగేపోయింది. ఎక్కడ పెట్టిన డబ్బు అక్కడే యింకిపోయింది. తనకు తద నంతరమైనా వస్తుందనుకున్న ఆస్తి రాకుండా పోయిందని అల్లుడు, కూతుర్ని ఇంట్లో నుంచి వెళ్ళగొట్టాడు.

సూరయ్య భార్యా మొహం, కూతురు మొహం చూడ లేక వీలైనంత వరకు ఇంట్లో వుండకుండా తిరుగుతూ కాలం గడిపేవాడు. నాలుగు మెతుకులు నోట్లో వేసుకొచ్చి చెరువు గట్టు మీద రావిచెట్టుక్రింద ఒంటరిగా కూర్చునేవాడు. ఇన్ని రాళ్లు ఏరుకొని ఒక్కొక్కటీ చెర్లోవేస్తూ, అవినీళ్ళల్లోపుట్టించే కదలికను పరీక్షిస్తూ, కూర్చునేవాడు

కాని వూళ్ళో జనం అక్కడ అతన్ని సుఖంగా వుండ నివ్వలేదు. అతడు నిస్సహాయుడౌతున్న కొద్దీ జనం తన బలాన్ని ఎక్కువగా ఉపయోగించటం మొదలుపెట్టింది. జనా

నికి అతని మీద కలిగిన కసీ, అలుసూ అతన్తోనే ఆక్క అతని కుటుంబం మీదకు తిరిగింది.

ఒకరోజు సూరయ్యకూతురు వాముల దొడ్లో గేదెకు మేత వేస్తుంటే నలుగురు పట్టుకొని గాతంలో పడేసి బలాత్కారంగా చెరిచారు. వాళ్లు విడిచిపెట్టి వెళ్ళింతర్వాత ఆ పిల్ల లేచి, నడవలేక కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళి, భావిలోపడి ఆత్మహత్య చేసుకుంది. ఈ సంగతి తెలిసి సూరయ్య భార్య అవమానాలు సహించలేక కిరసనాయిలు పోసుకొని కాల్చుకొని మరణించింది. అదే సమయంలో విరోధులు సూరయ్య ఇవ్వవలసిన బాకీలు తమ పేర ట్రాన్స్ఫర్ చేయించుకొని ఇల్లు వేలం వేయించారు..."

ఇంతవరకు ఓపికతో విని, ఇక ఆపుకోలేక నేను ఈ ప్రశ్న వేశాను - "ఈ ఘోర కృత్యాల్ని జరక్కుండా ఎవ్వరూ ఆప లేదూ?"

"తప్పన్నవాళ్ళే లేరు. చేసుకున్నది అనుభవిస్తున్నాడని కొందరూ, ఈవ్యవ్రదేశంలో అడ్డు చెపితే తమ కుటుంబాలు సరిగ్గా ఉండవేమో అనే భయంతో కొందరూ - మొత్తానికి అంతా మెదలకుండా వూరుకున్నారు."

"ఊఁ! తరవాత ఏం జరిగింది?" అని అడిగాను.

"ఇకేముంది? డబ్బుదారిన డబ్బు నడిచింది. కూతురు అలా అయి పోయింది. భార్య ఇలా అయి పోయింది. సూరయ్యగుండెలు పగిలిపోయినై. ఆవులాగా అడలుతూ, వూరుపట్టుక తిరిగేవాడు. కొన్నాళ్ళకు పిచ్చెత్తింది. ఇప్పు డెవరన్నా జాలి తలిచి ఇన్ని మెతుకులు పెడితే తింటాడు.

ఆ చెఱువు గట్టుమీది రావిచెట్టు కిందేవుంటాడు. ఎండలో అక్కడేవుంటాడు. ఎప్పుడూ కూతురు సంగతిగానీ, భార్యా సంగతిగానీ ఎత్తడు. ఎవర్నీ పలకరించడు. రోజు కొక్క సారి వెళ్ళి తన పాత ఇంటిని దూరాన్నుంచి చూచుకొని కన్నీరు పెట్టుకుంటూవుంటాడనీ, రాత్రిళ్ళు తన కూతురు పడి ఆత్మహత్య చేసుకున్న బావి దగ్గరకువెళ్ళి ప్రదక్షిణం చేసి వస్తూవుంటాడనీ వూళ్ళో చెప్పుకుంటూ వుంటారు... ఇదీ సమాచారం..."

నేను కథంతా ప్రాణాలు బిగపట్టుకొని విన్నాను. సూరయ్య కథ చెప్పనున్నప్పుడు ఇటువంటి విషాదగాథ వింటానికి సిద్ధపడలేదు గనక చాలా ఖేదపడ్డాను. "మరి ఈ రాళ్ళ వ్యవహారమేమిటి?" అని అడిగాను.

"అలవాటు" అన్నాడు నాస్నేహితుడు. "పాత అలవాటుని పట్టి ఇలా చేస్తూవుంటాడు. మేం కూడా జాలి పడి అతని మనస్సుని ఈఅవస్థలో కష్టపెట్టడం ఎందుకని తగువిధంగా ప్రవర్తిస్తూ వుంటాం. ఈ సూరయ్య..."

నా స్నేహితుడు చెబుతూవుండగానే వీధిలో పెద్ద గోల బయల్దేరింది - "సూరయ్య వడ్డీ, చంద్రయ్య లాఠీ," అని కేకలు, బయట నుంచే సూరయ్య 'బే' అని అడిలాడు. ఆ ధ్వని విని మే మిద్దరం బయటకు పరుగెత్తాం.

బయట వీధిలో సూరయ్య రొజుకుంటూ, రొప్పు కుంటూ గబగబా నడుస్తూ వెళ్తున్నాడు. చేతులో నా స్నేహితు డిచ్చిన మూట భద్రంగా వుంది. వెనక పది

మంది పిల్లలు పోగై గోలచేసుకుంటూ సూరయ్య మీదకు రాళ్ళు విసురుతున్నారు.

నడుస్తూవున్న సూరయ్య అకస్మాత్తుగాపరుగెత్తటం మొదలు పెట్టాడు. రంయిన పరుగెత్తి ఒక ఇంటిముందు ఆగి, ఒక్క నిమిషం ఆయింటిని చూచి, అక్కడనుంచి కదిలి పక్కనేవున్న బావి గట్టుమీద నిలబడ్డాడు. పిల్లలంతా ఎక్కడి వాళ్ళు అక్కడే ఆగిపోయారు. చేతుల్లో రాళ్ళు చేతుల్లోనేవున్నాయి. నేనూ నా స్నేహితుడు వూపిరిబిగి పట్టి చూస్తూ నుంచున్నాం. సూరయ్య వంగి బావిలోకి చూచి లేచి, ఇంటివైపుకిచూశాడు. ఉండి ఉండి 'జే' అని సైరిన్‌లాగా, విన్న వాళ్ళకి సలపరం పుట్టేటట్టు అడిలి రాళ్ళమూటతో సహా బావిలోకి దూకాడు.

వాళ్ళూ వీళ్ళూ పోగయ్యారు గాని ఏమీ లాభం లేక పోయింది. నా స్నేహితుడిచ్చిన రాళ్ళమూట తేలనివ్వక పోయింది. శవం బయటకు వచ్చింది. తర్వాత – మేం ఇంటికి వచ్చిన తర్వాత – నా స్నేహితుడు ఇలా చెప్పాడు – "ఆ ఎదురుగా వున్న ఇల్లే అతనిఇల్లు. అతడు దూకినబావే అతని కూతురు ఆత్మహత్య చేసుకున్న బావి."

# కొడవటిగంటి కుటుంబరావు

## తిండి దొంగ

ఆధునిక రచయితలలో మధ్య తరగతి సంసారుల జీవితాలని, అద్దంలో మాదిరి ప్రతి బింబించేటట్లు రచనలు చేయడంలో కుటుంబరావుగారు ప్రధములు. వీరి కథల్లో మధ్యతరగతివారి సమస్యలు ఎంతో వాస్తవికంగా, హృదయానికి హత్తుకునేటట్లు కనపడతాయి. చెప్పదలుచుకున్న విషయాన్ని సూటిగా పాఠకుని మనసుకి నాటేటట్లు చెపుతారు. 'కులం లేని మనిషి', 'ఆడజన్మ' లాటి పెద్ద కథలు, 'చదువు' అను నవలా మొదలైనవి అనేకం రాశారు కుటుంబరావుగారు. మధ్య తరగతి వారికీయన ప్రతినిధి.

"తిండి దొంగలంటే జ్ఞాపకం వచ్చింది. మొన్న మా అత్తగారేం చేసిం దనుకున్నారు? ఎవరితోనూ చెప్పకుండా పెద్దగిన్నెలో అన్నమూ, కూరలూ, పిండివంటలూ

అవీ పెట్టుకొని కొడుకుదగ్గిరికి వెళ్ళి పోయింది,'' అన్నాడు డాక్టరు శ్రీహరిరావు క్లబ్బులో.

అందరూ ఆశ్చర్య పడ్డారు.

* * *

వెంకాయమ్మ అన్నవస్త్రాలకు లోటులేని ఇంటనే పుట్టినా ఒక్క రోజుకూడా మనశ్శాంతి ఎరగదు. తన తండ్రి, పినతండ్రి నిత్యమూ కుక్కలల్లే కాట్లాడుకునేవాళ్లు. తన తల్లీ, ఆవిడవియ్యపురాలూ అస్తమానమూ సాధించుకుంటూ సూటీ పోటీలాడుకునేవాళ్లు. ఇల్లు పంచుకున్నా, దొడ్డి పంచుకుని బావి నడిమయానికి దడికట్టుకున్నాకూడా ఈ పోట్లాటలు తప్పలేదు. ఇద్దరికీ కావలసిన ముసలమ్మ ఉండేది. ఒకరి మాటలు ఒకరికి వినపడక తప్పదాయె. బంధువులు – ఉభయపక్షాలకూ అయినవాళ్లు – రాకుండా ఉండరాయె. ఇవన్నీ పోట్లాటలు పెరగటానికి ఉపకరించాయి గాని సమాధానం కుదరటానికి తోడ్పడ్డ పాపాన పోలేదు. దొడ్డిదడినుంచి ఏవైపువాళ్లు నాలుక గీసుకోటానికింత తాటాకుముక్క లాగినా రెండోవేపువాళ్ళకి శివమెత్తుకొచ్చేది. ఆఖరుకు, బావిలోనుంచి ఎవరు ఎక్కువనీళ్లు చేదుకుంటున్నారనే దాన్నిగురించికూడా పోట్లాడుకునేవాళ్లు. పిల్లలకు కూడా పరస్పరం ద్వేషం కలిగేటట్టు చేశారు పెద్దవాళ్లు. పెద్దవాళ్ళ కావేషాలకన్నా ఈ ద్వేషాలే ఎక్కువ హానికరంగా ఉండేవి. ఎందుకంటే పెద్దవాళ్ళ కావేషాలకు ఏదో ఒక ఆధారం – కుంటిదో, గుడ్డిదో – ఉండేది. చిన్నవాళ్ళ ద్వేషాలకు ఏ ఆధారమూ లేదు. అది మానవ ప్రకృతిమీది

ద్వేషంగా పరిణమించక తప్పదు; మానవత్వాన్ని నాశనం చెయ్యకా తప్పదు.

వెంకాయమ్మకు పెళ్ళయి ఆమె కాపరానికి వెళ్ళిన తరవాత కొద్దికాలంపాటు జీవితం శాంతివంతంగా ఉన్నట్టు కనిపించింది గాని అది, రాజకీయవేత్తలు చెప్పినట్టు, స్మశాన శాంతి. వెంకాయమ్మ మామగారు చాలా ఏళ్ళక్రితమే పోయినాడు. ఆ ఇంటి ఆవరణలో ఆమె అత్తగారిదే రాజ్యం. ఆవిడతో ఎవరూ వాదించటానికి లేదు. ఎదురుమాట అనటానికి లేదు. ఆవిడకు ఎవరిమీదన్నా ఆగ్రహం వస్తే ఆపూట వాళ్లు తిండి తినరాదు. ఆవిడ ఏ కోడలినన్నా పిలిచి, "వందబిందెలు తోడు," అంటే తోడవలసిందే. ఎక్కడా పొయ్యటానికి లేకపోతే పారబోయాలిసిందేగాని తోడటం మానరాదు. ఆవిడ ఏ కొ[illegible]చి, "నీ పెళ్లాన్ని పది దెబ్బలు కొట్టు," [illegible]టే వాడు కొట్టా[illegible]దే, చావాలిసిందే. "ఎందుకు? [illegible] చేసింది?" అన[illegible]కి వీల్లేదు.

మొదట్లో వెంకాయ[illegible] తన కళ్ళనూ చెవుల[illegible] నమ్మకలేకపోయింది. ఇదంత[illegible] ఆటలాగా, అం[illegible] తనకేమీ భాగం లేనట్టూ, [illegible]మాత్రం [illegible] నట్టూ భావించింది – తనను అత్తగా[illegible] తోడమని, తోడలేనని చేతుల బొబ్బలు ఊదుకున్నందుకు తన భర్తచేత పదిదెబ్బలు కొట్టించటం జరిగినాక ఈ భావన పోయింది.

యధార్థమైనంతమాత్రంచేత ప్రతిది సహజం కానవసరం లేదు. తన అత్తగారి ప్రవర్తనా, మిగిలినవాళ్లు ఆవిడ "పైత్యాన్ని" సహించి శిరసావహించటమూ వెంకాయమ్మకు అమిత అసహజంగా తోచింది. చదువుకున్న మగాళ్ళు కూడా యీపిచ్చిముండ మాటలు ఎందుకు వింటారూ? వాళ్ళకి యావజ్జీవ ఖైదెందుకు? తల్లి అని భక్తా? లేక ఆవిడపేర ఆస్తి ఉందని గౌరవమా?

ఆ తరంవాళ్ళలో వెంకాయమ్మ బాగా తెలివిగలదనే చెప్పాలి. ఎంత కీచులాడుకున్నా తన పుట్టింటివాళ్లు మెట్టినింటివాళ్ళకన్న చాలా నాగరికులని వెంకాయమ్మ సులభంగానే గ్రహించింది. తన అత్తగారు కొంతకాలానికి చచ్చిపోయింది. ఇకనైనా పరిస్థితులు మారతాయనుకున్నది. పరిస్థితులు మారాయిగాని వెంకాయమ్మ మొగుడు మానవత్వం సంపాదింపలేదు. మానవత్వం తాలూకు బీజాలు ఆతనిలో ఏనా పుణ్యాన నాశనమైపోయాయి, తలి ఆత్మకు శాంతి గలగగలందులకు వెంకాయమ్మను అతను రోజూ, కారణంలేకుండానే, చావగొట్టేవాడు. అదివరలో మొగుడు అత్తగారి చేతిలో పనిముట్టల్లే కనిపించటంవల్ల, ఆమెకెప్పుడూ అతనిమీద ఆటే కోపంరాలేదు ఇప్పుడు కోపమూ అసహ్యమూ కూడా కలిగాయి. ఈదశలోనే, ఇద్దరుపిల్లల తల్లి అయివుండి వెంకాయమ్మ గాడితప్పి, ప్రేమంటే ఎల్లా ఉంటుందో ఇతరత్రా తెలుసుకున్నది. కాని ఈరహస్య ప్రణయం కొద్దికాలమే సాగి వెంకాయమ్మ ప్రతిష్ఠ పాడుకాకుండా అంతమయింది. ఇది ఆమెకు మానసికంగా

చాలా మేలు చేసింది. సరిగా ఆ సమయానికి ఎవరో ఒకరు ఆమె హృదయంలో ప్రేమ రగల్చకపోతే ఆమె హృదయం శాశ్వతంగా శుష్కించిపోయి ఉండును. ఈ అనుభవం ఫలితంగా ఆమెకు కొడుకు మీదా కూతురిమీదా అనురాగం హెచ్చింది; జీవితంమీద కొంత ఆశకూడా కలిగింది.

* * *

వెంకాయమ్మ మొగుడు కష్టజీవి కాడు.

ఎవరో పొలాలు పండించి కుమ్మరిస్తే దానితో కాలక్షేపం చేసినవాడు. అయినప్పటికీ అతను పట్టణవాసాలలోని కష్టజీవుల మాదిరిగానే జీవితాన్ని మరచిపోవటానికి తాగుడు అలవాటు చేసుకున్నాడు. అంతులేనికష్టం పాఠకుల మనస్సులను ఎట్లా సంక్షోభింపజేస్తుందో, లోతులేని అజ్ఞానం అతని మనస్సును అదేవిధంగా క్షోభింపజేసి పలాయనం కోరింది. ఆట్టేశ్రమలేకుండా డబ్బు సంపాదించటానికి అతనుచేసిన ప్రయత్నాలు ఏమీ ఫలించలేదు. పైపెచ్చు ఉన్నదికూడా ఊడ్చిపెట్టుకుపోయింది. తల్లి ఆ స్త్రీమో ఆడపిల్లలకు. ఆవిడ ఆడించినట్టు ఆడిన కొడుకుకోడళ్ళకూ, వాళ్ళపిల్లలకూ పూచికపుల్ల దక్కలేదు.

* * *

వెంకాయమ్మ మొగుడు పోయేనాటికి ఆమె కొడుకు రమణయ్య పన్నెండేండ్లవాడు, కూతురు సుభద్ర ఎనిమిదేళ్ళది. తను జన్మఎత్తిన ముప్పై ఏళ్ళకు వెంకాయమ్మకు మొగుడు పోగానే మనశ్శాంతి లభించినట్టు కనిపించింది.

ఇప్పుడు తనకు ఇతరులమూలంగా ఏ బాధా లేదు. పిల్లలిద్దరూ బుద్ధిమంతులు. ఇద్దరూ చదువుకుంటున్నారు. ఏడెనిమిదెకరాల పొలంవున్నది. రైతు మంచివాడు. చుట్టపక్కాలతో, ముఖ్యంగా మొగుడి వైపువాళ్ళతో, అకారణమైన పేచీలు రాకుండా, మళ్ళీ వాళ్ళు తనను మోసం చెయ్యకుండా చూచుకోవాలి. ఇంటిపనులు చాలాభాగం రమణయ్య చేస్తాడు. కాని పై వాళ్ళ సహాయం లేకుండా జరగదు. తన మర్యాదకు భంగం రాకుండా మంచిమాటలతో ఇరుగు పొరుగు వాళ్ళచేత పనులు చేయించుకోవాలి. పిల్లలకు కాస్త దగ్గూ పడిసెమూవస్తే తనకు భగవంతుడుతప్ప మరో దిక్కే లేదనిపించేది. వెంకాయమ్మకు తన కేదన్నా జబ్బుచేస్తే "నేను పోతానేమో ? ఈ పిల్లలేమౌతారు ? వాళ్ళమొహం ఎవరుచూస్తారు ?" అనిపించేది.

కాని ఈ విధమైన బాధ్యతలు వెంకాయమ్మను నిజంగా బాధించలేదు. పైనుంచి పోరులేకుండా ఉంటే స్వతంత్రంగా ఎంత బాధ్యత అయినా భరించవచ్చు. ఇది ప్రత్యేక వ్యక్తులకూ, ప్రజలకూ కూడా వర్తిస్తుంది.

అంతమాత్రానికి మనిషికి మించిన బాధ్యతలుండవని కాదు. సుభద్ర పెళ్ళి ఒకటి వెంకాయమ్మను చాలా బాధించసాగింది. తను న్యాయంగా కోరదగిన కోర్కెలనే అణుచుకునే స్వభావంగల వెంకాయమ్మ కూతురి పెళ్ళి విషయంలో ఎన్నో గొంతెమ్మ కోరికలు కోరసాగింది. సుభద్రకు వచ్చే మొగుడు అందరికీ నచ్చాలి; అందగాడుగా, చదువుకున్నవాడుగా, బుద్ధిమంతుడుగా, డబ్బున్నవాడుగా ఉండాలి;

సుభద్ర అత్తవారు మంచివారై ఉండాలి; వాళ్లు పెద్ద కట్నా లడగరాదు; పెళ్ళికి ఏమీ ఖర్చు కారాదు.

ఈ ఆఖరు కోరిక తప్ప మిగిలినవన్నీ కలసివచ్చిన సంబంధం వచ్చింది, వాళ్లు సుభద్రనుచూసి చేసుకుంటా మన్నారు. వాళ్ళంతట వాళ్లు కట్నం యింత ఇమ్మని అడగ లేదుగాని అవతల మూడువేలు కట్నమిస్తామంటూ సంబంధా లున్నాయి. కట్నాల కింద నే మూడు వేలు పోసి పెళ్ళిఖర్చుల కింకొక వెయ్యి పోసి - రమణయ్య అడుక్కు తినాలిసిందే.

సుభద్ర పెళ్ళికి రమణయ్య బొత్తిగా బొట్టికాయ కాడు; పదిహేనో ఏడు వచ్చింది. స్కూలు ఫైనలు చదువు తున్నాడు. వెంకాయమ్మ కొడుకును సలహా అడిగింది. "ఖర్చయితే అయిందిలే, మంచి సంబంధం చేద్దాం. మగ వాణ్ణి బతకలేక పోతానా?" అన్నాడు. వెంకాయమ్మ సంబంధం స్థిరం చేసింది. పెళ్ళివారు వెయ్యిన్నూట పద హారు రొక్కమూ, మిగిలిన లాంచనాల క్రిందా, వచ్చిన వారి బట్టలకిందా మరో వెయ్యి తీసుకోవటానికి అంగీకరిం చారు.

ఈ పెళ్ళి నిశ్చయించి వెంకాయమ్మ బంధువుల విమ ర్శకు గురి అయింది. ముఖ్యంగా ఆమె మొగుడివైపువాళ్ళు, "మా వంశానికి చెందిన పొలం కాస్తా లోకులు పాలు చేస్తు న్నావు - మా తాత ముత్తాతలు అనుభవించిన ఆస్తి!" అన్నారు. వెంకాయమ్మకు అభిమానం వచ్చింది. సుభద్ర పెళ్లికి అవసరమైన మూడు వేలూ పొలం తాకట్టు పెట్టి రూపాయి వడ్డీకి సంపాదించింది. పొలంమీద వచ్చేదానితో

ఏనాటికైనా అసలు ఫాయిదాలు చెల్లుబడవా, రమణయ్య సంపాదించాడా? - అని ఆమె ధైర్యం. ఏమైనా సరే పొలంలో ఒక్క సెంటు కూడా అమ్మరాదని ఆమె ప్రతిజ్ఞ.

*　　　*　　　*

ఈ ప్రతిజ్ఞ చెల్లలేదు. రమణయ్య మేజరు కాగానే నాలుగెకరాలు అమ్మి వడ్డీతో సహా ఈ బాకీ తీర్చేశాడు. అప్పుడే అతని భార్య కూడా కాపరానికి వచ్చేసింది. అతనికి ఉద్యోగం మాత్రం నిలకడగా దొరకలేదు. నెలకు పాతిక రూపాయలు సంపాదించటానికి నానా హైరానా పడాల్సి వచ్చింది.

అతని దరిద్రం కవులు కీర్తించేది, చిత్రకారులు చిత్రించేది కాదు. అది ఆకర్ష రహితమై, గాయం కలగనీకుండా తగిలిన దెబ్బలాటిది. రెండేళ్ళ కొకరు చొప్పున పిల్లలు పుట్టుకు రాసాగారు. ఖర్చు జాస్తి అయింది. దానికి తగ్గ ఆర్జన లేదు. ఇంట్లో సరిగా తిండి, గుడ్డా లేవు.

మొదట్లో వెంకాయమ్మ ఈ దారిద్ర్యాన్ని లక్ష్య పెట్టలేదు. రమణయ్యను కోడల్ను చూస్తుంటే వెంకాయమ్మ కేదో గొప్ప సంతృప్తి కలిగేది. ఈ తరం వాళ్లు జీవితాన్ని మార్చేశారు. రమణయ్య భార్య జానకి తన కాలంనాటి కోడలు కాదు. తనను రమణయ్య, ఎట్లా చూసేవాడో, జానకి అట్లాగే చూసేది. రమణయ్య కూడా తన కాలంనాటి భర్త కాదు. జానకిని బిడియం లేకుండా ఆపేక్షతో చూసేవాడు. "నీవు ఆడదానివి. నిన్ను మని

షల్లే చూడవలసిన అవసరం లేదు,'' అన్నట్టు ఎప్పుడూ పెళ్ళాంతో మాట్లాడేవాడు కాడు.

''ఇంకా కొంత కాలానికైనా మొగుళ్ళంతా పెళ్ళాలను ఇట్లాగే చూస్తారు కాబోలు. ఎంత మంచి రోజులు!'' అనుకునేది వెంకాయమ్మ. ఏ మనిషిలోగాని అటువంటి ఆశ కలిగించే శక్తులు తప్పక అభ్యుదయ శక్తులే.

కాని ప్రత్యక్ష దారిద్ర్యం ఇటువంటి సంతృప్తిని ఎంతో కాలం దక్కనివ్వదు. ఒక్కొక్క ఏడే, ఒక్కొక్క నెలే, ఒక్కొక్క వారమే, ఒక్కొక్క రోజే యుగంగా గడవ సాగింది.

దారిద్ర్యం మనుష్యుల మంచి తనాన్ని మన్నించదు. దానిని మన్నించే మానవులు దారిద్ర్యాన్ని నాశనం చెయ్యటానికి పూనుకోవాలి. మంచితనం మీదా, సంస్కారం మీద అభిమానం వున్న వాళ్ళు దారిద్ర్యంపట్ల ఉపేక్ష వహిస్తే దారిద్ర్యం మంచి తనాన్ని నాశనం చేసి తీరుతుంది.

* * * *

మాతో ఎందుకమ్మా నువ్వుకూడా ఈ కష్టాలు పడటం? నువ్వు సుభద్ర దగ్గిరికి పోయి వుండు. శ్రీహరి రావు పని బాగుంది. అతని వైద్యం బాగా సాగుతున్నది. నెల నెలా వెయ్యా, పదిహేను వందలూ బ్యాంకులో వేస్తున్నాట్ట,'' అని రమణయ్య తల్లిని ప్రయాణం చేయించాడు.

వెంకాయమ్మ కూతురు దగ్గరికి వచ్చింది. చాలా సేపు నీటిలో మునిగి వుండి ఉక్కిరి బిక్కిరి అవుతూ ఉన్న మనిషి బయటికి వచ్చినట్టయింది. ఇక్కడ దరిద్రం లేదు.

లక్ష్మి తాండవ మాడుతున్నది. సుభద్ర పూర్వ జన్మ సుకృతం - ఏ పెట్టె తీసినా పది రూపాయల నోట్లే. ఇన ప్పెట్టెలో వెయ్యి రూపాయలకు తక్కువ ఏనాడూ ఉండవు. బీదవాళ్ళల్లే కనిపించేవాళ్లు కూడా డాక్టరు దర్శనం చేసుకుని ఆయనచేత కసిరించుకుని అయిదు రూపాయల నోట్లూ, పది రూపాయల నోట్లు చేతిలో పెట్టి పోతుంటారు. రోజూ ఇట్లాగే సాగుతుంది. రేపు పది రూపాయల నోటు రాదేమో అనే భయం లేదు - రాకపోతే ఇబ్బంది లేదు.

సుభద్ర వంటినిండా బంగారు తొడుగు.

సుభద్ర కూతురికి ఉన్నాయి, వెయ్యి రూపాయల నగలు! బొమ్మలూ, తోపుడుబళ్లూ, వెండి గిన్నెలూ, బంగారు గిన్నెలూనూ.

ఒక వారంపాటు వెంకాయమ్మకు తన కొడుకు జీవితం జ్ఞాపకమే రాలేదు. కాని ఈ యింట్లో తనకున్న స్థానం నౌకర్లకున్నటువంటిదేనని వెంకాయమ్మకు త్వరలోనే తెలిసిపోయింది. ఇంటికి వచ్చే గొప్ప వాళ్ళతో తాను మాట్లాడరాదు. ఇంట్లో పనివాళ్ళకు తను పనులు చెప్పరాదు. మొగుడూ, పెళ్ళామూ ఎక్కడికి బయలుదేరినా తనను పిలవరు. సుభద్ర తనతో మాట్లాడేటప్పుడు నౌకర్లతో మాట్లాడిన దానికన్నకూడా అసహ్యంగా మాట్లాడుతుంది. నౌకర్లు కోపంవస్తే పని మానేసి పోవచ్చు...ఎవరో సుభద్రను అడిగారు, "ఆవిడ మీ అత్తగారాండీ?" అని...

ఈ ఇంట్లో జరిగే వృధాఖర్చు చూసి, కొడుకు పడుతున్న పాట్లు జ్ఞాపకం వచ్చి, వెంకాయమ్మకు కన్నీటి పర్యం

తం అయింది. ఈ దుబారా ఖర్చులో సగం వుంటే - నాలుగో వంతుంటే - రమణయ్య జీవితం హాయిగా వెళ్ళి పోను!...ఎందుకీ వ్యత్యాసం? ఎవరు చెబుతారు? ఎట్లా అర్థమవుతుంది?

నోరు కట్టుకోలేక వెంకాయమ్మ ఒక నాడు కూతుర్ని అడిగింది, "నీ దగ్గర ఎప్పుడన్నా కాస్త డబ్బు మిగిలితే అన్నయ్యకు పంపించరాదు టే?" అని.

"నా కటువంటి పనులు అసహ్యం. మా ఆయనకు తెలియకుండా నే నొక్క కానీ ఖర్చు చేయను. అన్నయ్యకు కావలిస్తే ఆయన్నడగరాదు? నా మోహమియా?" అన్నది సుభద్ర. సుభద్ర హృదయం లేని మనిషి కాదు. కూతురి మీద ఎంతో ఆపేక్ష. డబ్బుకు దారిద్ర్యంమీదగల నిర్ల క్ష్యమే సుభద్రలో కనిపిస్తున్నది.

* * *

ఆ రోజు డాక్టరు శ్రీహరిరావు యింటో విందు. సుభద్ర పుట్టిన రోజు. ఎంతెంత గొప్పవాళ్ళు వస్తున్నారు. పెద్దెత్తున వంట సాగుతున్నది, మణుగులకొద్ది కూరలు, గుండిగలతో అన్నం.

ఆ రోజే వచ్చింది రమణయ్య దగ్గిర్నుంచి ఉత్తరం. "...జానకి మూడు రోజులనుంచీ మంచం పట్టింది. డాక్టర్లకు చూపమంటారు. దేనికి? తినడానికి తిండిలేక మాడే మనిషికి మందులెందుకు? ఇవాళో రేపో అందరము మంచం ఎక్కడానికి సిద్ధంగానే ఉన్నాక..."

ఎంత కష్టమైనా ప్రత్యక్షంగా భరించటంకన్న పరో క్షంగా సహించటం చాలా కష్టం. ఈ ఉత్తరం చూడగానే వెంకాయమ్మ కాళ్లు చేతులూ వణికి శరీరం చల్లబడ్డట్టయింది. ఇటువంటి పరిస్థితులు అదివరలో వెంకాయమ్మ చూస్తుండగా చాలాసార్లు జరిగాయి. ఈ ఉత్తరం రాసిన మరో గంటకు రమణయ్య ఎవరిదగ్గిరన్నా రెండు రూపాయలు బదులు పుచ్చుకొని వుండవచ్చుకాని, ఆ విషయం వెంకాయమ్మకు ఎట్లా తట్టుతుంది?

ఆమె ఉత్తరం పట్టుకుని సుభద్ర దగ్గిరికి పోయి, "అన్నయ్య ఉత్తరం రాశాడే!" అన్నది.

భూభారమంతా మోస్తున్నంత విసుగుతో సుభద్ర, "ఇప్పుడేమిటమ్మా? తరవాత సావకాశంగా చూడకూడదూ?" అంటూ అర్జంటు పనిమీద వెళ్ళిపోయింది.

ఆ రాత్రి భోజనాలయాయి. విస్తళ్లలో ఎవరిచిత్తం వచ్చినంత వారు పారేశారు. కొడుకు దగ్గిర్నుంచి ఉత్తరం వచ్చిన తరవాత వెంకాయమ్మ గుక్కెడు మంచి నీళ్లు తాగలేదు. అందరు భోజనాలు అయి, పనివాళ్ళు వెళ్ళిపోయే సరికి రాత్రి పదకొండయింది. వెంకాయమ్మ ఇంకా భోంచెయ్యలేదు. భోంచేశావా అని అడిగేవారు లేరు.

వెంకాయమ్మ వంట ఇంటిలోకి పోయింది. ఇంకో సమారాధనకు సరిపోయే పదార్థాలు మిగిలిపోయాయి. ఒక అరిటాకు వేసుకుని పట్టెడన్నం పెట్టుకుని భోజనానికి కూచుంది. ముద్ద దిగలేదు. "ఏపాటు తప్పినా సాపాటు తప్పదు,"

అంటూ బలవంతాన రెండు ముద్దలు మింగిందో లేదో వాంతి అయిపోయింది.

వెంకాయమ్మకు ఏదో గొప్ప ఆలోచన తట్టింది. ఒక పెద్ద గిన్నె తీసి, దాని నిండా అన్నమూ, కూరలూ, పిండి వంటలూ, పచ్చళ్లూ కుక్కి పెట్టింది. దానిపైన ఆకు కప్పి వాసెన కట్టింది.

అది పట్టుకుని అర్థ రాత్రి వేళ బయలు దేరింది - కొడుకు ఇంటికి!

## చింతా దీక్షితులు

# సూపరెంటు కూతురు

చిన్నపిల్లల రచనల్లో వీరు సిద్ధహస్తులు. 'లక్క పిడతలు' అను వీరి గేయసంపుటి, పిల్లల మనస్తత్వం తెలుపుతూ హృదయంగమంగా ఉంటుంది. కథారచనలోనేగాక, మరుగుపడిన జానపద సాహిత్యాన్ని పైకి తేవడంలోకూడా దీక్షితులుగారు చాలా కృషి జరిపారు. చిన్నపిల్లల మనోభావాలు అతిమనోహరంగా చిత్రించే 'సూరి - సీతి - వెంకి' అను సంపుటిలోని కథయిది.

జైలులో సూరికీ సీతికీ వెంకికీ ఏమీ పనిచెప్పలేదు. ప్రొద్దున్నే లేవడంతోనే వాళ్ళమ్మ తలదువ్వేది. తరువాత వాళ్ళు ఆడుకుంటూ ఉండేవారు.

ఒకనాడు ప్రొద్దున్న సూరీ సీతి వెంకీ జైలులో తమ కొట్టుముందర రావిచెట్టుక్రింద నీళ్ళుచల్లి ఇసుకతో ముగ్గు పెట్టి అక్కడ చెమ్మచెక్క ఆడుకొంటున్నారు.

అప్పుడే జైలు 'సూపరెంటు' వాళ్ళ చిన్నమ్మాయిని

తీసుకొని జైలులోకి వచ్చాడు. 'సూపరెంటు' కూతురికి ఎనిమిదేళ్ళు. పట్టుగౌను వేసుకుంది. రిబ్బనుతో జడ వేసుకొంది. కాలికి మేజోళ్ళూ జోళ్ళూ తొడుక్కొంది. మొహానికి తెల్లగుండ పూసుకొంది.

వాళ్లు ఆ దారిని వెడుతూంటే ఆ అమ్మాయి, సూరీ సీతీ వెంకీ ఆడుకోవడం చూచింది. చూచి అక్కడే ఆగిపోయింది.

వాళ్ళనాన్న రమ్మంటే 'నువ్వెళ్లు, నువ్వు వచ్చేదాకా నే నిక్కడుంటాను' అంది.

'సూపరెంటు' పిల్లను చూస్తూ ఉండమని ఒక నౌకరుతో చెప్పి తన పనిమీద వెళ్ళిపోయాడు.

ఆపిల్ల వాళ్ళకేసే చూస్తూ అక్కడే నిలబడిపోయింది. సీతి ఆ పిల్లను చూచింది.

'ఆడుకుందాం వస్తావా అమ్మాయీ' అంది సీతి.

ఆ అమ్మాయి మాట్లాడలేదు.

'భయంలేదులే అమ్మా, ఆడుకొందాం, రా' అంది సీతి.

ఆ పిల్లకి వాళ్ళింట్లో ఆడుకు నేందుకు తన యీడు పిల్లలెవళ్ళూ లేరు. ఆ పిల్లల్ని చూడ్డంతోనే ఆ అమ్మాయికి ప్రాణం లేచివచ్చింది. కాని రమ్మంటేమాత్రం సిగ్గుపడి మాట్లాడకుండా ఊరుకొంది.

'నీకు దాగుడుమూత లొచ్చునా?' అంది సూరి.

వచ్చునని తలతిప్పింది ఆ పిల్ల.

సూరీ, సీతీ, వెంకీ ఆ పిల్లచుట్టూ చేరారు. ఆ

అమ్మాయి పట్టుచొక్కా పట్టుకుచూచి, 'ఈ పువ్వుల పట్టు చొక్కా చూడ్డొసే, ఎంత బాగుందో' అంది సూరి.

'జోళ్ళుకూడా వేసుకుందే యీ అమ్మాయీ, యీ జోళ్ళు చూడ్డొసే ఎలాగ మెరిసిపోతున్నాయో' అంది సీతి.

'ఆడుకుందాం, దా' అని ఆ అమ్మాయిచెయ్యి పట్టుకొని వెంకి లాగింది. చివరికి ఆ అమ్మాయి ఆడుకోడానికి వప్పుకుంది. కొంతసేపు నలుగురూకలిసి దాగుడుమూతలాడుకొన్నారు.

'సూపరెంటు' కూతురు పేరు కమల. కమల 'తల్లి'గా వుండి సీతి కళ్లుమూసింది. సూరీ, వెంకీ చెట్టువెనకాలా, పువ్వులకుండు వెనకాలా దాక్కున్నారు,

'సంయ్యేనా?' అంది సీతి.

'సంయి, సంయి' అంది సూరి.

సీతి వాళ్ళకోసం యిటూ అటూ చూచి వాళ్ళను కనుక్కొని వాళ్ళను ముట్టుకోడానికి పరుగెత్తింది. సీతి ముట్టుకోకముందే సూరీ, వెంకీ తల్లిని ముట్టుకొన్నారు.

కొంతసేపు సూరి తల్లయింది. కొంతసేపు వెంకీ, సీతీ తల్లయ్యారు. ఇలాగ కొంతసేపు ఆడుకొన్నారు. నలుగురు పిల్లలూ కలిసి గట్టిగా,

'నల్లికాయ దొంగ, నేరేడుదొంగ
పందిట్లో చిన్న పాపాయి దొంగ'

అని పాడి ఆడుతున్నారు. చాలాకాలంనుంచి ఆటలు ఆడకపోవడంవలన కమల మనస్సులో ఉన్న బెంగ అంతా ఆ రోజున ఎగిరిపోయింది.

వీళ్ళు ఇల్లాగ ఆడుకొంటూ ఉంటే పని చూచుకొని సూపరెంటు తిరిగివచ్చాడు. పిల్లలు ఆడుకోవడం చూచాడు. ఖైదీలతో కూడా తనపిల్ల ఆడుకోవడంచూచి మనస్సు చివుక్కుమంది.

కోపం వచ్చింది. పక్కనున్న నౌఖరిని తిట్టాడు, కొట్టే టంతపని చేశాడు.

'కమలా, రా, ఇంటికి వెడదాము' అన్నాడు కోపంగా.

'నే రాను, నువ్వెళ్లు' అంది కమల తండ్రికేసి తిరిగి చూడకుండానే! కమలకు వాళ్ళింట్లో ఎంతో గారాం. తల్లీ తండ్రీ భయంలేదు.

సూపరెంటుకీ ఏమిచెయ్యడానికీ తోచలేదు. ఖైదీ పిల్లల్ని కూకలేస్తాడా? తనపిల్లని కోప్పడతాడా?

'తప్పమ్మా, ఇక్కడాడుకోకూడదు. ఇంటికి వెడదాం, రా' అన్నాడు మళ్లీని, కొంతకోపం అణచుకొని.

'నే రాను' అంది కమల.

'ఇక్కడ మాతో ఆడుకొంటుందిలెండి, మా రెళ్లండి' అంది సీత. సూపరెంటు కమలచెయ్యి పట్టుకొని రమ్మని లాగాడు. 'నే రాను, నాన్నా! నే నాడుకొంటాను' అని చదికిలపడి ఏడ్చింది.

కమల నెప్పుడూ ఏడ్పించి ఎరుగరు తల్లీ తండ్రీని.

'సరే కొంచెంసేపు ఆడుకో. నే నిక్కడే ఉంటానులే' అని సూపరెంటు, తనకూతురు చెయ్యివదలి దూరంగా నిల బడి చూస్తున్నాడు.

సూపరెంటుకి ఖైదీపిల్లలు ముగ్గురిమీదా చాలా కోపం వచ్చింది. కాని కమలకు వాళ్ళవల్ల సంతోషం కలుగుతోందన్న కారణంచేత ఆ కోపం దిగమింగాడు.

నలుగురుపిల్లలూ చెట్టాపట్టాలు వేసుకొని కబుర్లు చెప్పుకుంటూ కొంతసేపు రావిచెట్టుచుట్టూ తిరిగారు. కొంతసేపు పచ్చాసు ఆడుకొన్నారు.

ఎంతసేపు నిలబడ్డా కమల రాలేదని సూపరెంటుకు కోపంవచ్చింది. కమలను కోప్పడితే లాభంలే దనుకొని వాళ్ళదగ్గిరికివచ్చి సూరీ సీతీ వెంకీ కేసి చూసి, 'వెళ్ళండి, అమ్మాయిలూ వెళ్ళండి, మీ కొట్టులోకి వెళ్ళి కూచోండి. అస్తమానం ఆటలే? వెళ్ళండి' అని గదిమాడు.

'మేం వెళ్ళం, మేం ఆడుకొంటాం' అంది సీత.

'మేం వెళ్ళం, మేం ఆడుకొంటాం నీ కెందుకూ?' అంది కమల.

'నీ కెందుకూ?' అంది వెంకి.

'నువ్వు కాదమ్మా కమలా, నువ్వు నాతో రా, మనింటికెడదాం, రా, అమ్మా రా' అన్నాడు సూపరెంటు.

'నే రాను, నే నాడుకొంటాను' అంది కమల.

సూపరెంటుకి ఏమి చెయ్యడానికీ తోచలేదు. ఆడనౌఖర్ని పిలిచి ఆ ముగ్గురు పిల్లల్నీ కొట్టులోపెట్టి తాళం వెయ్యమని ఆజ్ఞాపించాడు. ఆడనౌఖరువచ్చి ముగ్గురు పిల్లల్నీ బలవంతంగా కొట్టులోకి తీసుకుపోయింది.

సూపరెంటు కమలని బలవంతంగా ఇంటికి లాగుకుపోయాడు. కమల అదే ఏడవడం.

ఇంటికి వెళ్ళాక సూపరెంటు భార్య అతన్ని చూచి, 'కమల నెందుకు ఏడ్పిస్తున్నారు?' అనికోపంతో అడిగింది.

'నే నేడ్పించడంలేదు, అదే ఏడుస్తోంది' అన్నాడు విసుగుతో సూపరెంటు.

'ఊరికే అది ఏడవబోయిందా? మీరేమీ అనకుండా' అని సూపరెంటుభార్య నిలవదీసి అడిగింది.

'చెప్పినమాట వినడంలేదు కమల. ఖైదీపిల్లలతో ఆడుకొంటానంటుంది, వద్దంటే మానదు. ఎంత చెప్పినా వినదు. నేను బలవంతాన్ని తీసుకువచ్చానని ఏడుస్తోంది' అన్నాడు సూపరెంటు.

కమల ఆగకుండా ఏడుస్తూనేవుంది.

ఖైదీపిల్లలసంగతీ, వాళ్ళతో ఆటలాడినసంగతీ యావత్తూ తనభార్యతో సూపరెంటు చెప్పాడు.

'పోనీ అమ్మాయి అంత ఏడుస్తూంటే ఆ పిల్లల్నే ఇక్కడికి తీసుకురాలేకపోయారా?' అంది భార్య.

'ఖైదీపిల్లల్ని మనింటికి తీసుకురమ్మన్నావూ!' అన్నాడు సూపరెంటు తన ప్రతిష్ఠ తలచుకొంటూ.

'వాళ్లేం దొంగతనం చేశారా, దోపిళ్ళు చేశారా? వాళ్ళు ఖైదీలేమిటి? ఏదో గ్రహచారం చాలకో, కాలాన్ని బట్టో ఖైదులోపడ్డారుగాని?' అంది భార్య.

సూపరెంటు ఆలోచనలో పడ్డాడు.

కమల ఏడుస్తూనేవుంది.

'పోనీ నౌఖరిని పంపించి ఆ పిల్లల్ని తెప్పించండి' అంది అతనిభార్య.

నౌఖరినిపంపించి ఆ పిల్లల్ని తెప్పించాడు సూపరెంటు.

కమల ఏడ్పు చాలించింది. నవ్వింది.

నలుగురు పిల్లలూ ఒక్క బంతిని ఆరోజున సూప రెంటుగారింట్లోనే భోజనం చేశారు.

వాళ్ళనాన్న కొనిపెట్టిన రకరకాల బొమ్మలన్నీ కమల చూపించింది సూరికీ, సీతికీ, వెంకికీని.

ఆ రోజు సూపరెంటు యిల్లు కలకలలాడింది ; సూప రెంటుభార్య ముఖము కలకలలాడింది. ఆ రోజు సూపరెంటు ముఖం కలకలలాడిందా ?

భోజనముచేసి కొంతసేపు నలుగురూ సూపరెంటు పందిరిపట్టెమంచంమీదే పడుకొన్నారు. సూపరెంటు భార్యే వాళ్ళనక్కడ పడుకోబెట్టింది. సూపరెంటు ఆ రోజు భార్యతో ఘోరంగా యుద్ధం చేయవలెనని అనుకొని తొందరపడడం వివేకం కాదని ఊరుకొన్నాడు. పిల్లలు నిద్ర పోయి లేచి, వాళ్ళయిల్లంతా ఎగిరిపోయేటట్లు గోలచేస్తూ పాటలుపాడుతూ ఆడుకొంటున్నారు.

సాయంత్రం అయింది.

ఖైదీలకుభోజనాలు పెట్టి,కొట్లలోకిపంపించేవేళయింది.

సూపరెంటు ఏమిచెయ్యాలో తెలియక ఆలోచిస్తు న్నాడు.

ముగ్గురు పిల్లల్నీ కొట్టులోకి చప్పున పంపించాలను కొన్నాడు. భార్యముఖంచూచి ఊరుకొన్నాడు.

ఎప్పటికైనా పిల్లల ఆట ముగుస్తుందేమో అని కని పెట్టి చూస్తున్నాడు. ఎంతకీ ముగియడంలేదు.

చివరికి ధైర్యంతో నౌఖరినిపిలిచి ఆ ముగ్గురు పిల్లలినీ వాళ్ళకొట్టులో అప్పజెప్పి రమ్మన్నాడు.

కమల తానుకూడా వాళ్ళతో కొట్టులోకి వెడతానంది!

సూపరెంటుభార్య నవ్వింది.

సూపరెంటుకు మతిపోయింది.

'తీసుకువెళ్ళవేం?' అని నౌఖరిని గదిమాడు సూపరెంటు.

నౌఖరు 'చిత్తం' అని ఖంగారుపడి నిలబడ్డాడు.

'నువ్వూ కొట్టులోనికి వస్తావుకదూ కమలా?' అంది సీతి.

'కొత్తులోకి దా' అంది వెంకి.

'పోనీ వాళ్ళని ఇక్కడే ఉండనియ్యరాదూ' అంది సూపరెంటు భార్య.

'ఇది మనఇల్లు. చెరసాలకాదు' అన్నాడు కోపంతో సూపరెంటు.

'అయినా ఆకుకోసీ పాడుకోసీ పిల్లలకి ఖైదేమిటీ' అంది భార్య

'నన్నేంచెయ్యమన్నావు?' అన్నాడు సూపరెంటు.

'పోనీ పైకివ్రాసి కనుక్కోండి' అంది భార్య.

సూపరెంటుకు కోపంవచ్చి 'టెన్నిసుబాటు' తీసుకొని భార్యని రమ్మని పిలవకుండానే మోటారు కారెక్కి పారిపోయాడు.

నౌకరు సూపరెంటు భార్యకేసి చూచి మాట్లాడకుండా జారాడు.

సూరీ, సీతీ, వెంకీ, కమలా ఆవేళ రాత్రి కూడా సూపరెంటు ఇంట్లోనే భోజనంచేసి వాళ్ళ పందిరిపట్టె మంచంమీదే నిద్రపోయారు.

ఇంటికి రాగానే సూపరెంటుభార్య సూపరెంటు నడిగింది 'పైకి రాశారా' అని.

'రాస్తా' అన్నాడు సూపరెంటు.

## 2

'వ్రాశామన్నారుగదా, ఏమిసమాధానం వచ్చింది?' అని అడిగింది సూపరెంటుభార్య సూపరెంటుని.

'వ్రాయడం ఏమిటి?' అన్నాడు సూపరెంటు.

'ఈ ముగ్గురిపిల్లలినీ గురించి...'

'అదా! నేను వ్రాయకముందే వచ్చింది'

'ఏమని?'

'చిన్నపిల్లలిని శిక్షించవలసిన అవసరము లేదనీ, వాళ్ళను వదలిపెట్టమని'

'అయితే వాళ్ళని వదలిపెట్టినట్లేనా?'

'మనింటిలో ఉన్నాక వదలిపెట్టినట్లు కాక ఇంకేమిటి?' అని హేళనగా అన్నాడు సూపరెంటు.

'ముగ్గురినీనా' అన్నది భార్య.

'చంటిపిల్ల తల్లిదగ్గర ఉంటుందిట. మిగిలిన యిద్దరు ల్లలినీ పంపించివేస్తాను'

'ఎక్కడికి?'

'వాళ్ళమ్మగారి ఊరికి ఉత్తరం వ్రాయించాను.'

'పోనీ వాళ్ళు మనింట్లో ఉండకూడదూ...కమలతో ఆడుకొంటూ ఉంటారు పాపం'

'పనికిరాదు'

'వాళ్లు ఖైదీలు కారుగా?'

'నీ యిష్టం' అని చెప్పి సూపరెంటు కోపం పట్టలేక కారులో కుక్క నెక్కించుకొని షికారు వెళ్ళిపోయాడు.

కొంతసేపు జైలులోనూ కొంతసేపు కమలంగారింట్లోనూ సూరీ సీతీ వెంకీ కమలతో ఆడుకొంటున్నారు.

వాళ్ళమ్మ ఈ సంగతి విని ఇందువల్ల ఏమి ముప్పు వస్తుందో అని భయపడుతూ ఉంది. సాధ్యమైనంతమట్టుకు ముగ్గురు పిల్లలినీ తన కొట్టులోనే వుంచుకోవడానికి ప్రయత్నిస్తోంది.

ఇల్లా ఉండగా ఒకనాడు ఒక ముసలమ్మ జైలుగేటు దగ్గిరికి వచ్చి నిలబడిందని, సూరినీ సీతినీ పంపించి వెయ్యమన్నారని ఒక జవాను సూపరెంటు దగ్గరనుంచి సూపరెంటు భార్యకు వర్తమానం తీసుకువచ్చాడు.

సూపరెంటు భార్య మాట్లాడక పోవడంవల్ల ఏమిచేయడానికి తోచక జవాను తటపటా యిస్తున్నాడు.

సూరి కమలకి జడేస్తోంది. అప్పుడు ఒక కాగితం ముక్క ఎవరూ చూడకుండా సీతి కమల నెత్తిమీద పడేసి 'ఓ తాయిల్లాగారి నెత్తిమీద గోరింక, చెప్పకు చెప్పకు

చెడు పాప, చెపితే నీ కళ్ళోతాయి' అని నవ్వుతూ చప్పట్లు కొడుతూ అంటోంది.

వెంకికూడా 'ఓ తాయిల్లాగారి నెత్తిమీద గోలిం కోయి' అంటోంది.

కమల తలమీద తడుముకొని కాగితం ముక్క తీసి వేసింది.

'మొగుణ్ణి వెతుక్కుందోయి, మొగుణ్ణి వెతుక్కుం దోయి' అని సీతి గోల చేసింది. వెంకి గంతులేసి నవ్వింది. వాళ్ళమ్మ యిదంతా చూస్తూ ఆనందించింది.

ఈ సమయంలోనే జవాను వచ్చి వాళ్ళ సంతోషానికి భంగం కలగజేశాడు.

'అమ్మాయీ, ఎవరో ఆముసలమ్మ నీకు తెలుసునా?' అంది సూపరెంటు భార్య సూరికేసి తిరిగి.

'చెప్పుకోగలవే, సీతీ' అంది సూరి.

'నే తెప్పనా' అంది వెంకి.

'చెప్పమ్మా మరీ' అంది సీతి.

'ఓ తాయిల్లాగారు' అంది వెంకి. అందరూ నవ్వారు.

'ఎవరు చెప్మా' అంది సీతి.

'జ్ఞాపకం లేదుటే...మనం...తీర్థం వెళ్ళినప్పుడూ..' అని అందించింది సూరి.

'ఆఁ ఆఁ...అమ్మమ్మ' అంది సీతి.

'అమ్మమ్మంటే ఎవరు?' అంది సూపరెంటు భార్య.

'మా అమ్మ దొడ్డమ్మ' అంది సూరి.

సీతి సూపరెంటు భార్యతో, 'మా దొడ్డమ్మే, ఎంత

మంచిదనుకొన్నారు. మేం తీర్థాని కెళ్ళినప్పుడు ఎన్నో బొమ్మలూ, మిఠాయిలూ అన్నీ కొనిపెట్టింది. కాదుటే సూరీ?' అంది.

'దొడ్డమ్మ మంచిది' అంది వెంకి.

'ఏమండోయ్ మేం తీర్థాని కెళ్ళినప్పుడేం, మా దొడ్డమ్మ మమ్మల్నందరినీ వాళ్ళయింటికి తీసికెళ్ళి మా కన్నీ వండిపెట్టిందండీ' అంది సూరి.

'అమ్మా మనకి లేదుటే దొడ్డమ్మా' అని కమల వాళ్ళమ్మ నడిగింది.

'వాళ్ళదొడ్డమ్మే మన దొడ్డమ్మాను' అంది నవ్వుతూ వాళ్ళమ్మ.

ఎంతకీ సమాధానం చెప్పకపోవడంవల్ల జవాను వె ళ్ళిపోయాడు.

కొంతసేపటికి సూపరెంటే వచ్చాడు చెండుకుంటూ.

'ఆ అమ్మాయిల్ని పంపించెయ్యమంటే ఎందుకు పంపావుకావూ?' అన్నాడు భార్యతో.

'ఎక్కడికీ పంపించడం?' అంది అతనిభార్య.

'వాళ్లమ్మమ్మ వచ్చిందని కబురు చేశానుగా' అన్నాడు.

వాళ్లమ్మమ్మవస్తే జైలుగేటు అవతల నిలుచోబెట్టక పోతే యిక్కడికే పంపలేకపోయారా? ఆవిడ ఖైదీకాదుగా' అంది అతనిభార్య.

'వీల్లేదు' అన్నాడా అధికారి.

'పిల్లేకపోతే మీరే పిల్లల్ని పంపించెయ్యండి' అంది ఆవిడ.

సూపరెంటు భార్యకేసి కొంతసేపు కోపదృష్టితో చూచాడు. కొంతసేపు కిందామీదా చూచాడు. కొంతసేపు తన ఉద్యోగాన్నీ, అధికారాన్నీ తలుచుకున్నాడు. సూరి కేసీ, సీతి కేసీ తిరిగి, 'వెళ్లండి అమ్మాయిలూ, మీ అమ్మమ్మ వచ్చిందట' అన్నాడు గద్దిస్తూ.

'ఎక్కడికి వచ్చిందండీ మామగారూ?' అంది సీతి.

'వెళ్ళండి జవాను తీసుకెడతాడు' అన్నాడు సూపరెంటు.

'మరి మా వెంకో?' అంది సీతి.

'వెంకని మీ అమ్మగారి కొట్టులోనికి పంపిస్తా' అన్నాడు.

'నన్నో నాన్నా, నన్నుకూడా పంపించవూ?' అంది కమల.

'వెళ్ళు, మీ అమ్మదగ్గిరి కెళ్లు' అని కూతురుని కోప్పడ్డాడు సూపరెంటు.

'రావే, వెడదాం' అంది సూరి.

'రా అమ్మా, వెంకీ' అంది సీతి.

సూరీ, సీతీ, వెంకీ చెయ్యీ చెయ్యీ పట్టుకొని గుమ్మం దగ్గిరికి వచ్చారు.

'పదవే భద్రాద్రికీ పావిష్టి ఘటమా, ఎన్నాళ్లు బ్రదికీన ఇది నీకు స్థిరమా' అని సీతి ఎవళ్లో బూచాళ్లు పాడుతూంటే విని జ్ఞాపకం ఉంచుకొన్న పాట పాడుతోంది.

వాళ్ళ నాన్న కోపడ్డాడనీ, సూరీ, సీతీ, వెంకీ, వెళ్ళి పోతున్నారనీ వాళ్లమ్మ కాళ్లు పట్టుకొని కమల గొల్లున గోల పెట్టింది.

'ఊరుకో' అన్నాడు వాళ్ళనాన్న.

'దాన్నెందుకు కోప్పడతారూ' అని అతని భార్య యుద్ధసూచకంగా పలికింది.

సూపరెంటు భార్యముఖం చూచాడు. లాభంలేదనుకొన్నాడు. ధుమధుమలాడుతూ కారెక్కి క్లబ్బుకు లేచి పోయాడు.

సూరీ, సీతీ, వెంకీ, గుమ్మంలో నుంచున్నవాళ్ళు మళ్ళీ ఇంట్లోకి వచ్చారు.

'ఆవిణ్ణి ఇక్కడికి తీసుకురా' అంది సూపరెంటుభార్య జవానుతో.

'రా, అమ్మా, రా, రా, కమలా ఆడుకొందాం' అంది సీతి.

'దా కమలా దా' అంది వెంకి. కమల చెయ్యి పట్టుకొని లాగింది. కమలని కూచోబెట్టి సూరి కమలజెడలో పువ్వులు గుచ్చుతోంది. సీతీ వెంకీ పువ్వులందిస్తున్నారు. కమల అమ్మ సాలోచనగా వాళ్ళను చూస్తోంది. కొంత సేపట్లో దొడ్డమ్మ జవాను వెనకే వచ్చింది. వచ్చి సూరీ, సీతీ, వెంకీ ఆడుకొంటూంటే చూచింది. చూచి కంటతడి పెట్టుకొని, 'అయ్యో, అయ్యో, నా తల్లుల్లారా, మీకెంత అనుభవం వచ్చిందర్రా, మీకెంత అనుభవం వచ్చిందర్రా, నేబతికి ఉండగాను' అని వెంకిని ఎత్తుకొని ఏడ్చింది.

సూరీ సీతీ లేచి దొడ్డమ్మ కాళ్ళు కావలించుకొన్నారు.

'తిని కూర్చోలేక ఇది ఎందుకు తెచ్చిపెట్టున్నారర్రా...నా వెర్రితల్లులూ అయ్యో...మీ అమ్మేదర్రా?' అంది దొడ్డమ్మ.

'అమ్మ ఇక్కడ లేదు అమ్మమ్మా' అంది సూరి.

'ఇది జైలు కాదుటర్రా?' అంది దొడ్డమ్మ.

'ఇది జైలుకాదు, కమలగారిల్లు' అంది సీతి.

'మరి మీ అమ్మ ఎక్కడ?' అంది దొడ్డమ్మ.

'తెల్లలాగులూ తెల్లటోపీలూ పెట్టుకొంటారూ... అక్కడ జైలు' అంది సీతి.

'మరి మీరిక్కడున్నారేం' అంది దొడ్డమ్మ.

సూరీ సీతీ కమలఅమ్మకేసి చూచారు.

'వీళ్ళు ఖైదులో లేరమ్మా వీళ్ళని వదలిపెట్టారు... మా అమ్మాయితో ఆడుకొంటూ ఉంటారని ఇక్కడికి తీసుకొచ్చాము.'

'ఈ అమ్మాయేనా, మీ అమ్మాయి? బంగారుతల్లి; రా, అమ్మా ఎత్తుకుంటాను రా' అంది కమలతో దొడ్డమ్మ.

కమల వాళ్ళమ్మచీర పట్టుకు నిలబడి వచ్చింది కాదు.

'ఎవరమ్మా మీరు?' అంది దొడ్డమ్మ.

'ఇది సూపరెంటుగారిల్లు...నీకు తెలియదూ దొడ్డమ్మా?' అంది సీతి.

'నాకేం తెలుసునే నాతల్లీ' అంది దొడ్డమ్మ.

'కూచోండమ్మా! మా కమలకూడా ఎవరూ ఆడుకొనేవాళ్ళు లేక బెంగపెట్టుకొంది. ఈ అమ్మాయిలు వచ్చి

నప్పటినుంచీ మా కమలకి అవి ఆటలుకావు అవి పాటలు గావు' అంది కమలఅమ్మ.

దొడ్డమ్మ కూచుని నూరినీ, సీతినీ, వెంకినీ చుట్టూ కూచోబెట్టుకొని వాళ్ళను చూచుకుంటోంది. కమలకూడా సీతిపక్కని కూచుంది. కమలఅమ్మ బయటికివెళ్ళి జవాను తో ఏదో చెప్పి మళ్ళీవచ్చి కూర్చుంది.

'అమ్మమ్మా, మాకోకథ చెప్పవు?' అంది సీతి.

'అయ్యో తల్లీ! నాబతుకో కథలాగ ఉందేతల్లీ! మీనాన్నా మీఅమ్మా, మీఅన్నయ్యా మీరూ...ఇంటిల్లి పాదీ ఇక్కడ ఈజైల్లో కూచుంటే ఇంక కథేమిటే నావెర్రి తల్లీ...విన్నారమ్మా, నాకు రోంత తెలియనైనా తెలిసింది కాదు. మా మనమడైనా ఒక్క కాగితంముక్క రాశాడు కాదూ' అంది దొడ్డమ్మ.

'ఏదో గ్రహచారం' అంది కమల అమ్మ.

'గ్రహచారమే. లేకపోతే వీళ్ళకీ పాట్లేమిటి? అయినా యిదేమిటమ్మా? చోద్యం. అందరూ శ్రీకృష్ణ జన్మస్థానం అంటూ జైల్లోకెళ్ళి కూచోవడమే! ఇవేంరోజు లొచ్చాయోగాని!'

వాళ్ళు మాట్లాడుకొంటూంటే జవాను వాళ్ళమ్మను తీసుకువచ్చాడు.

'దొడ్డమ్మా, నువ్వెందుకొచ్చావే. పాపం ముసిలి దానవు?' అంది వాళ్ళమ్మ.

'అయ్యో నాతల్లీ, నరసమ్మా! మీకింత అనుభవం

కలిగితే నేరాకపోతే ఏలాగమ్మా! రా, నాతల్లి, రా, ఎంత చిక్కిపోయావో?' అంది దొడ్డమ్మ.

సూరీ సీతీ వెంకీ వెళ్ళి వాళ్ళమ్మ కాళ్ళు చుట్టూరా కౌగలించుకొన్నారు.

కొత్త వదిలింది కాబోలు కమల దొడ్డమ్మవళ్ళో కూర్చొంది.

దొడ్డమ్మ పక్కనే వాళ్ళమ్మ కూచుంది. ముగ్గుర మ్మాయిలూ వాళ్ళమ్మవళ్ళో ఇరుకుగా కూచున్నారు.

'ఇంకా ఎన్నాళ్లే మాఅమ్మా ఇది మీకు?' అంది దొడ్డమ్మ.

'ఎన్నాళ్ళయితే ఏమిటి?' అంది నరసమ్మ.

'అయ్యో అలా అంటావేమేతల్లీ' అంది దొడ్డమ్మ.

'మాకిక్కడ బాగానే ఉంది, దొడ్డమ్మా. ముగ్గురు పిల్లలూ ఆయిల్లాలు ధర్మమా అని ఇంట్లో ఉన్నట్లు ఇక్కడు న్నారుగదా' అంది నర్సమ్మ.

'ఆవిడ మహాదొడ్డయిల్లాలు. చూస్తున్నాగా' అంది దొడ్డమ్మ.

'ఏమిటో అవ్వగారూ, పిల్లలన్న తరవాత ఆమాత్రం ఉండకపోతే ఎలాగ' అంది కమలగారి అమ్మ.

'అయితే అబ్బాయిన్నీ, నీపెనిమిటీ ఎక్కడున్నారే?' అంది దొడ్డమ్మ.

'వారు కులాసాగానే ఉన్నారుట. మగాళ్ళజైల్లో ఉన్నారు' అంది నర్సమ్మ.

'వాళ్ళనుకూడా ఒకమాటు చూడకపోతే ఎలాగ బతకను?' అంది దొడ్డమ్మ.

కొంతసేపు మాట్లాడుకొన్న తరవాత దొడ్డమ్మ స్నానం చెయ్యడానికి లేచింది. ఎవరు వండిపెట్టినా ఆవిడ తినదుకనుక ఆవిడే ఆవేళ అందరికీ వండిపెట్టింది.

ఆరోజు సూపరెంటు ఇంటికి తిరిగిరాలేదు. మర్నాడు కూడా రాలేదుగాని జైలరు ఒక కాగితం పట్టుకొనివచ్చి నర్సమ్మనీ, సూరినీ, సీతినీ, వెంకినీ వదిలివేసినట్లు ఉత్తరువు వచ్చిందని చెప్పాడు.

'అయితే ఇక్కడెందుకర్రా, మనము ఉండడం? వెడదాం పదండి' అంది దొడ్డమ్మ.

ఎంత ఉండమన్నా ఉండనంది. కమలగారి అమ్మ నర్సమ్మకు పసుపూ పారాణి రాసి తాంబూలం రవికల గుడ్డా పెట్టింది.

కమల సూరికీ, సీతికీ, వెంకికీ పసుపూ పారాణి రాసి అందరికీ చొక్కాగుడ్డా పరికిణీగుడ్డా పెట్టింది.

'వాళ్ళు మనింటికి వచ్చారు కాబట్టి వాళ్ళింటికి మనం వెడదాములే' అని కమలను ఊరుకోబెట్టింది తల్లి.

'తప్పకుండారండి అక్కగారూ' అంది నర్సమ్మ.

సూరీ, సీతీ, వెంకీ 'వెడతాం కమలా, మాయింటికి వస్తావుకాదూ' అన్నారు.

'వస్తా' అంది కమల.

బండియెక్కి దొడమ్మా, నర్సమ్మా సూరీ, సీతీ, వెంకీ వెళ్ళిపోయారు.

మూడోరోజున సూపరెంటు తిరిగివచ్చాడు.

కమల వాళ్ళనాన్నను వెళ్ళి కౌగిలించుకొని 'నాన్నా నాన్నా మనం సీతిగారింటికి వెళ్ళొద్దూ' అంది.

'అల్లాగే' అన్నాడు వాళ్ళనాన్న. కాని మళ్ళీ కమల నెప్పుడూ తనతో కూడా జైలులోకి తీసుకు వెళ్ళలేదు.

అయినా సూరిసీతివెంకీ దగ్గిర నేర్చుకొన్న పాటలు కమల పాడుతూవున్నప్పుడు మాత్రం ముద్దు పెట్టుకోకుండా ఉండలేకపోయేవాడు.

## ఇల్లిందల సరస్వతీదేవి

# బలీయసీ కేవలమీశ్వరాజ్ఞా

ప్రఖ్యాత కథా రచయిత్రిగా సరస్వతీదేవి తెలుగు పాఠకులకి చాలాకాలంబట్టి తెలుసు. కథకురాలుగానే గాక సాహిత్య సీమలో కూడా వీరు అపారమైన కృషి చేశారు. స్త్రీల పాటలను సేకరించి ప్రచురించిన 'జాతి రత్నాలు' నిజంగా రత్నాలే. సరస్వతీదేవిగారి కథలు మనోజ్ఞంగానూ రసవత్తరంగానూ వుంటాయి.

అది వైశాఖ పున్నమి. ఆ ఊరి జమీందారిణికి ఆనాడు బ్రాహ్మణులను బీదసాదలను తోచిన రీతిగా సత్కరించే అలవాటు. అర ఎకరము మేర ఆక్రమించిన ఆ భవనము చుట్టూ తాటియాకు పందిళ్లు వేశారు.

పాడ్యమినుండి జమీందారిణికి తీరిక లేదు. ఎవరికేది

ఇచ్చేది, ఏ వస్తువులు కావలసినదీ విడివిడిగా దేనికది ప్రత్యేకంగా పట్టికలు తయారు చేయించి వస్తుసామగ్రి సిద్ధ పరచింది.

పౌర్ణమినాడు తెల్లవారుజామున నే లేచి, తలంటి పోసుకొని, దైనిక పూజను ముగించుకొని, పందిటిలోకి ప్రవేశించింది. ప్రతి ఏటా జరుగుతున్న దానధర్మాలు కనుక సూర్యోదయము కాకముందే పండితులు, వటువులు, ముత్తైదువలు నిర్దేశింపబడిన ప్రదేశాలలో ఆసీనులయ్యారు. బీదవారంతా చాపల మీద కూర్చున్నారు, లెక్కలేనంత మంది.

సుమారు ఏడున్నర గంటలకు వర్జ్యము వెళ్లిన తరువాత జమీందారిణి సత్కారము ప్రారంభము చేసింది. బ్రాహ్మణులు మంత్ర సూక్తాలు శ్లోకాలు చదివి, సంభావనలు అందుకొని, స్వయంగా తమ చేతికి అందిస్తున్న జమీందారిణిని దీవించి పోతున్నారు.

పది గంటలయేసరికి జనము పలచబడినది. పందిటిలోని జనమునంతా కలయజూచిన జమీందారిణికి ఆత్మీయులెవరో రాని వెలితి చటుక్కున తోచింది. ఆమె విశాల నయనాలు మరొకసారి...మరొకసారి...ఆ పందిటిలో ఉన్న ఒక్కొక్కరిని పరిశీలించి వెతకినాయి. 'ఇంకా రాలేదేమి...ఇంకా రాలేదేమి' అని ఆత్రపడుతున్నది ఆమె హృదయము.

''వీరయ్యా! చెల్లమ్మా రామయ్యలు ఇంకా రాలేదు. నేను నిన్న సాయంకాలము కభురుకూడా చేశాను

సుమా. ఎందుకు రాలేదో? నీవు స్వయముగా వెళ్ళి తీసు కొనిరా. అద్దాల బండి తీసుకొని వెళ్లు'' అని పంపింది. మాట పూర్తిగా చెప్పక ముందే వీరయ్య కదిలి వెళ్ళాడు.

అప్పటికి అంగవస్త్రాల - చెంబుల దొంతరలు తరగి పోయాయి. బీదలకిచ్చే ధాన్యపు బస్తాలు ఖాళీ అయాయి. రవిక పీటీల పళ్లేలు వట్టివయాయి.

వెళ్ళిన అరగంటకే వీరయ్య బండితో వచ్చాడు. బండిలోనుంచి సుమారు పాతిక ఏళ్ళ చెల్లమ్మ ముందుగా దిగి, చేతులు పట్టుకొని రామయ్యను దింపింది. కొయ్య కాళ్ళతో, చేతుల క్రింద పెట్టుకొన్న కర్రల సహాయంతో రామయ్య నిముషానికి ఒక అడుగు వేస్తూనూ, చెల్లమ్మ అతనికి ఆసరాగా ప్రక్కనుంచి నడుస్తూనూ వస్తుంటే హృదయ విదారకమైన ఆ దృశ్యానికి జమీందారిణి కళ్ళ వెంట ఆపలేని అశ్రుప్రవాహము బయలుదేరింది. కొత్తగా ఆ దృశ్యము చూసేవారికి కళ్ళవెంట వచ్చేవి నీళ్లు కాదు, రక్తపు బొట్లేమో అన్నట్లుగా ఉంటుంది.

ఆ దృశ్యము ఆమె నాలుగు సంవత్సరాలుగా చూస్తూనే ఉన్నది. చూసినప్పుడల్లా అంత దుఃఖము కలుగుతూనే ఉన్నది. ఏనాడు ఆ పుణ్య దంపతుల దర్శనముతో తన హృదయము విప్పారి ప్రేమాంకుర మేర్పడినదో ఆ వైశాఖ పున్నమినుండి దాని స్మారక చిహ్నముగా ప్రతి ఏటా బ్రాహ్మణ బీదసాదలకు తోచిన రీతిగా దానము చేయటము ప్రారంభించినది.

* * *

జమీందారిణి శకుంతలాదేవి వేసవికాలములో తన భవనమును చల్లగా ఉంచే ఏర్పాట్లు చేయిస్తున్నది. ఫిబ్రవరినెలలోనే, నీలగిరి వెళ్ళటమూ, బెంగుళూరు వెళ్ళటమూ, అని యోచించి ఏర్పాట్లు చేసుకునే ఆమెకు రెండేళ్ళ క్రిందట పెద్ద విపత్తు తటస్థించింది. బలంగా లేచి తిరుగుతూ తిరుగుతూ ఉన్న జమీందారుకు రెండు దినాల జ్వరంతో మాట నిలిచిపోయింది. స్థలము కదల్చకుండా చికిత్సచేసి చూడాలని స్థానిక ఘనవైద్యులు తంటాలు పడుతున్నారు. అందుకనే పందిళ్ళతోటి తడకలతోటి ఉన్నచోటనే చల్లదనము ఆపాదించాలని సకల ప్రయత్నాలూ చేస్తున్నది జమీందారిణి.

ఆ ఉదయమే మేదరి గుడిసెలలోనుంచి చెల్లమ్మ రామయ్యల జోడా జమీందారుగారింటికి తడకలు తీసుకొని బయలుదేరింది. పల్లెపదాలతో - యౌవనపు సరాగాలతో ఒకరి నొకరు తోసుకుంటూ రాసుకుంటూ - రాచభవనము సమీపించే సరికి ఎనిమిది దాటింది.

''పడమరన ఉన్న గది ముందర వసారా మాదిరిగా వంపుగా తడక కట్టిస్తే ఎండయొక్క తీక్ష్ణము లోపలి రాకుండానూ, గాలి వచ్చేటట్లుగానూ ఉంటుం'' దని జమీందారిణి శకుంతలా దేవి మేదరి రామయ్యకు చెప్పి తన గదిలోకి వెళ్ళిపోయింది.

''మామా! ఊఁ పని మొదలు పెట్టు. కానీ... అక్కడొకటీ... ఇక్కడొకటీ గడలు పాతు. పురికొస

జేబులో పెట్టుకో. గోడకు నిచ్చెన వేసుకో. ఊం ధోవతి పైకి కట్టు..."

"పెద్దపెద్ద మాటలు చెప్తున్నావుగాని చేసేదానివి కాదుగా. గునపము తీసుకురా, కూర్చుని ఎన్ని కబుర్లు అయినా చెప్పవచ్చు...అవునా?"

గజములోతు గుంటలను తవ్వి గడలను వాటిలో దింపుతున్నాడు రామయ్య. గడ్డపార తిరుగవేసి గుంటలను మట్టితో పూడ్చి దిమ్మసచేస్తున్నది చెల్లమ్మ. ఈ రెండుపనులు పూర్తిచేసి రామయ్య గోడకు నిచ్చెన వేసుకున్నాడు. సుమారు పన్నెండుగజాల ఎత్తునుంచి స్లోపు దింపుకుంటూ, ఆరు ఏడు గజాల ఎత్తుకు తీసుకొనిరావాలి. ఒకనిచ్చెన పొడుగు చాలక రెండు నిచ్చెనలను కలిపి తాళ్ళతో గట్టిగా బిగించి కడ్తున్నాడు.

రామయ్య రెండు నిచ్చెనలను కలిపి తాటితో బిగించి కడుతుంటే ఆమె స్నిగ్ధహృదయానికి ఆశ్చర్యము కలిగింది.

"మామా, బ్రహ్మదేవుడు ముళ్ళువేసినట్లుగా వేస్తున్నావే. రెండు నిచ్చెనలను కలిపి తాళ్ళతో బిగించి కడ్తున్నావే? ఈ బిగింపు సళ్ళిచ్చినా, తాడునలిగినా, ఏమవుతుందో ఊహించావా మామా?"

"ఊహించకేం? వెర్రిముఖానికి నీకేనా ఆలోచనా శక్తి? రెంటినీ బంధించేతాడు సన్నగిల్లినా బిగింపు సళ్ళిచ్చినా ఏ క్షణానికి విడిపోతామో అన్నట్లుగా ఉంటాయి నిచ్చెనలు. నేనయితే గట్టిగానే బిగించి కడ్తున్నాను."

"అబ్బ! ఎంతచెమట పోసిందో! తుడవనీ. అప్పుడు

తాగిన గంజినీళ్ళుకాస్తా అరిగిపోయినట్లున్నాయి. వచ్చే టప్పుడు మూటకట్టి తీసుకొచ్చిన అన్నము, రొట్టెలు యీ వైపు తడక కట్టినతరువాత తిందువుగాని.''

''నే నొక్కణ్ణే తింటానా? నీకుమాత్రము ఆకలికావ టంలేదూ?

''నేనూ తింటాను. నేనే కలిపి ముద్దలుచేస్తాను.''

కూనిరాగాలుతీస్తూ నిచ్చెనమెట్లు ఎక్కిపోతున్నాడు. పురికొస, పెద్దకత్తి, మేకులూ జేబులో పెట్టుకొని, జుట్టు సవరించుకుంటూ, కిందికిచూస్తూ—

''చూస్తూనిలబడక, కాస్త నిచ్చెన గట్టిగాపట్టుకో.''

''నీ పనితనము చూద్దాము. ఈ తడకను కాసేపటిలో ఆ మేకులకు తగిలించు. మాటలలో ఉన్నవడి పనిలో ఉందో లేదో చూస్తాను.''

''నీవు పనిముఖ మెరుగుదువా పిల్లా? ఏ వూరు, ఏ దేశము పిల్లా నీది?'' రాగచ్ఛాయ లెరుగని రామయ్యపాటకు చెల్లమ్మ ఫక్కున నవ్వింది.

వీళ్ళమాటలు, స్వరాగాలు శకుంతలాదేవి చెవిని పడు తున్నాయి. ఆమెకు నవ్వటాలు, తుళ్ళటాలు అసలే పనికి రావు. ''ఏమిటీ? మీ రిద్దరూ పనిచేయటానికి వచ్చారా? లేక సరసాలాడడానికి వచ్చారా? మీ అల్లరే అప్పటినుంచీ నా చెవిని పడుతున్నది, పని జరుగుతున్నట్లు లేదు'' అని కిటికీదగ్గర నిలబడిన శకుంతలాదేవి మందలించింది ఆజంటను.

''దొరసానీ, అది ఆపితే నేను పనిచేయకుండా ఆగు తానా! అదంతే. మాట్లాడుతూ - పాటలుపాడుతూ -

నాకు అడ్డమువచ్చి, పనిజరగకుండా చేయాలని చూస్తుంది. నే నేమీ పని ఆపి వినేవాణ్ణికాదు తల్లీ" అన్నాడు పైకి ఎక్కిన రామయ్య.

"ఏయ్ అమ్మా, నీవు సిగ్గయినా లేకుండా వాడి నెందుకు ఊరికే పలుకరిస్తావు? వాడు చేసేపనికి అడ్డమువస్తు న్నావు తెలిసిందా?"

"నేను మాట్లాడిస్తూ పదాలు పాడుతుంటేగాని ఆయన పనిచేయలేడమ్మా అసలు. నా మాట నిజమవునో కాదో చూడండి. కాస్త నేనటు పోయివస్తాను" అని ధీరాలు పలుకుతున్నది చెల్లమ్మ.

"ఆహా. అదొకటా ఈ మేదరివాడికి? బాగానే ఉన్నది లక్షణము!" అనుకుంటూ శకుంతలాదేవి లోపలికి వెళ్ళిపోయింది.

ఆమెను లోపలికి పోనిచ్చి గవ్వలు గలబరించినట్టుగా ఇద్దరూ నవ్వుకున్నారు. ఆ నవ్వులోని శబ్దతరంగాలు నలు దిశలూ వ్యాపించి మారుమ్రోగాయి.

"మామా! వాళ్ళలాగ మనము నోరు మూసుకొని పని చేయగలమా? మాటా మంతీ లేకుండా, ఎవరిగదిలో వాళ్ళు కూర్చుని కాలము వెళ్ళదీస్తారు. మనమయితే అట్లా ఒక్కక్షణముకూడా ఉండలేము."

"మాటా ముల్లే కట్టి ముసలోళ్ళతో చెప్పి యెంకీ భద్రాద్రి వెళ్దామా? యెంకీ...మనము భద్రాద్రి వెళ్దామా?"

"మామా, పాట పాడావుగాని ముసలివాళ్ళు ఏరి

మనకు? పిల్లోణ్ని చంకనేసుకొనికదూ వెళ్ళేది? ఊరికే వెళ్దామనుకున్నావు?''

''అవునుకదూ! సరిసరి. చాలావుందే? పోనీ నీవో పదము పాడు?''

''నీవు పాడినట్టు–సన్నగా...తియ్యగా...నేను పాడగలనా? నవ్వకుమరి? నా కొచ్చినట్లు నేను పాడతాను ఏం?''

''నా సిన్నితమ్ముణ్ణి నా కియ్యరయ్యో ఏడుకొండలవాడ యెంక టేశ్వరుడా!'' ఉప్పొంగిన హృదయంతో, జగమంతా రామమయముగా తోచిన చెల్లమ్మకు అప్రయత్నంగా నోటికి ఆ పాట వచ్చేసింది.

నిచ్చెనమీద కాళ్లు ఆనించి, ఒకచేత్తో మేకు పట్టుకొని మరొకచేత్తో మేదరికత్తి తిరగవేసి మేకును కొట్తున్నాడు రామయ్య, ధ్యాసంతా దానిమీదనే కేంద్రీకరించింది.

ఇంతలోకే పైనుంచి పెద్దబరువు క్రిందపడ్డ చప్పుడు! అయ్యో! అయ్యో! అన్న కేకలు ప్రక్కగదిలో ఉన్న శకుంతలాదేవికి వినపడ్డాయి. ఆమె యివతలికివచ్చి చూసేసరికి కూలీలంతా చెల్లమ్మచుట్టూ మూగారు. అందరూఒక్కసారి ''ఏమయింది, ఏమయింది? ఎట్లా పడ్డాడు?'' అని అడుగుతున్నారు.

రామయ్య రెండుకాళ్ళూ మోకాళ్ళక్రిందనుంచి ఊగులాడుతున్నాయి. ముఖంనిండా రక్తము! మాటలేకుండా మూలుగుతున్నాడు.

''అయ్యో! మామా, కాళ్ళు...నీ కాళ్లు విరిగి.

పోయాయా ?'' అంటూ తడిబట్టతో ముఖముతుడిచి విసురుతున్నది చెల్లమ్మ.

అక్కడ మూగిన కూలీజనమంతా చెల్లమ్మ దుఃఖము చూడలేక కంట తడిపెట్టారు.

ఆ దృశ్యానికి శకుంతలా దేవి హృదయములో కదలిక కలిగింది. ఆమె కెవరో బోధించినట్లయింది. కారులో రామయ్యను ఆసుపత్రికి పంపే ఏర్పాట్లుచేసి, కూడా వెళ్తానని పట్టపట్టిన చెల్లమ్మను ఆపుచేసింది.

చెల్లమ్మ నోటతడి ఆరేవరకు ఏడ్చింది. మితిమీరిన దుఃఖమువల్ల యిప్పుడామె కంటికి నీరు రావడము లేదు. కూలిజనమంతా చెల్లమ్మను ఓదార్చుతున్నారు.

శకుంతలా దేవికి యిదంతా అయోమయంగా ఉంది!

''అయ్యో, మా మామకు కాళ్ళు విరిగిపోయినాయి. గడ్డంక్రింద రాయి లోతుగా దిగబడిపోయింది. క్రిందపడితే ఏదో పడ్డదనుకున్నానుగాని...మామ పడ్డాడని అనుకోలేదు. ఇంకెక్కడికాళ్ళు? అయిపోయినట్టే...''

''ఏడవకు, కాళ్ళు విరిగిపోలేదులే. కట్టుకట్టించుకొని వస్తాడు. ఏడిస్తే వస్తాయా?'' అంటూ సమాధాన పెట్టున్నారు కూలీలంతా.

''ఎంత పాటు పడ్డాడు! ఇంకా అన్నము పెట్టాలని సిద్ధముచేస్తున్నాను. ఎప్పటిలాగ నడుస్తాడా మా మామ? ఇవాళ లేచినవేళ మంచిదకాదు. వచ్చేటప్పుడు వాళ్ళపిల్ల తుమ్మింది. అప్పుడే అనుకున్నా ఏదో మూడుతుందని.

అబ్బా! ఎంతర క్తము కారిందో...ఎంత బాధ పెట్టిందో...''
అంటూ చెల్లమ్మ ముఖము తిరిగి పడిపోయింది.

దెబ్బతగిలిన రామయ్యను పంపివేసి చెల్లమ్మకు రెండు మూడు గజాల దూరాన శకుంతలాదేవి చూస్తూ నిలబడి పోయింది. ఇంత చేటు బాధపడుతుందేమిటి యీ మనిషి? ఇదంతా నిజమైన మానసిక్షోభేక మేనా? చెల్లమ్మ ఇంత ఆరాట పడవలసిన అగత్యమేమిటో శకుంతలాదేవికి అవగాహన కావటము లేదు. ఇన్నాళ్ళనుంచి కాపురము చేస్తున్న పెనిమిటికి దెబ్బతగిలి ర క్తము కారినందువల్ల మనసులో కొంచెము కష్టముగా ఉండవచ్చు కాని...అయినా చెల్లమ్మకు ఇకముందు జీవనోపాధిని గురించి దిగులేమో అనుకొని :

''ఇంక సంపాదించలేడన్న దిగులా నీకు? అందుకేనా ఏడవటము'' అని దూరాన నిలబడి కాస్త ధీమాగా జమీందారిణి అడిగింది.

''అమ్మా పోషణకొరకు ఏడవటములేదు. ఆయన పోషించలేకపోతే నేను పోషించలేనూ? నాకు మేదరి పనులన్నీ వచ్చు. తడకలు బుట్టలు అల్లి నేనుకూడా సంపాదిస్తూనే ఉంటాను; కాని మా మామ నవ్వుకుంటూ నడుచుకుంటూ మరి రాగలడా? నేను వీళ్ళగూడెము వచ్చి నాలుగేళ్ళయింది. ఒక్కనాడైనా నేను మా అమ్మగారింటికి వెళ్లలేదు. మా మామ తాను కలుపుకొని అన్నము తినలేదు. నాకు నమ్మకములేదు ఆ కాళ్లతోటి నడుస్తాడని.''

''అయితే మీ కులములో మారుమనువు లేదూ?

మీా కులాలలో దిగులుపడవలసిన అవసరము ఏముంది ?''
అన్నది శకుంతలా దేవి.

''అమ్మా, మారుమనువు ఎవరికి కావాలి తల్లీ ? మా మామ మనసిచ్చి మనసును ఆకర్షించుకున్నాడు. ఒకపోల్లు మాట - ఒక కల్లుబొట్టు ఎరగడు. ఒకరిజోలికి పోడు'' చెల్లమ్మకు నాలుక ఎండిపోయింది. మాట్లాడే శక్తిలేక నేలకు ఒరగిపోయింది.

అంతవరకూ నడుముమీాద చేతులు పెట్టుకొని చూస్తున్న శకుంతలా దేవి హృదయము దురహంకారపూరితమైన ఆచ్ఛాదనము విదలించుకొన్నది. మంచినీళ్లు తెప్పించి చెల్లమ్మ గొంతులో పోయించి, అరుగుమీాద చాపవేయించి పడుకో పెట్టించింది. అక్కడే తానొక కుర్చీ వేయించుకొని కూర్చున్నది.

జమీాందారిణి శకుంతలా దేవి కాపురానికి వచ్చిన పదిహేను ఏళ్ళలో నలుగురుపిల్లల తల్లి అయింది. బాల్యములో ఆమె విద్యనేర్చినట్లు కనబడదు కాని సంగీతములో ప్రావీణ్యము కలిగించుకొన్నది. మాటలో, ప్రవర్తనలో, జమీాందారీ ఠీవి ఉట్టిపడేటట్లుగా మెలగట మామెకు పుట్టుకతో అబ్బినవిద్య. పెద్దదయి అత్తవారింటికి వచ్చినా ఆమెకు నలుగురిలో కలిసి ఉండడము, అందరితో కలిమిడిగా మాట్లాడటము అలవాటు కాలేదు. తనతో మాట్లాడవచ్చిన వారితో ముఖాముఖి మాట్లాడ నిచ్చగించక దాసీలతో రాయబారము జరిపించటము, చాలావరకూ దాసీలమధ్యనే

వాళ్లతో ప్రసంగిస్తూ కాలక్షేపము చేయటము ఆమెకభ్యాస మయినది.

ఆమె స్వభావమేమిటోగాని బిడ్డలనయినా ఆప్యాయముగా పిలిచి దగ్గరకూర్చోబెట్టుకొని ఎరుగదు. ఒకసారి బిడ్డకు ప్రమాదకరమయిన జబ్బుచేసింది. బిడ్డ నిద్రపోయే విధము రాత్రివేళ ఆహారము కోరటము మొదలయిన ఒకటి రెండు విషయాలు వైద్యుడు అడిగాడు. ఆయన సమక్షంలోనే దాసీని ఆమె అడగటము, అది సరిగా సమాధానము చెప్ప లేకపోవటము జరిగింది. అందుకు ఆయన "బిడ్డల విషయములో జబ్బుగా ఉన్నప్పుడయినా స్వయముగా గమనించాలండీ. దాసీలతో యీ పని కా"దని ఆయన అన్నాడు. ఆమెకు చాల అభిమాన మనిపించి వెంటనే వైద్యుని మార్చివేసింది.

ఆమె జీవితములో భర్తతోటి సంభాషణలు సమావేశాలు అధికారితో ఇంటర్వ్యూవలెనే ఉంటూ వచ్చాయి. ఆమె వచ్చినప్పటినుంచీ ఆయన పద్ధతులేమిటో ఆయన రుచులేమిటో తెలుసుకోవాలని ఆమెకు తోచలేదు. ఆ భవనములో ఆమెకు కొన్ని గదులు ప్రత్యేకము - ఆయనకు కొన్ని గదులు ప్రత్యేకము. ఆయన సేవకులు వేరు - ఆమె దాసీలు వేరు. అందువల్ల వాళ్ళిద్దరూ ఒకరిని గురించి ఒకరు ఎరుగ వలసినంత ఎరుగరు. జమీందారున కిప్పుడు అనారోగ్యము కలిగి రెండు సంవత్సరాలయింది. ఆరోగ్యము అభివృద్ధి చెంద వలసినంత చెందలేదు. ఆమె ఆయన దర్శనము చేసికూడా చాలారోజులయింది. వ్యాధిని గురించి ఆతురతతో ఆమె

ఆయనను ఎప్పుడూ అడగనూలేదు; అడిగినప్పుడయినా ఆయన సుముఖంగా జవాబివ్వనూలేదు. ఒకరికొకరు మర్యాదలు చేసుకోవటము మన్నించుకోవటము మిగిలింది ఆ దంపతులకు.

భర్త విషయములో ఆమె హృదయము ఇంతవరకూ విచ్చని మొగ్గగానే ఉంటూ వచ్చింది.

"సా కిం న రమ్యా, సచ కిం నరంతా
బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా"

మేదరి దంపతుల చర్యలు ఆమెకు మొదట విపరీతముగాను ఏహ్యముగాను కనబడి ఆఖరుకు హృదయానురంజకము లయినవి!

మేదరి చెల్లమ్మ మనసు పరిపక్వమై అనురాగపూరితమయినది. తనదో...

తన జీవిత ఘట్టాలను సింహావలోకనము చేసుకుంటూ చెల్లమ్మ ముఖము చూస్తూ కూర్చున్న శకుంతలాదేవి, చెల్లమ్మదగ్గర ఒకమనిషిని ఉంచి, చివ్వున లేచి జమీందారు గదిలోకి చరచర నడిచింది. తలుపు దగ్గరగా వేసి సేవకుడు మంచము దగ్గరగా ఒదిగినాడు. నీరసించిన దేహముతో ఒత్తిగిలి పడుకొనివున్న భర్తను ఒక్కసారి ఆపాద మస్తకమూ వీక్షించినది. సేవకుని బయటికి పంపి, వారికి నిద్రాభంగము చేయలేక కాళ్ళదగ్గరగా స్థాణువువలె నిలిచిపోయినది!

కాలికి తగిలిన స్పర్శవల్ల జమీందారుకు మెలకువ వచ్చింది. అకాలములో దర్శనమిచ్చిన శకుంతలాదేవిని చూడగానే ఆశ్చర్యము కలిగిన దాయనకు. లేచి కాగితము

కలము చప్పున అందుకొని ''దొరసానిగారు యిల్లా వచ్చిన పని ఏమిటి, దాసీలేమయినారు'' అని వ్రాసి చూపించాడు. ఆమె అది చదువుకొని ''ప్రభూ నేను మీకు ఇకనుంచి 'దొరసానిగారిని కాను. మీ పాదదాస్యము చేయదలచిన అర్ధాంగిని. మన యిద్దరిమధ్య ఇకనుంచి దాసీలు ఉండరు'' అంటూ మోకరిల్లింది.

అత్యాశ్చర్యములో మునిగిపోయిన జమీందారునికి వెంటనే 'ఆఁ ఏమిటీ' అంటూ రెండేళ్ళుగా నిలిచిపోయిన మాటలు తిరిగి రా నారంభించినవి!

## పాలగుమ్మి పద్మరాజు

# పడవ ప్రయాణం

'గాలివాన' అన్న వీరి కథ ప్రపంచ కథానికల పోటీలో బహుమతి పొందింది. పద్మరాజుగారి కథల్లో మన స్తత్వ పరిశీలన ఎక్కువగా కనిపిస్తుంది. 'వాన వచ్చిన రాత్రి', 'పడవ ప్రయాణం' - యీ రెండు కథలూ గణనీయమైనవి.

ప్రొద్దు కుంకిన తరవాత లోకమంతా దిగులుగా ఉంది. పడవ మెల్లగా నీటిమీాద జారుతోంది. నీరు పడవ ప్రక్కని కలకలమంటూ రాసుకుంటోంద. చూపుమేరలో జీవసంచలనం లేని ప్రపంచకం నిశ్శబ్దంగా జుమ్మంటోంది. ఆధ్వని చెవులకు వినపడక దేహాన్నంతనీ తాకుతుంది. మనస్సు లోలోపల అది నిండుగా కంపిస్తున్నట్టు ఉంటుంది. అప్పుడు ఏదో బ్రతుకు చివరకి ఆఖరయిపోతున్న నిస్పృహ. దూరంగా చెట్లు సాగుతాయి. దగ్గరగా ఉన్న చెట్లు తలలు విరబోసుకున్న పెద్ద దెయ్యాల్లాగ జీబురుమంటో వెనక్కి

నడుస్తాయి. పడవ కదలదు. కాలవగట్టు కదులుతుంది. నాచూపులు చొచ్చుకొని చొచ్చుకొని నీటిలోకి చూస్తాయి. అందులో ప్రతిబింబించిన చీకటిని చీల్చుకొని చూస్తాయి. నక్షత్రాలు మెల్లగా కెరటాలమీద వివశంగా వుయ్యాల లూగుతాయి. కన్ను తెరచి నిద్రపోతాయి.

గాలిలేదు. పడవలాగే తాడు, మునిగర్రి చప్పుడయి నప్పుడల్లా బిగువుగా, ఒదులుగా అవుతోంది. పడవ వెనుక భాగంలో పొయ్యిలో నిప్పు మండుతోంది. అప్పుడప్పుడు గప్పుమంటోంది. అప్పుడప్పుడు తగ్గిపోతోంది. లోపలికి ఊరిన నీరు చేదతో తోడి ఒక కుర్రవాడు కాలవలోకి పారబో స్తున్నాడు. పడవలోపల ఏవేవో బస్తాలున్నాయి. ధాన్యం, బెల్లం, వుప్పు, చింతపండు వగైరా. పడవ టాపుమీద నేను వెల్లకిల పడుకున్నాను. పడవలోపలనించి చుట్టపొగలు, ఏదో సంభాషణ కలిసి మెల్లగా తాపీగా అన్నిదిక్కులకీ వ్యాపిస్తు న్నాయి. గుమాస్తా కూచున్న గదిలో గుడ్డిదీపం కొద్దిగా కునుకుతోంది. పడవ సాగుతోంది.

"ఏయి పడవా? ఈ గట్టుకి రానీ! ఈ గట్టుకి," అని ఎవరో పిలిచారు.

పడవ గట్టుకి చేరడంతోనే ఇద్దరు ఎక్కారు. పడవ ఆ పక్కకి కొంచెం వొరిగింది.

"టాపుమీద కూకుంటాంలే!" అంది ఆడగొంతుక.

"ఇన్నాళ్ళూ ఏడ పోయావే? కనమట్టంలేదు" అన్నాడు చుక్కాని కాస్తున్న మనిషి.

"ఇజానగరం, ఇశాకపట్టణం, మావోడూ, నేనూ కలిసి తిరిగొచ్చాం. అప్పన్న కొండ కెల్లాం."

"ఏడ బోతన్నా?"

"మండపాక పోతన్నాం మరిదీ! కులాస గున్నావా? గుమాత్తాగారు పాతో రేనా?"

"ఆ!"

మగవాడు టాపుమీద అడ్డదిడ్డంగా పడుకొని ఉన్నాడు. అతని నోట్లో చుట్ట పక్కకి పడిపోతే ఆడమనిషి తీసి ఆర్పేసింది.

"ఒరేయి! నెగిసి కూకోరా!"

"నోరుముయ్యి......నెంజా! నేను తాగాననుకుంటు న్నావా? మక్కు లిరగదంతాను." ఒకపక్కనించి ఇంకో పక్కకి తిరిగి పడుకున్నాడు. ఆడది అతని ఒంటిమీద గుడ్డ కప్పింది. తనో చుట్టదీసి అంటించింది. అగ్గిపుల్ల రప్పుమన్న ప్పుడు ఆమెముఖం చూశాను. నల్లగావున్న ముఖం ఎర్రగా వెలిగింది.

ఆమె గొంతుకలో మగజీర వుంది. ఆమె మాట్లాడు తున్నప్పుడు చనువుగా ఒప్పిస్తున్నట్టుగా వుంటుంది. ముఖం అందమయినదికాదు. జుట్టు చెదిరిపోయినా ముఖంలో ఏదో పెద్దమనిషితరహా వుంది. నల్లటి రవిక వున్నట్టు తెలియడం లేదు. చీకట్లోకూడా ఆమెకళ్ళు మేలుకున్నట్టు మెరుస్తు న్నాయి. అగ్గిపుల్ల వెలుగులో పక్కని పడుకున్న నన్ను చూచింది.

"ఈపక్కనెవరో పడుకున్నార్రా!" అంది. మగవాణ్ణి తట్టి లేపింది.

"తొంగోయే నెంజా. గొడవెడితే డొక్క లూడ దంతాను." మగవాడు అతి ప్రయత్నంమీద కొంచెం దూరంగా జరిగాడు.

ఇంతలో దీపం పైకెత్తి గుమాస్తా పడవపక్కని నిల బడి చూచాడు. "ఏమే రంగీ, ఈడెవడు?" అని అడిగాడు.

"మావోడండి, బాబ్బాబు, రిమార్కు రాయించకండి" అంది రంగి.

"పద్దాలే! దింపెయ్యి! దొంగతొత్తుకొడుకుని. నీకు బుద్ధిలేదూ! మళ్ళీ ఆణ్ణి పడవెక్కించా? తాగుబోతోణ్ణి."

"నే తాగందే. ఎవరంట నే తాగానంటా?" అన్నాడు

"ఒరే దింపెయ్యండర్రా! ఎందు కెక్కనిచ్చా రీణ్ణి! చిత్తుగా తాగున్నాడు."

"చిత్తుగా నేదు. కొంచెం దావత."

"ఊరుకోరా! గుమాత్తాగార్రా! బాబ్బాబు, మండ పాక్కాడ దిగిపోతాం."

"గుమాత్తాగారూ! దండాలండీ! తమ దయండి. నేను తాగనేదు బాబూ!"

"ఏమన్నా అల్లరిచేస్తే కాలవలోకి తోయించేస్తాను, జాగ్రత్త!" గుమాస్తా గదిలోకి వెళ్ళిపోయాడు. పద్దాలు లేచి కూర్చున్నాడు. నిజానికి ఆట్టే తాగినట్టు లేదు.

"కాలవలోకి తోయించేత్తాడంట! నా కొడుకు,' అన్నాడు మెల్లగా.

"ఊరుకోరా! ఇనమడద్ది."

"రేప్పొద్దున్న పడవసూసుకోమను. యాసాలేత్తాడు, నా కొడుకు."

"ఉస్సు! ఆ పక్క నెవరో పడుకున్నారు."

"ఎవరు?...నిద్దరోతన్నారు," పద్దాలు చుట్ట అంటించాడు.

పద్దాలుకి మెద్దుమీసాలు, కోలముఖం. చాతీ ఎప్పుడూ విరుచుకొనివుంటుంది. వెన్నెముక ఉండీలుబద్దలాగ వంగి నిలబడుతుంది. మొత్తంమీద మనిషి కొంచెం సన్నంగా నిర్లక్ష్యంగా ఉంటాడు.

పడవ మళ్ళీ నిశ్శబ్దంగా సాగుతోంది. పడవ వెనక భాగంలో నిప్పు రగలడంలేదు. సరంగులు తిండితిన్న గిన్నెలు తాపీగా మాట్లాడుకుంటూ కడుక్కుంటున్నారు.

గాలి చలిగాలేదు. అయినా నేను కండువా కప్పుకున్నాను. అనంతమయిన ఆ చీకటికి అసహాయంగా శరీరాన్ని అప్పగించడానికి నాకు భయంవేసింది. గాలిమాత్రం చురుకుగా ఉంది - మెత్తని స్త్రీ స్పర్శలాగ పడవ నీటిమీద ఎంతమృదువుగా రాసుకుపోతోంది. చెప్పలేనంత మృదుత్వం. విశాలమయిన స్త్రీత్వం ఆ రాత్రిలో నిండుగా ఆవరించుకొని ఉంది. ఆ కౌగిలిలో నాకు చిరకాలంనాటి విషాదగాథలు మెల్లగా ఆప్యాయంగా జ్ఞాపక మొస్తున్నాయి - అనాదినుంచీ మగవాణ్ణి లాలించి పోషించిన స్త్రీత్వపు గాథలు.

నాకు కొంచెందూరంలో రెండుచుట్టలూ ఎర్రగా కాలుతున్నాయి. జీవితం బరువుగా అక్కడ కూర్చుని ఆలోచించుకుంటూ చుట్టకాలుస్తున్నట్టు నాకు అనిపించింది.

"వొచ్చీ దేవూరు?" అన్నాడు పద్దాలు.

"కాల్దారి" అంది రంగి.

"ఇంకా శానాదూర ముంది."

"ఇయ్యాల జాగత్తుంద్రా. వొద్దువొద్దు. ఈలు సూసుకుని తరవాత? ఏరా నా మాటినవ్రా?" రంగి జాలిగా బతిమాలుతూ అడిగింది.

"బెదురు, నెంజకి" అన్నాడు పద్దాలు. అంటూ ఆమె పక్కలో వేలెట్టి పొడిచాడు.

"అమ్మో!" అంది రంగి. అని తన్మయంగా ఆకాశంలోకి ముఖమెత్తి చీకట్లోకి చూసింది. ఆ స్పర్శ శాశ్వతంగా ఉండిపోవాలని కోరుతున్నట్టుగా ఆమె ముఖమెత్తింది.

నాకు క్రమంగా నిద్రపట్టింది, పడవంతాకూడా నిద్రపోతో, నీటివాలుకి మెల్లగా జారిపోతూంది. నాకు కొంచెం దూరంలో ఆ ఇద్దరు వ్యక్తులూ కొంతసేపు గుసగుసలాడుకున్నారు. నాకు నిద్రపట్టినా, పూర్తిగా పట్టలేదు. పడవ నడుస్తున్నట్టు, నీరు జారుతున్నట్టు, చెట్లు వెనక్కిపోతున్నట్టు తెలుసును. పడవ నెవరూ లాగడంలేదు. పడవ లోపల అంతా కునుకుతున్నారు. రంగి నాపక్కనించి నడిచి చుక్కానిదగ్గరకు వెళ్ళి కూచుంది.

"మరిదీ! ఎల్లాగున్నా?" అంది.

"నువ్వెల్లాగున్నా?" అన్నాడు చుక్కాని కాసేవాడు.

''ఎన్నెన్ని సిత్తరాలు సూపించా డనుకున్నా మా వోడు! చినీమా కెల్లాం! ఓడల్ని సూశాం! ఓడంటే ఓడ కాదు మరిదీ! మా వూరంతుంది. మరి సుక్కా నెక్కడుందో గాని!'' రంగి అల్లా ఏదో చాలాసేపు కబుర్లు చెపుతో కూర్చుంది. ఆ కబుర్లు నన్ను జోకొడుతున్నట్టున్నాయి.

''పిల్లా! నాకు నిద్దరొత్తందే!'' అన్నాడు చుక్కాని కాసే మరిది.

''సుక్కాని నే సూత్తాలే. నువ్వల్లా తొంగోమరిదీ!'' అంది రంగి.

పడవ మళ్ళీ మెల్లగా జారిపోతోంది - నిశ్శబ్దంగా. రంగి ఆ నిశ్శబ్దాన్ని కదపకుండా తన గొంతెకెత్తి చల్లగా పాటపాడింది.

''యాడున్నాడో! - నావోడు - యాడున్నాడో!
కూడు గిన్నెలో యెట్టి - కూకుని సూత్తుంటె
నీడల్లె మా పెల్లి నిదరే కంటికిరాదు...యాడున్నాడో॥
తేలల్లే కొండెత్తి - తెగకుట్టే సలిగాలికి
నా లోపలంతా బిగిసినాదో మరిదీ!
యెచ్చని నీవాళ్ళు నన్నొత్తితేగాని
సచ్చిపోతానేమొ!.....యాడున్నాడో॥''

రంగి గొంతుకలోని మగజీరలో సంగీతముంది. ఆ పాటలో పడుకుని ఉన్న అన్నిప్రాణులూ ఒక్కసారి కుని కాయి. గడిచిన యుగాల ప్రేమగాథలు వింతగా, మెల్లగా, విషాదంగా ఆ పాటలో కంపించాయి. ఆపాట నీటివెల్లువై పొంగితే అందులో లోకం చిన్న పడవలాగ తేలిపోయింది.

మానవ జీవితం ఈ ప్రణయంతోటి మాయగా, వింతగా, జరువుగా అనిపించింది.

నాకు కొంచెందూరంలో పద్దాలు నెత్తిని ముసుగు మూసుకొని కూర్చున్నాడు. కాని అతనికీ రంగికీ మధ్య కొన్నియుగాల అంతర మేదో ఉన్నట్టు తోచింది. అతను టాపుదిగి పడవలోకి పోయాడు. నేను ఒంటరిగా వెల్లకిల పడు కొని చూస్తున్నాను. రంగి అల్లాగే పాడుతోంది.

"గుడిమెనక సందులో గుంటున్నా దాని
సడిసెయ్యక నువ్వు దగ్గర జేరితే
గుడిమెనక గుంటెవరు? బావా?
నడివయసులో నేను కానా!"

నాకు నిద్రపడుతోంది. రంగిపాట అల్లా లోకాలు తిరిగివచ్చి మళ్ళీ మెల్లగా నా గుండెల్లో తగులుతోంది. నాకు నిద్రపట్టింది. నిద్రలో ప్రాకృతికమయిన ప్రణయం నా ముందు గంతులువేసింది. పల్లెలూళ్ళలో కాపుపడుచులు తమప్రియులతో దాగుడుమూత లాడుకొంటూ పాటలో కలిసిపోయారు. నే నెరగని ఒకానొక స్వాప్నికలోకం నా ముందు నిద్రలో తెరుచుకుంది. అందులో రంగి పద్దాలు అనేకరూపాలతో తిరుగుతున్నారు. పాట క్రమంగా నా జ్ఞప్తిలోనుంచి పోయింది. నిద్ర నా మనస్సు తలుపులు మూసింది.

* * *

పడవలో కొంచెం గొడవయింది. నేను కళ్ళు నులుపు కుంటూ లేచాను. పడవ గట్టుకిచేర్చి ఉంది. రెండు లాంతర్లు

పట్టుకొని సరంగులు కంగారుగా పడవ యెక్కి దిగుతున్నారు. గట్టుమీద రంగిని ఇద్దరు గట్టిగా పట్టుకున్నారు. అందులో ఒకడు గుమాస్తా, అతనిచేతిలో మడిచిన తాడుంది, రంగికి అప్పుడే దెబ్బలు తగిలుంటాయి. నేను చటుక్కుని పడవదిగి గట్టుమీదికి గెంతాను. ఏం జరిగిందని అడిగాను.

"ఆ దొంగనాకొడుకు పారిపోయాడు, సరుకు ఎత్తుకుపోయాడు. ఈ లంజ ఎక్కడో గట్టుకి తార్చింది పడవని. సుక్కాని పట్టుకుంది లంజ!" గుమాస్తా కోపంగా, చిరాకుగా, నిస్పృహాతో అన్నాడు.

"ఏం పోయాయి?" అని అడిగాను.

"రెండు బెల్లంబుట్టలు, మూడు చింతపండు బుట్టలు. నేనందుకే ఎక్కనివ్వొద్దన్నాను. యజమాని నాకాడ తాడు నష్టమంతాను. ఎక్కడ దింపుకుపోయాడే?"

"కాల్దారి కాడండి! బాబయ్యా!'

"ఛీ లంజా! కాల్దారికాడ మేలుకొనుంటేనే?"

"అయితే నిడదవోలుకాడేనండీ!"

"ఇదిప్పుడు చెప్పదు. రేపు అత్తిల్లో పోలీసోళ్ళ కప్పగిద్దాం! ఎక్కు, పడవెక్కు."

"నన్నిక్కడొగ్గెయ్యండి బాబ్బాబు?"

"ఆట్టే యేసాలెయ్యకు. ఎక్కెక్కు!" గుమాస్తా ఆమెను పడవ్వైపు తోశాడు. ఇద్దరు సరంగులు ఆమెను పడవెక్కించారు. "నిద్దర మొకాలు! జేరారు! సూసుకోవొద్దూ! దానిచేతిలో సుక్కాని ఎవరెట్టమన్నారు? బుద్ధి లేదూ!" గుమాస్తా అందరిమీద విసుక్కుని గదిలోకి

పోయాడు. రంగిని టాపుమీదికి ఎక్కించారు. ఒక సరంగు ఆమె పారిపోకుండా కాపలావున్నాడు. నేనుకూడా టాపు మీదికి ఎక్కాను. పడవ మళ్ళీ కదిలింది. నేను చుట్టముట్టించాను.

"అయ్యగో రో సుట్ట ఇప్పించరూ!" రంగి చనువుగా అడిగింది. నేనో చుట్ట, అగ్గిపెట్టి ఇచ్చాను. ఆమె చుట్ట ముట్టించింది. "మరినీ! నన్ను పోలీసోళ్ళ కప్పగించి ఏం లాబం?"

"గుమాస్తా వొదలడు!" అన్నాడు సరంగు.

"పద్దాలు నీ మొగుడా?" అని అడిగాను.

"మా వోడు" అంది రంగి.

"దీన్ని నెగదీసుకుపోయాడండి! పెళ్ళాడలేదు. ఆడికి ఇంకొకత్తుంది. ఇప్పు డది ఎక్కడుందె?" అన్నాడు సరంగు.

"కొవ్వూరులో ఉంది. రంగూ, పొంగూ బాగుందిప్పుడు. నేను తిన్నన్ని తన్నులుతింటే అదీ నాలాగే అవుద్ది, గుడిసేటి నెంజ."

"మరి నీ కింకా వాడితో ఎందుకు!" అన్నాను నేను.

"ఆడు నావోడండి!" అంది, అంతా అందులో ఉన్నట్టుగా.

"మరి ఇంకొకకత్తితో పోతున్నా డన్నావుగా?"

"నా దగ్గరికి రాకుండా ఎక్కడ పోతాడు? మొగోడికెంతమందయితే మాత్రమేం? ఆడండీ, అయ్యగోరూ! మారాజండి. అల్లాంటి మనిశి లేడండీ మళ్లీనీ."

"బాబో! ఆడిసంగతి మీరింకా ఎరగరు. ఇదెంత రంగుగా ఉండే దనుకున్నారు? ఓతూరండి, దీన్ని గుడిసిలో పెట్టి గుడిసి అంటించేశాడు. మగ్గిపోయిందనుకోండి! ఇంకా దీనికి భూమ్మీది నూకలున్నాయిగాని" అన్నాడు సరంగు.

"అయ్యగోరు! అప్పుడు ఆడు కనమడితే పీకినులిమే ద్దామనుండేది. కాలిన గడ్డోటి ఈపుమీద పడిందండి." ఆమె వెనక్కి తిరిగి రవిక కొంచెం పైకెత్తింది. తెల్లటిమచ్చ ఆ చీకటిలోకూడా స్పష్టంగా కనబడింది.

"మరి నిన్నిల్లాచేస్తుంటే ఇంకా వాణ్ణి పట్టుకు దేవులాడతావేం?" అని అడిగాను.

"ఏం చెయ్యను? ఆడు కంటబడితే అన్నీ మరచిపోయి కరిగిపోతాను. ఎంతజాలిగా మాట్లాడతాడని! ఈ సందాల కొవ్వూరులో బయలుదేరాం. దార్లో నన్ను ఎంతో జాలిగా బతిమలాడాడు. ఈ పడవలో ఎక్కి చేతికిచిక్కిన సరుకు దించి పారెయ్యాలని. నేనుంటేగాని సాగదు. అడ్డదోవని నడిచి మడుగు జేరుకున్నాం..."

"ఎక్కడ దింపేశాడు సరుకు?"

"ఎక్కడో నాకు గుర్తునేదండి."

"దొంగనెంజ!" అన్నాడు నవ్వుతూ సరంగు.

రంగి మొగం చూడాలని నాకు ఎంతో కుతూహలం వేసింది. కాని ఆ కటిక చీకటిలో ఆమె మాయమనిషిలాగ అవ్యక్తంగానే ఉండిపోయింది.

పడవ మెల్లగా పాకుతోంది. నడిరాత్రి గడిచినకొద్దీ గాలి చిరుచలిగా తగులుతోంది. చెట్ల ఆకులు కొద్దిగా కదులు

తున్నాయి. మళ్ళీ పడవని సరంగులు లాగుతున్నారు. నా కింకా నిద్రపట్టలేదు. కొంతసేపటికి కాపలా ఉన్న మనిషి కునికి వరిగి చివరికి నిద్రపోయాడు. రంగిమాత్రం ఇంక పారి పోయే ప్రయత్నం మానుకుంది. తాపీగా చుట్ట కాలుస్తూ కూర్చుంది.

"నీ కసలు పెళ్ళి అవలేదా?" అని అడిగాను నేను.

"లేదు. చిన్నతనంలోనే పద్దాలు నన్ను లేగేసు కొచ్చాడు."

"మీా దేవూరు?"

"ఈంద్రపాలెం...అప్పుడు తాగుతాడని నాకు తెలదు...ఇప్పుడు నేనూ తాగుతా ననుకోండి. తాగితే తప్పు లేదు. తాగి సావగొడతాడు."

"మరి వాడిలి వెళ్ళకపోయావా?"

"తన్నులు తిన్నప్పు డల్లాగనిపిత్తది. అయినా అంతటి మనిసి లేడండి. మీారెరగరు. ఉత్తప్పుడండి, యెన్నలా కరిగి పోతాడు. వొందమందితో పోయినాసరే ఆడు నా కాడి కొచ్చి తీరతాడు. నేను లేకపోతే గుండగిలి సచ్చిపోడూ?"

నాకు వింతగా అనిపించింది ఆ అమ్మితత్వం. వాళ్ళిద్ద రికీ మధ్యవున్న అనుబంధం ఎల్లాంటిదో నాకు అర్ధంకాలేదు. రంగి మళ్ళీ చెప్పడం మొదలుపెట్టింది.

"మా కిద్దరికీ ఏపనీ సరిపడిందికాదు. సిగురికి ఇలా దొంగతనాల్లోకి దిగాం. మాయమ్మొండేది, మొన్నే సచ్చి పోయింది. నన్ను తిడుతుండేది. ఓనాడండీ, నా గుడిసికి ఆ సెంజని తీసుకొచ్చాడు."

"ఎవరిని?"

"ఇప్పుడున్న గుంటని. నా యెదురుగుండా, నా యింట్లో దాంతో తొంగున్నాడు, నా కళ్ళెదర! చిత్తుగా తాగొచ్చాడు, అదీ తాగింది. నా సయితి! దానిమీద పడి పీకాను. ఆడు నన్ను సావదన్నాడు. అద్దరేత్తిరికాడ నాన్నెక్కడికో తీసుకుపోయాడు. మళ్లీ వొచ్చాడు. నేను తిట్టాను. ఇంటోకి రావద్దన్నాను. గుమ్మంకాడ కూకుని పిల్లోడికన్నా జాలిగా ఏడిచాడు. నా గుండి కరిగిపోయింది. నేను దగ్గరగా జేరితే నన్ను వొళ్లోకి తీసుకొని నా నానుపేట ఇమ్మన్నాడు. ఎందుకన్నాను. ఆ గుంట తెమ్మం దన్నాడు. నాకు ఒళ్ళు తెలదు. నానాతిట్లు తిట్టాను. ఏడిచాడు. ఆగుంట లేకపోతే బతకలేనన్నాడు. నాకోపం ఎక్కువైపోయింది. గుమ్మంలోంచి గెంటి తలుపేసుకున్నాను. తలుపు గుంజిగుంజి సివరికి ఎల్లిపోయాడు. నాకు శానాసేపు నిద్దర రాలేదు. కొంచెం కునుకుపట్టేతలికి ఇల్లంటుకొంది. తలుపుపైన గొళ్ళే మేసి నడికొప్పంటించాడు. ఎవరూ రాలేదు. నడిరాత్తిరి. నావొళ్ళంతా మగ్గిపోయింది. తలుపు గుంజిగుంజి ఇంక తెలివి తప్పింది. ఇంతలో అవతల్నించి తలుపుతెరిచారు. మన్నాడు ఆణ్ణి పోలీసోళ్ళట్టుకున్నారు. ఎవరిమీద అనుమానముందో నన్ను చెప్పమన్నారు. ఆడుమాత్రం కాదని ఖచ్చితంగా చెప్పేశాను. సందేల నాకాడకొచ్చి, ఎంతో జాలిగా ఏడిచాడు. తాగినప్పుడల్లా ఏడుస్తాడు. ఉత్తప్పుడసలు ఏడుపే రాదు. నవ్వుతుంటాడు. సుక్కడితే సాలు, ఏడుపే. పిల్లోడిలా ఎక్కువగా ఏడుస్తాడు. నా నానుపేట లిచ్చేశాను."

"నువ్వింకా వాడితో ఎందుకు దిగుతావు ఈ దొంగ తనాల్లోకి?"

"ఏం జెయ్యమంటారు? అదొచ్చి గోలెడితే?"

"మరి నిన్ను విజయనగరం అక్కడికీ తీసుకొని వెళ్తా డన్నావు"

"వొట్టిది ఊరికే అలా సెప్పాను. నే నంటే కొంచెం సరంగులికి నమ్మకం. ఇదిగాక రెండుతూర్లు ఈ పడవలో దొంగతనం జరిగింది."

"నిన్ను పోలీసులు పట్టుకుంటే ఏంజేస్తావు?"

"ఏమీ చెయ్యను. నన్ను పట్టుకు నేం జేత్తారు? నా కాడ దొంగసొమ్ము లేదు. ఏమో ఎవరెత్తుకుపొయ్యారో, ఓ రోజు కొడతారు. మన్నాడొగ్గెత్తారు."

"పద్దాలుని పట్టుకుంటే? ఆ దొంగసొమ్ముతో దొరికి పోతే?"

"ఆడు దొరకడు. ఈపాటికంతా అయిపోద్ది. ఆడు దొరక్కుండానే నేను పడవలో ఉండిపోతా."

ఆమె నిట్టూర్పు విడిచి మళ్ళీ మెల్లగా తనలో తను అనుకున్నట్టు చెప్పింది.

"ఈ సొమ్మంతా మళ్ళీ ఆ గుంటకే దక్కుదు. దాని మీద మోజు తగ్గిదాకా దాన్నొదలడు. నాకు ఈ కట్టా లన్నీని. దొంగనెంజ! నా ఉసురోసుకుంటుంది."

ఆ మాటల్లో నిజంగా ఉద్రేకమేమీ లేదు. ఆమె అతన్ని ఉన్నవాణ్ణి ఉన్నట్టుగా అంగీకరించింది. పద్దాలుకోసం ఆమె ఎలాంటి పనన్నా చెయ్యడానికి సిద్ధంగా ఉంది. అది

ఒక ఆదర్శమూ కాదు, భక్తీ కాదు, ప్రేమా కాదు. ఎన్నో చిత్రమయిన సంకీర్ణ భావాలతో, ఈసులతో, అనురాగాలతో ఎన్నిటితోనో కలిసిన స్త్రీహృదయం! అయినా ఆ హృదయం అన్నిటికీ ఫలితంగా ఒకేచోట లగ్నమయి ఉంది. తన మగవాడికోసం ఆమె నిరంతరం తపిస్తుంది, కాని అతడు నిర్దుష్టంగా, నీతిగా నడుచుకోవాలని ఆమెకు పట్టింపు లేదు. అతని సుగుణాలతో, అవగుణాలతో అతన్ని ఆమె అంగీకరించింది. నాకామె బ్రతుకు బరు వనిపించింది. నిజానికి నా బ్రతుకే బరువేమో అంతకంటే.

గాలి అంతకంతకీ బాగా వీస్తోంది. పడవ కొంచెం వేగంగా పోతోంది. అలసట తీర్చుకున్నలోకం నిద్ర మేలు కొంటోంది. అక్కడక్కడ పాలికాపులు పొలంగట్లని నడుస్తూ కనబడుతున్నారు. వేగుచుక్క ఇంకా పొడవలేదు. రంగి మోకాళ్ళు ముడుచుకొని ఎటో అవ్యక్తంగా చూస్తోంది.

"ఆడు నావోడు! ఎన్నితిరుగుళ్ళు తిరిగినా నావోడు నా దగ్గరకే వొత్తాడు" అని తనలోతను అనుకుంది. అందులో ఒక ఆశ, ఒక ధైర్యం, ఒక విశ్వాసం తొణికిసలాడాయి. ఆ మాట ఆమెజీవితసర్వస్వానికీ కేంద్రంలాగాఅవుపించింది. నేను భయంతో, భక్తితో, జాలితో ఆమాట విని ఊరుకున్నాను. అలాగ తెల్లవారిదాకా మే మిద్దరం కూర్చున్నాం.

నేను పడవ దిగిపోయేముందు జేబులోంచి ఒక రూపాయితీసి చటుకుని ఆమె చేతిలో పెట్టి తొందరగా ఊళ్ళోకి పోయాను. ఆమె జవాబు చెప్పేదాకా నేను నిలబడ లేదు. ఆమెసంగతి తరువాత ఏంజరిగిందో నాకు తెలియదు.

బుచ్చిబాబు

# నా మీద కథ వ్రాయవూ?

బుచ్చిబాబు కథాశిల్పంలో మామ్, హెమ్మింగ్‌వేల ప్రభావం ఎక్కువగా గోచరిస్తుంది. భావాల్లో ఆల్డస్ హక్సలే, బెర్ట్రాండ్ రసెల్ అక్కడక్కడ కనిపిస్తాం టారు. బుచ్చిబాబు కథల్లో అడుగడుక్కీ పాశ్చాత్య భావనా ధోరణి అగుపడుతుంది. వీరి 'చివరికి మిగిలేది' నవల, జీవితం గురించి గొప్ప వేదాంతం బోధిస్తుంది.

"నన్ను గురించి కథ వ్రాయవూ?" అని అడిగింది కుముదం.

ఈ ప్రశ్న నాకు కొంత ఆశ్చర్యం కలగజేసింది. ఎందుకంటే కొద్ది మార్పుతో ఇదే ప్రశ్న ఎనిమిది సంవత్సరాల క్రితం అడిగింది. నాకు బాగా జ్ఞాపకం. మా మేనమామ గారింట్లో కుముదం తండ్రి కాపురం వుండేవాడు. అద్దెతీసుకు రమ్మని అప్పుడప్పుడు నన్ను పంపేది మా అత్తయ్య. ఆరోజు సాయంత్రం కర్రకు మేకు దిగేసి, ఇనపచక్రం దొర్లించు

కుంటూ, దొడ్లో పరుగులెత్తింది కుముదం. నాకప్పుడు పన్నెండో ఏడు. ఆమె నాకంటె రెండు సంవత్సరాలు చిన్నదని వాళ్ళమ్మ నాకు చెప్పింది. నేను అద్దెమూట మరిచి కుముదంతో కబుర్లు చెబుతూ కూర్చునేవాడిని. చెట్టెక్కి జామపండ్లు కోసిపెట్టమని వేధించుకు తినేది. పూర్తిగా పండని జామపండు రంగులా వుండేది ఆపిల్ల ఛాయ. నేనేవో కల్పించి కథలకింద చెప్పేవాడిని. వీటిల్లో నాయికలు మావూళ్ళో యిరుగుపొరుగు అమ్మాయిలు. ఈ కబుర్లు, అమాయకంగా చూస్తూవిన్నా, కుముదం కళ్ళల్లో ఎక్కడో యీర్ష్య మసగగా మెదిలినట్లు భ్రమించి, నేను గర్వపడేవాడిని. అతిశయోక్తి, కథకుడి జన్మలక్షణం కాబోలు! యథార్థ విషయాలు మానేసి, కల్పిత గాథలను, యదార్థాలుగా చెప్పడం ఊహా సృష్టి లక్షణం అనుకుంటా. ఇవన్నీ కుముదం నమ్మినట్లుగా నే కొంటెగా నిట్టూర్పు విడిచేది. నేనూ, యీ వ్యక్తులు, ఘట్టాలు యథార్థాలుగా స్మరించుకొని, తెచ్చిపెట్టుకున్న మౌనంలో పడేవాడిని. ఆ నిశ్శబ్దంలో కుముదం కంఠం వినిపించింది. "నన్నుగురించి కథ చెప్పవూ?" అంది. ఆ ప్రశ్న వెయ్యకపోతే, ఆమె కథ మరొకరిదగ్గర చెప్పి వుందునేమో నాకు తెలీదు. నే అనుకోడం ఆమెకథ ఎవరితోనూ చెప్పి వుండను. ఎందుకంటే, ఆమె నిజంగా మనిషి – ఊహాలో వ్యక్తి కాదు.

అదే ప్రశ్న మళ్లా అడగడం నాకు ఆశ్చర్యం కలగ జేసింది. ఐనా నేను కథలు వ్రాస్తానన్న సంగతి ఆమెకెట్లా తెలుసో నాకర్థంకాలేదు. నాకథలు, వొకటి రెండు తప్ప

అచ్చు కాలేదు; వాటిని గురించి నే నెవ్వరితోనూ ముచ్చటించలేదు. ఇరవై సంవత్సరాల యువక అజ్ఞానంలోవున్న నన్ను ఎన్నుకోతగ్గ రచయితగా యీ సంఘం గుర్తించిందని నాభయం. ముదుసలే జ్ఞాని కాగలడని భారతీయుల వెర్రి నమ్మకం. పెద్దలన్నా, ప్రాచీనులన్నా, పాతవిషయాలన్నా, మనవాళ్ళకి అంత గౌరవం. ఒక విషయం మంచిదా చెడ్డదా అన్న తార్కిక సంశయాలకి మన సంఘంలో అంతగా తావు లేదు. ఎట్లొచ్చీ ఆవిషయాన్ని ప్రతిపాదించిన వ్యక్తి మృతుడై వుండాలి.

శక్తిగలవాళ్ళు ధనార్జనలోనూ, అది లేనివాళ్ళు దైవంలోను లీనమైన యీ దేశంలో కథకుడికి విలువలేదని నేనా రోజుల్లో నమ్మేవాడిని. నేను వ్రాసి తగలపెట్టిన రచనలతో నన్ను మరో దేశంలో బ్రహ్మరథం పడుదురు. సంఘం గుర్తించదన్న భయ మొకటేకాదు, నేను కథలు వ్రాయక పోవడానికి కారణం; నా రచనావిధానానికి పరిపక్వం రాలేదని కూడా నే లోపల అనుకునేవాడిని; నా సృష్టిశక్తుల్ని రగిల్చి నన్ను తన్మయుణ్ణి చేసి నాజీవితంపై వొత్తిడి కలిగించే వ్యక్తులుకాని, నా రచనల్ని చదివి, వాటిల్లోని లోతులకి దిగబ్రాకి తాత్కాలికంగానైనా ధన్యత చెందే వ్యక్తులుకాని ఆనాటి వరకూ లేరని నాకు తెలుసు. ప్రపంచాన్ని పరిశీలిస్తూ, వ్యక్తుల మంచి చెడ్డలని, వింతప్రవర్తనని ప్రేక్షకుడుగా అనుభవించి అర్థంచేసుకుని, అల్లా సంపాదించిన ఆంతరంగిక జ్ఞానాన్ని నా తాత్విక దృష్టిలో మేళవించి, వార్థక్యంలో మహత్తర గ్రంథం వ్రాసి, మరణించాలని నా ఆదర్శం. ఈ

రెంటిలో ఒకటైనా జరిగి తీరుతుంది. మహోత్తర గ్రంథం వ్రాయలేకపోవచ్చు; కాని మరణంమాత్రం తప్పదన్న ధైర్యం నాకో నూతన్న వుత్సాహాన్ని ప్రసాదించింది. ఆరోజుల్లో, "నన్ను గురించి కథవ్రాయవూ?" అనే ప్రశ్న స్త్రీ నోటి నుండి వినడం అదే మొదటిసారి. తన వ్యక్తిత్వాన్ని గుర్తించుకుని, దాని ప్రభావాన్ని ఇతరులకి తెలియచెయ్యాలన్న స్త్రీని మొట్టమొదట కుముదంలో చూడగలిగాను. ఆమె ఒక జీవి; ప్రత్యేకమైన వునికిగలది. ఆమెని తొలిగిస్తే ప్రపంచంలో కొంత పవిత్రమైన ఖాళీ ఏర్పడుతుంది. నే చూసిన స్త్రీలు వివాహం జరిగిన రోజునే జన్మించినవాళ్లు. భర్తని పొడిగిస్తే, స్త్రీ పోతుంది; యింకా పొడిగిస్తే భర్త సంతానంగా మారతాడు; అతను గతించగానే ఆమె స్థూలజీవితం సమాప్త మౌతుంది. సృష్టిని ఆహ్వానిస్తూ తెరుచుకున్న తలుపులు భారతస్త్రీలు. తెరుచుకోని తలుపులు లేవు. ఏదైనా ఒక తలుపు తెరుచుకోనినాడు, దాన్నిగురించి చెప్పుకోని, మరమ్మత్తు సంకల్పించాలి. మరమ్మత్తుచేసినా బాగుపడని తలుపులను నిర్మూలం చెయ్యాలా, లేక వేరే పనులకు వుపయోగించుకోవాలా అన్న సందేహాన్ని సంస్కర్తలు తీర్చాలి. కథకుడు, ఏం చెడిపోయిందో చెప్పగలడు; వీలైతే మిగిలినదానితోనే తృప్తిపడుతూ, యితరులకు ఆ విషయం నేర్పగలడు; కాని బాగుచేసే విధానాలతో అతనికి నిమిత్తం లేదు.

"నీలో ఏముందని నిన్నుగురించి కథ వ్రాయనూ?" అన్నాను. అట్లా అన్నందుకు పశ్చాత్తాప పడినా, ఆ ప్రశ్న

నా నమ్మకాన్ని, ఆశయాలనీ యథార్థంగా వ్యక్తపరుస్తుంది. ఆమెలో కథావస్తువుగా వుండేటంతటి విశేషం వొక్కటి కూడాలేదు. చూడడానికి చాలా సామాన్యంగా వుంటుంది; పల్చటి శరీరం; వేసంగిలో వర్షంకురిసేముందు దట్టంగా అల్లుకున్న మబ్బురంగు శరీరచ్ఛాయ; సంపూర్ణంగా వికసించని అవయవాలు; ఎవరో దువ్వినట్లుగా ఉండే జడకట్టు; చూసిన వస్తువులు తనకోసం కానట్టు చాంచల్యంగా, మెరిసే బలహీనమైన కనురెప్పలకింద మంచులో కదిలిపోయిన కుందేలులా మెరిసే నేత్రాలు; కంఠంలో కొలవడానికి వీలుగావుండే పచ్చటి నాళాలు; నీడ కనిపించినట్లు స్ఫురించే వక్షం; శరీరంలో పైభాగాన్ని మోసేటందుకు వోపిక లేనట్టి అల్పమైన నడుం. కుముదం సాధారణమైన స్త్రీ. ఎవరూ - తుదకి వాళ్ళమ్మ కూడ - ఆమె అందమైందని చెప్పుకోడం నే నెరగను. అందుకనే ఆమెలో నేనేమీ విశేషం చూడలేకపోయ్యానేమో!

"నాలో ఏముండాలి?"

"ఒక ప్రత్యేకత; అందరిలోనూ లేని వొక్క నూతన లక్షణంవున్నా సరే-"

వేలునున్న వుంగరాన్ని చూచి దాన్ని వేళ్ళతో తిప్పింది. పోతపోసి పదును పెట్టినట్లుగా చలించే వేళ్లు ఆమెవి. ఏ అవయవం కదిలినా, శరీరంలోని శక్తంతా దానిలో పూరించినట్లుగా వుంటుంది. ఒక వొస్తువు కేసి చూస్తూన్నప్పుడు, పంచప్రాణాలు కళ్ళల్లోకి పరిగెత్తుకొచ్చినంత తీవ్రంగా చూస్తుంది. సిగ్గుపడితే రక్తం చెక్కిళ్ళలో నుంచి తొంగి

చూస్తున్నట్లుంటుంది. కాని కుముదాన్ని వర్ణించినంత మాత్రాన కథౌతుందా?

"నీ పెండ్లికి నన్ను పిలవలేదేం?" అని అడిగాను.

"మా అమ్మ నీకూ శుభలేఖ పంపానంది - వొస్తే నలుగుర్నీ చూసి, ఏమన్నావుంటే కథేనా వ్రాద్దువుగా" అంది.

"నేను తమాషాకి అనడంలేదు. సాధారణ వ్యక్తులను గురించి వ్రాసేటందుకు ఏముంది? పదిమందీ ఒకేలాగున్నప్పుడు వారిలో ఏ ఒక్కర్నీ గురించి చెప్పుకోం. కాని, అందులో ఏ ఒక్కడైనా, పదిమంది చేసినదానికి వ్యతిరేకంగా చేస్తే అతన్ని గురించి చెప్పుకుంటారు. అట్లాంటి వ్యక్తులని గురించి వ్రాయొచ్చు" అన్నాను.

"అయితే అందరూ చేసినదానికి విరుద్ధంగా చేసేవాళ్లే మనుషులన్నమాట..."

"నే అల్లా అనను. అట్లాంటి వాళ్లు చెప్పుకోదగ్గ మనుషులంటాను."

ఎక్కడో ఎప్పుడో పుట్టడం, ఎవరో ఎవర్నో వొప్పగిస్తే వార్ని పెళ్ళాడడం, ఎందుకో తెలీకండా పిల్లల్ని కనడం, ఎప్పుడో ఎక్కడో చచ్చిపోవడం - ఇది చాలా మంది చేస్తున్నది. దీన్ని గురించి కథగా చెప్పుకునేందుకు ఏముంది? ప్రత్యేకత, వ్యక్తిత్వం లేని యీ జీవితాలు ప్రశాంతాన్ని పొందుతున్నాయి; కాని, అది బురదగుంటలో పురుగు పొందే ప్రశాంతం. సంఘాన్ని ధిక్కరించి, సాంప్రదాయాలపై విప్లవం చేసి, యితరులకి అవగాహన కాని కొత్తవిలువని సాధించి

పొందినవాడే ధన్యజీవి. వ్యర్థజీవులు సంఘం అల్లిన వలలో చిక్కుకొని, మర్యాద పేరు చెప్పుకొని కుళ్ళిపోతారు. స్థాపితమైన ఆదర్శాలపై విప్లవం చేసినవాడు, సంఘాన్ని తనవైపుకి మరల్చ యత్నిస్తాడు. కాబట్టి సంఘాభివృద్ధి అల్లాంటి వాళ్ళపై ఆధారపడుతుంది. కుముదంలో ఈ విప్లవచిహ్నం వొక్కటికూడా లేదు.

ఆమె చదువుకోలేదు; సంగీతం నేర్చుకోలేదు. కనీసం కూనిదీర్ఘాలు తీసినట్లుగానేనా కనిపించదు. జ్ఞానం వొచ్చిం తర్వాత ప్రేమించి - చేసుకున్న పెండ్లికాదు; గొప్పస్థితిపరురాలుకాదు; పోనీ బాగా బీదదికాదు, సానుభూతి చూపేటందు కేనా; చక్కంది కాదు, పద్యాలు రాద్దామంటే; అనాకారికాదు, వికృతాన్ని చిత్రాద్దామంటే; మంచివాళ్ళని గురించి వ్రాయొచ్చు; చెడ్డవాళ్ళని గురించి వ్రాయొచ్చు; కాని సాధారణమైన వాళ్ళనిగురించి వ్రాయడం ఎంతో కష్టం. అసలు వ్రాసేటందుకు ఏముంది?

కొందరు వ్యక్తులు తల్లి దండ్రుల చర్యలవల్ల ఖ్యాతికెక్కుతారు. కుముదం ఆ తెగకిచెందదు. వాళ్ళ తండ్రి చనిపోయ్యాడు, తల్లి ఏ వూళ్ళోనో కొడుకుదగ్గరవుంది. వాళ్ళ కుటుంబానికి చరిత్ర లేదు.

"మీా ఆయన ఏం చేస్తున్నాడు?"

"ఎల్. టి. చదువుతున్నారు."

"స్కూల్ మాస్టరవుతాడన్నమాట - ఏ పనీ దొరకనివారికి అదే శరణు. మంచివాడేనా?"

నవ్వింది. ''మంచి అంటే ఏమిటో నాకేం తెలుసు? నీకు తెలియాలి, కథలు రాసేవాడవు.''

''ఓస్? చెప్పడం కాబోలు. అది కాదు కుముదం. అందర్లాగే కాపరాని కెళ్ళి పిల్లల్నికంటే ఏం ప్రయోజనం? ఏదో వో గొప్ప కార్యం సాధించాలి; సంఘాన్ని ముందుకు నెట్టాలి. ఇక్కడికే భారతమాత యీ సంతానాన్ని పోషించ లేక పోతోంది.''

''నా కింకా పిల్లలు లేరు. అయితే ప్రతిఆడదీ పెండ్లి చేసుకోకుండా, పెళ్ళి పందిళ్ళలో పికెటింగ్ చెయ్యాలం టావా?''

''పెళ్ళి వొద్దని నే ననడంలేదు. వివాహం స్త్రీ జీవి తంలో ప్రధానఘట్టం. అందులో నువ్వు సాధించింది ఏముంది? ప్రేమా? సౌఖ్యమా? ఆధ్యాత్మికమా? దేశభక్తా? ఏదీలేదు'' అన్నాను.

''పెండ్లి చేసుకున్న ప్రతిస్త్రీ భర్తను వొదిలేస్తే నువ్వు కథలు వ్రాస్తానంటావ్. అంతేనా?''

అంత పచ్చిగా అడగినందుకు నాకు రోషం వొచ్చింది.

''వొదిలేస్తే చాలదు - మరో గొప్ప విలువని సాధించాలి.''

''అంటే?''

''ప్రేమలేని వివాహానికి విలువ లేదనుకుంటాను.''

''నీకేం తెలుస్తుంది? నీకు పెళ్ళికాలేదు.''

''ఆ విలువని సాధించగల్గితేనే వివాహానికి అర్థం వుంటుంది.''

"అట్లాగైతే, ప్రతిస్త్రీ భర్తను వొదిలేసి మరోడితో వుండాలందూ, ప్రేమను సాధించేందుకు?"

అట్లా అడిగినందుకు నాకు నవ్వొచ్చింది. "దానికోసం ఆ త్యాగం చెయ్యగలిగితేనే మెచ్చుగుంటాను" అన్నాను.

కుముదం మాట్లాడలేదు. ఈ భావాలు ఎంత వరకూ ఆమెని కలవరపెట్టాయో నాకు తెలీదు. స్త్రీ ప్రకృతిపైన వొత్తిడి కలిగించేది, భావాలో, సహజమైన ఉద్రేకమో నేను చెప్పలేను. అది తెలిస్తే స్త్రీహృదయం అర్థం చేసుకున్నట్లే.

"కాని... కాని..." మాటలకోసం తడుముకుంటూ, నిదానించింది.

"ఏమిటి నీ సందేహం?"

"ఏమీలేదు. నాకేదో చెప్పాలనుంది. ఎట్లా చెప్పాలో తెలీడంలేదు, నే చదువుకున్నదాన్ని కాదు. ఉండు, ఆలోచించనీ....."

నేను ఆమెకళ్ళ కేసి చూస్తూకూర్చున్నాను. నిదానించి చూస్తే ఆమె మొహంలో వొక చెప్పరాని ఆకర్షణ వుంది. వొంపులు, ఎత్తు పల్లాలు సూర్యరశ్మి సోకినప్పుడు తీర్చినట్లుగా విప్పారుకున్నాయి. ఆ కళ్లు ఆమెకి వుపయోగం లేవు కాబోలు, మనుషులకి ఆత్మ వుందో లేదో నాకు తెలీదు కాని, ఆమెకి మాత్రం లేనట్లు నాకనిపించింది. మరో లోకంలో ఆత్మని మరచిపోయి, శరీరాన్ని తనిష్టం లేకుండానే ఇక్కడికి రప్పించినట్లు చలిస్తుంది. ఈ ప్రపంచంలో మూసుగుని మరోలోకంలో తెరచుకొన్న నేత్రాలు ఆమెవి.

"కాని... కాని... సూర్యుడు, చంద్రుడూ - ఎప్పుడూ

చూస్తుంటాను, కాని ప్రతిసారి ఎందుకో క్రొత్తగా కనబడ తాయి. మంచినీళ్లు రోజూ త్రాగుతాను. కాని ప్రతిసారి ఎంతో క్రొత్తగావుంటాయి...నక్షత్రాలు..."

నేను వెడతానని లేచాను.

"నక్షత్రాలు...ఉ...మంచిది..," ఆమెని గురించి ఏం కథ వ్రాయనూ?

* * *

క్రితంసారి మేం కలుసుగుని నాలుగేండ్లయింది. ఈ సారి కుముదంగారి అద్దికోసమే వెళ్ళలేదు. వేరే పనుండి వెళ్లాను. మధ్యాహ్నం రెండుగంటలు దాటింది. నడివే సంగి, ఎండ నన్ను నీడకి తరిమింది. పోస్టాఫీసు ప్రక్కనున్న మామయ్యగారింటికి ఎప్పుడూ దొడ్డిదోవన వెళ్ళడం అల వాటుచొప్పున, ఆనాడుకూడా అల్లాగే వెళ్లాను.

కుముదం మండువాలో గచ్చుమీద కూర్చుని అనాస పండు తరిగి వెండిపళ్ళెంలో వేస్తోంది. నారింజపండు రంగు చీర కట్టుకుంది; నన్నుచూచి లేవడంలో పమిటజారింది. నాకర్థమైనట్లు నవ్వి వెనక్కి తిరిగి లోపలికెళ్ళి వోక కుర్చీ అమిర్చి కూచోమని సంజ్ఞ చేసింది. నే చూసినదృశ్యం నాకిది వరకులేని కొత్త చనువు నిచ్చిందని వొప్పుకోకతప్పదు. మనిషి శీలానికి వ్యక్తిత్వానికి మొహం వొక్కటే నిదర్శనం కాదనుకుంటాను. కొన్ని ఆకస్మికదృశ్యాలు, జీవితకాలం పరిశీలించినా బోధపడని ఆంతరంగికాలని తేటపరుస్తాయి కాబోలు.

కుర్చీలో కూర్చోగానే పటుక్కుమంది పాతకుర్చీ. లేచి సర్దుకున్నాను. కుముదం పమిటని పళ్ళమధ్య బిగించి నవ్వుని ఆపుకుంటోంది.

"అన్ని కుర్చీలమాదిరి నిన్ను భరించి వూరుకోక, విరిగి, కొత్తదారి తీసింది చూచావా! దానికథ వ్రాయవూ?..." అంది. నాకూ నవ్వొచ్చింది. చాప మీద కూర్చుని స్తంభానికి జార్లబడ్డాను.

"మనం కలుసుకుని దగ్గరదగ్గర నాలుగేళ్ళయింది. తెలుసా? నే నివన్నీ మరిచిపోయ్యాను. నీకింకా ఎట్లా జ్ఞాపకం వుందీ?" అన్నా ప్రశ్నార్థంగా.

"ఏమో, నువ్వు జీవితాన్ని పరిశీలిస్తావు. నేను అనుభవిస్తాను. ఏమో," అన్నది.

ఆమెకి జీవితం అనుభవించడం అంటే ఏమిటో తెలీదని నా నమ్మకం. కాలం ఆమెపై ఎట్లాంటిమార్పూ తేలేకపోయింది. ఇదివరకు చూసినప్పటికంటె యీసారి ఎక్కువ ఛలాకీ, యవ్వనోద్రేకం చూపగలిగింది. ఆమెలో ఆకర్షణీయమైంది ఎడ తెగని యవ్వనమేమో ననిపిస్తుంది. యవ్వనం వొక్కసారి తనశక్తిని ప్రకటించకుండా, నిలిపి నిలిపి ప్రజ్వలించినట్లుగా గోచరిస్తుంది. కొన్ని ఉపమానాలు మన నాగరిక సాంప్రదాయాలకి విరుద్ధమని జంకుతున్నాగాని, లేకపోతే ఆమె శరీరాన్ని గుఱ్ఱంపిల్ల కదలికలోని లావణ్యంతో పోల్చొచ్చు. లేడిగంతులో శృంగారం వుందికాని, బలం లేదు. కుక్కపిల్ల గంతులో కొంటెతనం వుందికాని శక్తి లేదు. మేకపిల్ల గంతులో వేగం వుందికాని మృదుత్వం

లేదు. ఇవన్నీ గుజ్జంపిల్ల అలిగిననాడు చేసిన నాట్యంలో వున్నాయి.

''నువ్వూ, మీ ఆయనా కులాసాగా వుంటున్నారా?'' అన్నాను, ఏమనడానికి తోచక.

''నీ దయవల్ల.''

''ఇంకా నిన్ను గురించి బోలెడు వినాలనుంది.''

''నన్ను గురించి వినేందుకేముంది. మాది సామాన్య బ్రతుకు'' అంది నీరసంగా.

''అప్పుడే జీవితంపైన విసుగుపుట్టిందా?'' అన్నాను.

''ఈ ప్రశ్నలు నన్నింతవరకూ బాధించడంలేదు. నీమాట చెప్పు. ఏం చేస్తున్నావూ? ఎక్కడున్నావూ? ఎల్లావున్నావూ?...''

మనదేశంలో చదువుకున్న యువకుణ్ణి ఏం చేస్తున్నావూ? - అని అడగడంకంటె ఎక్కువ అపచారంలేదు. పాపం, అల్లా అడిగినవాళ్ళందరూ మామేలు కోరే వారే; కాని, దానికి సమాధానం చెప్పడంలో ఉద్యోగంలేని యువకుడు ఎంత బాధపడతాడో పెద్దవాళ్ళకి తెలీదు. ఏమీ చెయ్యడం లేదని చెప్పడం నాకుచిన్నతనంగా తోచి ''ఏమి లేదు - కథలు వ్రాయడం మొదలుపెట్టాను'' అన్నాను.

''నన్నుగురించా?''

నవ్వుకున్నాను. పడుతూ, నడుస్తూ, పడుతూ, చంటిపిల్ల చక్కావచ్చి అర్థంలేకుండా ఏడవడం మొదలెట్టింది. నేనాశ్చర్యపడ్డాను.

"మాపాపాయి. ఇంక రెండు నెల్లకి మూడ్లో ఏడో స్తుంది" అంది కొద్దిగర్వంతో.

"నా కెప్పుడూ చెప్పలేదే? ఈ సంగతే తెలీదు" అని ఆశ్చర్యం దిగమింగుకోలేక పోయాను.

"నీకు తెలియజేసేటందుకు యిందులో ఏం విశేష ముంది? ఇది సాధారణంగా అందరికి జరిగే పనేకదా! నీకీ విషయం వేరే నేచెప్పాలా?" అంది. ఆమె అంతవరకూ తన పిల్లనిగురించి చెప్పకపోడం చూస్తే నాకు మరీ ఆశ్చర్యం కలిగింది.

"దానికో పాపాయిపుడుతుంది. ఎప్పుడో, ఎక్కడో. అది ఎవర్నో, ఎక్కడో పెండ్లి చేసుకుంటే దానికి మరో పాపాయి, ఎప్పుడో, ఎక్కడో పుడుతుంది. అలాజరిగి పోతుంది. ఇందులో ఆశ్చర్యపడే అసాధారణం ఏముంది...?"

కుముదంలో మాతృత్వం తాలూకు చిహ్నాలేవీ నాకు కనబడలేదు. పిల్లలని చూసుకుని తల్లులుపడే గర్వం ఆమెలో లేదు. ఆ ప్రశంస ఎత్తాలని ఆమెకు తట్టనేలేదు; ఆమె శరీరపటుత్వాన్ని చూస్తే, ఆమె యీపిల్లలని కన్నదా అనిపించింది. పిల్లలూ, భర్తా, సంసారం, - యివేవీ ఆమె నిజశరీరాన్ని తాకి పంచుకున్నట్లులేదు.

"నీ పోలికా, వాళ్ళ నాన్న పోలికా?"

"ఏమో నీకే తెలియాలి."

"నా కెట్లా తెలుస్తుంది. నేను వాళ్ళ నాన్నని చూడనే లేదుగా."

"వీధులో వున్నారు చూడకూడదూ?" వీధులో

అరుగు మీాద విద్యార్థులతో ఆయనపడుతున్న అవస్థ నాకు వినపడుతునే వుంది. వెళ్ళేటప్పుడు చూడొచ్చు ననుకున్నాను. కుముదం పిల్లని లోపలికి తీసుకెళ్ళిపోయింది. ఆకులో అనాసముక్కలుంచి, మంచినీళ్లు పెట్టింది.

''పాపం, ఎండలో వొచ్చావు. నీ మొహం మాడిపోయింది.''

''నిజంగా?''

''మనం పెద్దవాళ్ళమైపోతున్నాం కదూ?''

''నామాట తెలీదుకాని, నువ్వుమాత్రం యింకా చిన్నదానవవుతున్నావు'' అన్నాను.

''అది అబద్ధం. ప్రకృతి విరుద్ధం.'' కొంతసేపు ఎవ్వరం మాట్లాడలేదు. ఎందుకో కొన్ని కొన్ని సమయాలలో ఆమెతో మాట్లాడుతున్నప్పుడు, బుర్ర ఖాళీ ఐపోతుంది. సిగరెట్టు పీలుస్తూ, చీట్లాడుకుంటున్న సమయంలో అమాంతం గదిలోకి చిరతపులి వొచ్చినప్పుడు, బుర్ర ఎట్లా పనిచెయ్యదో, అట్లాగే ఆమెతో సంభాషణ.

''దేశంలో సంతానం ఎక్కువై పోతున్నారు. యిట్లా పది సంవత్సరాలు జరిగిందంటే తినేందుకు తిండి వుండదంటున్నారు సాంఖ్యశాస్త్రవేత్తలు తెలుసా?'' అన్నాను.

''అది నాకు తెలీదు. కాని మనం ప్రకృతికి దాస్యం చెయ్యడం తప్పదు. దాస్యం నేను సహించలేను. కాని అది తప్పదనుకుంటాను. నేను ఎదురు తిరగలేక కాదు; కాని నా కదిష్టంలేదు. జీవితానికి తలవొగ్గి, ప్రపంచాన్ని అంగీకరిసాను.''

"అదే పొరబాటు. అంగీకారం ఆదర్శాలు లేని వ్యర్థజీవి విముఖత్వం."

"కావొచ్చు. సృష్టిలో నేనెంతో అల్పురాలనని తోటివాడవైన నీకే సామాన్యంగా కనుపించినప్పుడు, సృష్టిముందు నేనేం తిరుగుబాటు చెయ్యగలను చెప్పు."

వెడతా' నని లేచాను.

"అద్దె తీసుకురానా?" అంది. "నేను దానికోసం రాలేదు. మనియార్డరు చెయ్యొచ్చు."

పాపిష్టి డబ్బుని ఆమె చేతులు తాకటం నా కిష్టంలేదు. ఆమెభర్తని చూడడం కూడా మరచి, బైటకి నడిచాను. నన్ను కుముదం వెనక్కి పిలుస్తుందనుకున్నా. అట్లా పిలవ లేదు. నా వెనకాల దొడ్డితలుపు గడియ మూసిన చప్పుడు వినిపించింది.

కుముదాన్ని గురించి ఏం కథ వ్రాయనూ?

* * *

ఆరు సంవత్సరాలు గడిచాయి. రెండో ప్రపంచ సంగ్రామం ప్రారంభమైంది. అప్పటికి నా చదువు, ఉద్యోగ యత్నాలు పూర్తయ్యాయి – ఒక్క యత్నం ఫలించలేదు. మా మామయ్య నాకోసం పెట్టిన డబ్బు ఖర్చంతా వృథా ఐంది. పైగా, ఆయనా, మా అత్తయ్యా, ఇండియా అంతా యాత్రచేసి రావడంవల్ల ప్రావిడెంట్ ఫండంతా తరిగిపోయింది. నిరుద్యోగ సమస్యను గురించి బోలెడు కథలు వ్రాశాను. సమస్య పరిష్కారం కాలేదు; ఆంగ్లంలో యీ సమస్యను

పరిష్కరించడానికి కొన్ని సలహాలిస్తూ వ్యాసాలు వ్రాశాను; ఎవరూ వాటిని గుర్తించినట్లులేదు. కొన్ని సమయాలలో రాజకీయోద్యమంలో దిగి జైలు కెడదా మనిపించేది. అప్పుడు భుక్తికి లోటుండదు, కీర్తి దక్కుతుంది - పైగా జైలులో నే తలపెట్టినమహత్తర గ్రంథాన్ని రచించడానికి మంచి అవకాశా లుంటాయి. కాని రాజకీయాలలో దిగడం ఎట్లా? 'ఫరవాలేదురా అబ్బీ, యుద్ధం వొచ్చింది. దేవుడి ధర్మమా అంటూ నీ కేదో వుద్యోగం దొరక్కపోదు' అని మామయ్య ఓదార్చేవాడు.

"నాకు నచ్చిన ఉద్యోగం వొకటి ఖాళీ వొచ్చింది మామయ్యా. దరఖాస్తుకి, ఇంటర్వ్యూకి వో ఏభైరూక లుంటే నాకు లభించొచ్చు." వెంటనే మామయ్యకి వో భావం తట్టింది.

"ఒరే! కుముదంగారింటికెళ్ళి, ఆరునెల్ల అద్దె, ముందుగా యిస్తారేమో కనుక్కురా" అని నన్ను సాగనంపాడు.

సూర్యుడు పడమటింట్లో గృహప్రవేశం అవగానే తలుపువేసి, కిటికీ కర్టెన్లు దగ్గరగా లాగడానికి సిద్ధపడినట్లు, మేఘాలు చురుగ్గా విహరిస్తున్నాయి. కుముదంగారి దొడ్లో ఎన్నో యిదివరకు చూడని కొత్తమొక్కలు, చెట్లు వున్నాయి. కొబ్బరి చెట్లు మేఘాలతో ఏకీభవిస్తున్నట్లు ఆకాశంలోకి పొడుచుకుని ఆడిపోతున్నాయి. జామచెట్టు వార్ధక్యం వొచ్చినదాని మల్లే ముడుచుకుంది. ఆ అల్ప ప్రకృతిలో వొక్కటీ నారాక గుర్తించి నట్లులేదు. చెట్ల కొమ్మలకి ఉయ్యాల అమర్చబడి వుంది. నూతి పళ్ళెం

వేపునుంచి వోపాపాయి పాకుతూ వొస్తున్నాడు. వాడితో ఏదో మాట్లాడాను; వాడి కేమి అర్థంకాక, జీవిత రహస్యం తెలుసుకోలేక పోయిన వేదాంతిలా, నిరర్థకపు ఏడ్పు మొదలు పెట్టాడు. చెట్ల గుబురు మధ్య కుముదం మేఘాలమధ్య నక్షత్రంలా కదిలింది. నక్షత్ర బృందంలోంచి విడిపోయిన పిల్ల కాంతిలా మరోచిన్నపిల్ల పరుగులెత్తింది. కుముదం చేతిలో గునపాన్ని గిరవాటెట్టి పమిటని పళ్ళమధ్య బిగించి పైకిలాగి, చేతులోవున్న మొక్కని నాముందు పడేసింది.

"చూశావా, యీ ఆకుని ఎట్లా తినేస్తోందో యీ చిత్రమైన పురుగు? ఈ పురుగు అందమైనదే, మొక్కా అందమైనదే. అందాన్ని చూచి అందం వోర్చలేదుకదూ?" నే నేమీ మాట్లాడలేదు.

"నువ్వొచ్చి ఎంతసేపైంది? పిలవలేక పొయ్యావా? లేక నాపేరే మరచిపొయ్యావా?" అంది.

"లేదు లేదు. - యీ తోటని చూస్తూ ఆశ్చర్యపడుతున్నాను."

"ఇందులో ఆశ్చర్యం ఏముంది? విత్తనంవేసి, నీళ్ళు పోస్తే మొక్క మొలుస్తోంది. ఇవన్నీ సాధారణమైన మొక్కలు," అని కొంటెగా నవ్వింది.

"మా పాపని చూశావా, పెద్దదైంది, నువ్వింక సంబంధాలు చూచిపెట్టే సమయం వొస్తోంది. వాడు మా రెండోవాడు. ప్రకృతంటే పడదు. అన్నింటిని ధ్వంసం చేస్తాడు. వీడు మా మూడోవాడు - వీడికి నాలా ప్రపంచంతో నిమిత్తంలేదు. పాపా! బకెట్ తీసుకురా..."

అమ్మాయి బకెట్ తీసుకొచ్చింది. కుముదం చిన్నప్పుడు జామపండు తింటున్న దృశ్యం జ్ఞాపకం వొచ్చింది.

"కొంచెం నీళ్లు తోడిపెట్టు. చేతులు కడుక్కుంటా" అంది.

నేను తోడాను. బకెట్‌లో సగం నీళ్లు నూతులోనే పడిపోయాయి.

"నీళ్ళు తోడడం తెలీకపోతే ఎట్లా? నీ భార్య బైటుంటే నువ్వే తోడుకోవాలి."

"నా కింకా పెండ్లి కాలేదు."

నమ్మలేనట్లు చూసి, మౌనంలో పడింది.

"నాకు ఉద్యోగంలేదు. ఎందుకు పెండ్లి?" అని స్వగతంలా చెప్పుకున్నాను.

కుముదం నామాట వినిపించుకోలేదు. చీరని పాదాలపైకితీసింది. ఆమె శరీరానికి మాతృత్వం పరిపూర్ణత నిచ్చింది. వయస్సు మొహానికి వైరాగ్యాన్నిచ్చినా, వార్ధక్యాన్నివ్వలేకపోయింది. మట్టిలో నీళ్ళుకలిపిన వింత సువాసన నన్నావరించింది. మొహాన్ని పమిటతో తుడుచుకుంది. తడిసిన పమిట పర్వతశిఖరానికి ఎగబాకేవాడికి పట్టుదొరికి నట్లు, వక్షాన్ని అదిమిపట్టుకుంది. సూర్యుడి కడసారి కిరణం, లోయలో నీడని వొక్కసారి వెలిగించి మాయమైంది. సంధ్య అందాన్ని అనుభవించాలన్నవాడు కుముదంతో వుండాలి. సంధ్యలో నే నెన్నడూ చూడని ప్రత్యేక శోభని ఆనాడు చూడగలిగాను.

"దా, ఉయ్యాలమీద కూర్చో - వెనక విరిగినకుర్చీ యింతవరకూ బాగుచేయించనే లేదు...ఏదో వొకటి వొస్తూనే వుంటుంది. తీరిక లేదు."

కుముదం గడ్డిలో కూర్చుంది. అమ్మాయి, వేదాంతిని ఎత్తుకుని లోపలి కెళ్లింది. రెండోవాడు, ధ్వంసం చేసేందుకు ముక్కలు లేవన్నట్లు, గడ్డినే దిమ్మిశాలా మర్దిస్తున్నాడు.

"మనం కలుసుకుని చాలారోజులైంది తెలుసా?"

"ఆహా, దగ్గరగా ఆరుసంవత్సరాలైంది."

"నువ్వు చాలా మారిపోయావు."

మంచికా చెడుకా అని అడుగుదా మనుకున్నాను. నన్ను మాట్లాడనీకుండానే - "ఎక్కడెక్కడి కెళ్ళిందీ, ఏం చేస్తున్నదీ - అంతా చెప్పు నిన్నుగురించి" అంది.

"ఉత్తర హిందూస్థానం వెళ్ళా - ఎక్కడా మంచి ఉద్యోగం దొరకలేదు. మామూలుగా ఇండియాలో మనిషి ఇరవై మూడేండ్లకంటే ఎక్కువకాలం జీవించడంటూరు సాంఖ్య శాస్త్రకారులు. దానిప్రకారం నేను తొమ్మిదేండ్ల క్రితమే చనిపోయి వుండాల్సింది. అల్పాయువుగలవాళ్ళు సుఖంగా వుండగలరు యీ దేశంలో."

కుముదం సానుభూతిచూపి, జాలిపడుతుందని నా ఉద్దేశాన్ని ఎంతో కసితో భయంకరంగా ప్రకటించాను.

"ఉద్యోగం లేకపోతేనేం? దానికోసం జీవితాన్ని తిట్టొచ్చా! ఉద్యోగ్యంలో పడ్డావంటే, అదేలోకం. మరి ప్రపంచంతో సంబంధం వుండదు. ఎవరికో బానిసవై స్వేచ్ఛ

పోగొట్టుకుంటావు. ఆడాళ్ళకి వుద్యోగం చేసే బాధ లేకపోవడం ఎంతో మెరుగు.''

ఉద్యోగం చెయ్యనందుకు నన్ను అందర్లా ఆక్షేపిస్తూ, తిట్టకుండా, మెచ్చుకున్నందుకు నేను కుసుమదాన్ని కొంత గౌరవించాను.

''పాశ్చాత్య దేశాలలో స్త్రీలు, పొట్టకూటికోసం భర్తలకు మనవాళ్ళల్లా అమ్ముడుపోరు'' అన్నాను. అప్రయత్నంగా రెండు గడ్డిపువ్వులను తెంచి జుట్టులో అముర్చుకుంది.

''మన కీ ప్రపంచంలో ఎవరో వొకరికి దాస్యం చెయ్యడము తప్పదేమో ననిపిస్తుంది. దేవుడు సైతం భక్తుడికి దాసుడు కావడం లేదు?''

''నా కింతవరకూ ఉద్యోగం యివ్వని యీ సంఘాన్ని గౌరవించి, ఎందుకు సేవ చెయ్యాలో నాకు తెలీడంలేదు.''

''నీకు వుద్యోగం లేకుండా వుంటేనే నువ్వు సుఖపడతావు. ఐనా నీ పిచ్చి కాకపోతే, నీకు ఉద్యోగం ఎవరో యిచ్చేదేమిటి? నువ్వేదో గొప్ప కార్యం చెయ్యడానికి పుట్టానని వెనక చెప్పావు. అది నేను నమ్ముతాను. అది చెయ్యి. స్వతంత్రించి, నచ్చినపని చెయ్యడమే మంచిది. నేను దాస్యం సహించలేను.''

''దాస్యం లేకుండా, ప్రేమని సాధించటం ఎట్లా?'' ఈప్రశ్న ఎందుకడిగానో నాకు తెలీదు.

''ఔను, మనుష్యులతో చేసే ప్రేమలో దాస్యంవుంది.

సంసారంలో బంధనాలు; ప్రేమలో బంధనాలు; అసలు పుట్ట డమే సృష్టికి దాస్యం. వీటికి దూరంగా వుంటే మంచిది.''

కుముదం, హృదయానికి దగ్గరగావుండే విషయాలని గురించి ముచ్చటిస్తుంటే వినడం అదే మొదటిసారి. నేను అనుకున్నంతటి అమాయకురాలు కాదని స్పష్టమైంది.

''ప్రపంచంతో నిమిత్తం లేకపోతే, అసలు గొప్ప కార్యం సాధించటం దేనికి?''

''సాధించటంలో మనుషులకు దాస్యం చెయ్యడం లేదు కాబట్టి, ప్రపంచాన్ని మనం ఏదేనా కోరి, ఆశిస్తే దాన్ని యివ్వదు. మనం దేన్నీ ఆశించకుండా, దూరంగా వుండి చెయ్యగలిగిన పనిచేస్తుంటే ప్రపంచం పాదపాదాల ముందు వాలుతుంది.''

కుముదం, స్వతంత్రాన్ని అంత కాంక్షిస్తుందని నే నెప్పుడూ అనుకోలేదు. భర్త, పిల్లలు, సంసారం, ఉద్యోగం- తుదకి ప్రేమ - యివన్నీకూడా దాస్యమే నంటుంది. స్వతంత్రంలేని బ్రదుకు వృథాట. ఒక విలువని అంతగా కోరినప్పుడు, దాన్ని వారు పొందలేకపోతే, నా హృదయం బాధతో క్రుంగిపోతుంది. జనసామాన్యానికి స్వేచ్ఛనిస్తే దుర్వినియోగం చేస్తారు. దానివిలువ తెలియనివాళ్ళకి అది వ్వడం మహాపాపం. కాని, దేన్నీ వుపయోగించుకోకుండా, కేవలం విలువల ఆరాధనతో తృప్తిపడే కుముదంలాంటి వ్యక్తులకి స్వేచ్ఛ లేకపోవడం, ప్రపంచానికి అనర్థం.

''నేను నువ్వైతే ఏంచేద్దునో తెలుసా? నదీతీరాన్ని చిన్న తాటాకు పాక కట్టుకుంటాను. అందులోకూర్చుని,

ఊరికే చదువు నేర్పుతానని చాటింపు వేయిస్తాను. మొదట ఏ పదిమంది పొలంకాపులో వొస్తారు. సాయంత్రం, వాళ్ళకి బోధించడం మొదలెడతాను. ఇరుగు పొరుగునుంచి, అనేక మంది కర్షకులు, కూలివాండ్లూ చదువుకోసం వొస్తారు. ఉత్తచేతుల్తో రాకుండా, వొకరు వుప్పు, చింతపండు, వొకరు పాలు - అల్లా నాకా్కవల్సినవాటిని వాళ్ళే సిద్ధం చేస్తారు. వారు నా శిష్యబృందం. వాళ్ల కష్టసుఖాలు పంచుకుంటూ; వారి తగాదాలకి తీర్పు చెపుతా - అంతే; నా జీవితం వృథాఅనుకోను.''

సూర్యుడు అస్తమించిన చిహ్నాలు పడమటిలోయలో సేదతీర్చుకుంటున్నాయి. ఓపిగలేక కదలలేకపోయిన మేఘ ద్వయం, దక్షిణగాలి పిలుపికి కదలిపోతున్నాయి. ఇది నారాజ్యం అన్నట్లు వొంటినక్షత్రం కన్నుమీటింది. ప్రకృతిలో నిశీథకీటకాలు తన్మయరొదసాగించాయి. మాసంభాషణ విని విని విసుగెట్టిన పుష్పాలు చీకటి ప్రశాంతంలో ముడుచుకున్నాయి. తూర్పుఆకాశం జడవిప్పుకుంది. కుముదం తలలో తెల్లవెంద్రుక మెరిసింది.

''తెల్లవెంద్రుక'' అన్నా, వున్నచోట వేలు మెదుపుతూ,

''ఎన్నాళ్ళని యవ్వనానికి శరీరం దాస్యంచేస్తుంది? దానిదోవ అది చూచుకుంటుంది.''

నాకళ్లు చెప్పలేని విచారంతో తడిసినై. నేను అడ్డి మాట అడగడం మరిచిపొయ్యాను. ఆ తన్మయతతో బరు

నెక్కిన వాతావరణాన్ని డబ్బుప్రశంసతో పాడుచెయ్యడం నాకిష్టంలేకపోయింది.

వెడతానని లేచా; మంచిదంది; పోనీ, యీ రాత్రి యిక్కడుండి వెళ్ళకూడదా అంటుందనుకున్నా. కుముదానికి మర్యాదంటే ఏమిటో తెలీదు.

* * *

మరి నాలుగు సంవత్సరాలు గడిచిన్నై; యుద్ధం సాగుతోంది. నాకు మాత్రం ఉద్యోగం చిక్కలేదు. నేనుదాన్ని గురించి విచారించే రోజులు వెళ్ళిపోయాయి.

రోజులు గడిచిపోతున్నాయి. నాతిండికి ఎట్లాంటి లోపమూ రాలేదు. పస్తున్న రోజు వొకటికూడా లేదు. దూబరా ఖర్చుకి, నాకే అలవాట్లులేవు. సిగరెట్లుకాల్చను. సినిమాల కెళ్ళను; పుస్తకాలు కొనుక్కోను. అవంటే యిష్టం లేకకాదు. అవి నాఅందుబాటులో లేవు. మా మామయ్య చనిపోయి ఆరునెలలైంది. మా అత్తతప్ప నాకు 'నా' అన్న వాళ్ళు ఎవ్వరూలేరు. ఇది కొంత మేలే. నామీద అధికారం చలాయించేటందుకు, వొక్కరూలేరు. నాకీ సంఘం తిండిపెట్ట నక్కరలేదు. నాబ్రదుకు నన్ను బ్రతకనిస్తే చాలు. మా అత్తయ్య వున్నయింటికి అద్దె యిచ్చుకోలేక పోతోంది. తుదకి నిశ్చయించుకుంది, సొంత యింట్లోకెళ్ళి కాపరం పెట్టడానికి. ఖాళీచేయించే ఏర్పాట్లకి నన్నుపంపింది.

ఆనాడు ఆదివారం. రాత్రి ఎనిమిదిదాటింది. సన్న చంద్రుడు పల్చటి మేఘంవెనక దాక్కున్నాడు. కుముదం

గారి యింట్లో దొడ్లో అంతా నిశ్శబ్దం. వీధులోకొచ్చాను. తలుపు తాళం వేసి ఉంది. ఎక్కడికెళ్ళారో నాకు బోధపడ లేదు. కాసేపు అరుగుమీదకూర్చున్నా. తెలిసినవాళ్ళని కనుక్కుందామని వీధులోకి నడిచాను. అప్రయత్నంగా బజార్లోకి వెళ్ళాను. కిల్లీ దుకాణం ముందు బల్లమీద కుముదం పెద్దకూతురు పాపాయి నెత్తుకొని కూర్చుంది. నన్ను కేకేసింది.

"మా ఆఖరు చెల్లాయిని చూశారా? నాలుగోది - దీన్ని స్వరాజ్యం అని పిలుస్తుంది మా అమ్మ...చూడండి. వూ ఏడుస్తుంది...ఊరుకో నా చిట్టితల్లీ."

"ఇట్లా యిక్కడెందుకున్నావ్, మీ అమ్మ ఎక్కడ?"

"మా అమ్మ ఆస్పత్రిలోవుంది. ఇది ఏడుస్తుంటే ఆడించడానికి బైటికి తీసుకొచ్చాను. మా నాన్న హోటలి కెళ్ళాడు."

స్వరాజ్యాన్ని బుజాన్ని వేసుగుని హాస్పిటల్ కి వెళ్ళాం. కుముదం మంచంపై పండుకుంది. పైన తెల్లటి గుడ్డ కప్పివుంది. చిన్నబల్ల మంచం దగ్గరగా లాగి కూర్చున్నాను,

"ఏం జబ్బు?"

"న్యూమోనియా."

న్యూమోనియా అంత ప్రమాదకరమైన వ్యాధని నా కంతవరకూ తెలియదు. మాట్లాడేటందుకు ఏమీ కనుపించక, దిగులుగా కూర్చున్నాను. కుముదం నీరసంగా నవ్వ

డానికి యత్నించింది. మొహం మెలికలు తిరిగింది - పెద వులు పవిత్రంగా వొణికాయి.

"నన్ను గురించి కథ వ్రాయవూ?" అంది. నేనేం చెప్పను?

"ఈ జబ్బు విషయం నాకు తెలీనే తెలీదు. పోనీ వో వుత్తరముక్క వ్రాయించకూడదా? డాక్టర్లు ఏమం టున్నారు?"

"జబ్బు చెయ్యడం సాధారణమైంది. పదిమందితోనూ చెప్పుకునేందుకు అందులో ఏం విశేషముంది? ఫరవాలేదం టున్నారు డాక్టర్లు - కాని వాళ్ళకేం తెలుసు?" అని కళ్ళు మూసింది.

నాకక్కడినుంచి వెళ్ళిపోవా లనిపించింది. ఏదో చెప్పాలని వుంది. కాని నోరాడదు. నా శరీరం వొణికి పోతోంది. అనుకోకుండా, నా చెయ్యి ఆమె చేతిపైన ఆనించ బొయ్యాను. అద వేలుకి వుంగరంవున్న చెయ్యి. వెంటనే చేతిని లాగేసుకుని తెల్ల దుప్పటిలో దాచేసుకుంది.

"నువ్వెందుకు పెండ్లి చేసుకోలేదో నాకు తెలుసు - నాకోసం."

అంటూ మళ్ళా కళ్ళుమూసింది. నాగుండె స్థూల త్వాన్ని పోగొట్టుకుని ద్రవంగా విడిపోయి, దోవ తెలియక తిరుగుతూన్న రక్తనాళాలగుండా, వుద్వాలవేగంతో ప్రవ హిస్తూంది. కన్నీటిని నా వేళ్ళతో తొలగించుకొన్నాను. ఆమె పవిత్ర శరీరంపై నాకన్నీరు పడి మలినం చెయ్యడం పాపం అనిపించింది. మొహాన్ని పక్కకు తిప్పేసుకున్నాను.

కిటికీ అద్దంలోనుంచి నిశీథి నల్లత్రాచులా లోకాన్ని అల్లుకుంటోంది.

“నీ స్థితిచూస్తే నాకెంతో బాధగావుంది” అన్నా కన్నీరు దిగమింగుకుని.

“నాకు నిర్విచారం. ఈ ప్రపంచం నాదైతేగా విచారానికి. నువ్వుమాత్రం...” కళ్ళుమూసి మరి విప్పలేదు. ఈ లోకంలో మూసుకుని మరోలోకంలో తెరుచుకున్న నేత్రాలు కుముదానివి.

* * *

ఆత్మని దిగవిడిచి వొచ్చినవ్యక్తి మళ్ళా దానిలోకే చేరుకుంది. చెట్లు, నదులు, మేఘాలు, చీకటి వెలుగుల మొదలైనవాటితో గిరగిరా తిరిగిపోతున్న విశ్వంలో కలిసిపోయింది.

నిశీథిలోకి నడిచి వెళ్ళాను. మహా తర అనుభవం సంభవించినప్పుడు, తార్కికజ్ఞానం, విమర్శనాది పని చెయ్యవు. ఇంద్రియాలు శరీరాన్ని వ్యాపి, కొత్త జన్మనిస్తాయి. భావోద్రేకంలో నిమగ్నుడై చైతన్యప్రవాహంలో కొట్టుకుపోతున్నవ్యక్తి, వొక్కసారి సృష్టి రహస్యాన్ని, మెరుపులా ఛేదించి మరోఅవతారం దాలుస్తాడు. చచ్చి బ్రతకడంలాంటిది ఆ అనుభవం.

కుముదం నా వివాహాన్ని గురించి చెప్పిన ఒకసారి మాటలు నాలో అధోలోకాన్ని [illegible] పరికాన్ని నాకళ్ళముందు ప్రదర్శించినట్లయింది. ఆమెకోసం పెండ్లి

చేసుకోలేదట! మానసిక శాస్త్రజ్ఞులు, మానవుడి బుర్రలో అధోలోకం వుందంటారు. అక్కడ అతని రహస్యమైన కోర్కెలు, బైట చెప్పుకోలేని తీరని వాంఛలు అడవి మృగాలలా తిరుగుతాయట. అవి అన్నిసమయాలలోనూ బయటికి రాకుండా బుద్ధి కాపలాకాస్తుంది. అవి బైటికి రాలేకపోయినప్పటికీ, ఎప్పుడో, నిద్రలోనో, బలహీనమైన స్వప్నావస్థలోనో గర్జించి వాటి వునికిని బాహ్యప్రపంచానికి వెల్లడిచేస్తాయట. ఇంతకాలం నా బుద్ధి వాటిని కట్టేసింది ఆనాడు ఆమె చెయ్యిపైన చెయ్యివేసినప్పుడు బుద్ధిని తొలిగించి వాంఛలు బైటికొచ్చినట్లు, కుముదం గ్రహించి, తన చేతిని లోపల దాచుకున్నట్లు వాటిని వెనక్కి నెట్టి నోరు నొక్కింది. ఆమెలో ఏమీ విశేషం లేదని సమాధాన పరుచుకున్నా, ప్రాకృతికమైన ఆకర్షణ లోపల దాగివుండి, నా జీవితంపై అంత వొత్తిడి కలిగించినందుకు ఆశ్చర్య పడ్డాను.

తననిగురించి కథ వ్రాయమంది. ఆరుగంటల పరిచయంతో, ఆరువందలమాటలతో నా ప్రపంచాన్ని తల క్రిందులుచేసి, నా జీవితపరమావధినే తారుమారుచేసిన కుముదాన్ని గురించి ఏంకథ వ్రాయను?

క్రథ తెలుగుభాషకు కొత్తదికాదు. నిజానికి ఏ భాషకూ, చివరికి ఆటవికుల భాషకైనా, అది కొత్తదికాదనే చెప్పవచ్చు.

పాశ్చాత్య సాహిత్యంతో సన్నిహిత పరిచయ మేర్పడిన పిమ్మటనే, దాని ప్రభావం ఆంధ్ర రచయితపై బలంగా పడిన పిమ్మటనే నవలవలె, ఆత్మకథవలె, ఆత్మాశ్రయ కవిత్వంవలె చిన్న కథ సయితం తెలుగుతోటలో పూచిందని చెప్పవలసివుంటుంది.

పాశ్చాత్య ప్రభావ సంజనితమైనది కాబట్టి, తెలుగు చిన్న కథపై సహజంగా పాశ్చాత్య రచయితల ప్రభావం కొంత వరకు కానవస్తుంది. ప్రపంచ కథాసాహిత్యంలోనే గౌరవస్థానానికి అర్హమైన కథలు అనేకం తెలుగులో వున్నందున, ఈ 'కథా మంజరి' సంకలన సంకల్పంలో 'ఏ కథను ఎన్నుకొనడం?' అనేది కాక, 'దేన్ని విడిచిపెట్టడం?' అన్నది ఒక పెద్ద సమస్యగా పరిణమించింది.

వినోద, విజ్ఞాన, వికాసాలకు దోహదమిచ్చే గ్రంథజాలాన్ని ప్రజాబాహుళ్యానికి అందుబాటులో వుండగల ధరలకు అందించడమే ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్న దక్షిణభాషా పుస్తక సంస్థ వారు ఏర్పరచిన పుటలసంఖ్య పరిమితుల లోపల కథావస్తువులో, శిల్పంలో వీలైనంత వైవిధ్యాన్ని ప్రతిబింబింపజేయడానికి ఈ సంకలనలో ప్రయత్నించబడింది.

ఉత్తమమైన ఆంధ్ర కథా సాహిత్యానికి ఈ సంపుటి వాకిటిగా ఉపకరిస్తుంది. పాఠకుల మన్ననలకు పాత్రం కావడంద్వారా ఇట్టి సంకలనలు మరెన్నో వెలువడ్డానికి ఇది దోహద మివ్వగలదని ఆశిస్తున్నాను.

నార్ల వెంకటేశ్వరరావు

'తొలిపలుకు'లో

